# విజ్ఞప్తి

"మనము స్వరాజ్యమును అహింసా సిద్ధాంతముపై నిర్మించదలచుకొన్నయెడల మనము గ్రామాలకు వాటిస్థానము వాటి కివ్వాలి. గ్రామాలు నశిస్తే భారతదేశంకూడా నశిస్తుంది. అప్పుడది భారతదేశమే కాదు! గ్రామాలను సేవించడమే స్వరాజ్యస్థాపనము. తక్కిన దంతా వట్టికల" అని విశ్వసించారు పూజ్య బాపూజీ. విశ్వసించడమే కాదు—తనకు తాను ఒక గ్రామీణుడుగా భావించుకొని గ్రామాల అవసరాలను తీర్చేటందుకు అనేక సంస్థలను స్థాపించారు. వారి శారీరక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులను చక్కబరచడానికి శాయశక్తులా కృషి చేసారు. గ్రామాలలో నేడు ప్రబలుతున్న అజ్ఞాన, దారిద్ర్యాలను నిర్మూలించడమే ఆయన ముఖ్య ధ్యేయము. ఈ పరిస్థితులను చక్కదిద్దడానికి ఆయన చేసిన కృషిని, ఆయన అభిప్రాయాలను ఆయన అనేకమారులు యంగిండియా, హరిజన్ పత్రికలయందు వ్యాసరూపముగాను, ఇతర గ్రంథములయందును వెలిబుచ్చారు.

స్వాతంత్ర్య సముపార్జనానంతరము గ్రామాలకు పరిపాలనయందు, అభివృద్ధి కార్యక్రమములయందు ఎక్కువ ప్రాముఖ్యత లభించింది. తమ అవసరములను తాము తెలిసికొని, ఏమి చేయవలెనో, ఏమి చేయకూడదో అను విషయ

మును నిర్ధారణచేసికొనవలసిన బాధ్యతకూడ వారిపైన పడి నది. ఇట్టి సందర్భములో దేశములోని వివిధ ప్రాంతాలలో గ్రామాభ్యుదయమునకు, సమాజ సంక్షేమమునకు సంబంధిం చిన ప్రయోగములు అనేకము జరుగుచున్న సమయములో గ్రామ పునర్నిర్మాణ సమస్యనుగూర్చిన గాంధీజి అభిప్రాయ ములను మనము అవగాహన చేసుకొని ఆచరణకు దిగవలసిన అవసరము ఎంతైనా వున్నది. కాన గ్రామపునర్నిర్మాణ మును గూర్చిన గాంధీజీ అభిప్రాయములను సంగ్రహంగా సమీకరించి ఆంగ్లములో నవజీవన్ ట్రస్టువారిచే ప్రచురింప బడిన "Rebuilding our Villages" అను గ్రంథమును తెలుగులోనికి అనువదించి ప్రచురించుట సమంజసమని భావించినాము.

స్వరాజ్య స్థాపనానంతరము భారతదేశము రూపు రేఖలు ప్రతి విషయములోను ఎట్టుల తీర్చి దిద్దవలయునో గ్రహించిన మహాత్మా గాంధీ రచనలను తెలుగులోనికి అను వదించి ఆంధ్రప్రజానీకమునకు అందించు నుద్దేశముతో గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖవారిచే నెలకొల్పబడిన గాంధీ సాహిత్య ప్రచురణాలయము ఇప్పటివరకు రెండు గ్రంథము లను ప్రచురించినది. కీ॥ శే॥ స్వామి సీతారాంగారు అనువ దించిన "ఢిల్లీ దినచర్య" గాంధీజీ చరణకమలములకు సమ ర్పించిన ప్రథమ పుష్పము. మల్లవరపు విశ్వేశ్వరరావుగారిచే అనువదింపబడిన "నా మతము" ద్వితీయ పుష్పము. గ్రామా

లను ఎట్టి పునాదులపై నిర్మించవలెనో తెలుపుచున్న "మన గ్రామ పునర్నిర్మాణము" అను ఈ గ్రంథము తృతీయ పుష్పము.

ఆంధ్ర ప్రదేశమందుగల వివిధ సంస్థలు, వ్యక్తులు వీనిని నాదరించి, ఉపయోగించిననాడే యీ ప్రచురణల లక్ష్య సిద్ధి చేకూరగలదు. ఇంటింటా యీ రచనలకు సముచిత స్థానము లభించగలదని మా హృదయపూర్వకమైన వాంఛ. జాతిపిత యొసగిన యీ సందేశ, ఆదేశాలను ఆంధ్ర ప్రజానీకానికి అందిచ్చుటలో మాతోబాటు వికేంద్రీకరణ ఫలితముగా నూతనముగా ఏర్పడిన జిల్లాపరిషత్తులు, పంచాయితీ సమితులు, విద్యామంత్రిత్వశాఖ, సమాచారశాఖ బాధ్యత వహింపవలెనని మా విజ్ఞప్తి.

ఇట్లు
విధేయుడు
మల్లవరపు వెంకట కృష్ణారావు
అధ్యక్షుడు
గాంధి స్మారకనిధి, ఆంధ్రశాఖ
గాంధి సాహిత్య ప్రచురణశాఖ

శ్రీనగర్
కాకినాడ
3-8-1960

# సంపాదకుని పీఠిక

దేశములోని వివిధ ప్రాంతములలో గ్రామాభ్యుదయమునకు సమాజ సంక్షేమమునకు సంబంధించి అనేక ప్రయోగములు జరుగుతూన్నప్పుడు గ్రామ పునర్నిర్మాణమును గూర్చిన గాంధీజీ అభిప్రాయములను సంగ్రహంగా ఒకచోట సమీకరించుట సముచితమని తోచింది.

గాంధీజీ, తానొక గ్రామీణుడుగా భావించుకొని గ్రామంలో ఉండి, గ్రామస్థుల అవసరాలను తీర్చేటందుకనేక సంస్థలను స్థాపించి, వారి శారీరక, ఆర్థిక, సాంఘిక, నైతిక పరిస్థితులను అభివృద్ధిపరచడానికి తన శక్తివంచన లేకుండా ప్రయత్నించిన విషయం అందరూ ఎరిగినదే. గ్రామాలలో ఏమీ చేయవలెనో ఏమి చేయనక్కరలేదో ఆయనకు స్పష్టంగా తెలుసు. ఆయన పాశ్చాత్య విద్యావంతుడైనప్పటికీ మనదేశంలోని విద్యావంతులకు పల్లెల్లో నివసించే ప్రజాసామాన్యమునకు మధ్యగల వ్యత్యాసమును పూరింపగలిగినారు. ఆయన గ్రామస్థులతో ఐక్యమై వారి సమస్యలను వారి దృష్టితో చూడగలిగిన ప్రతిభాశాలి.

అంతేగాక మన ఆధ్యాత్మిక సంప్రదాయముల కనుగుణంగా ఆయన ప్రజల ఆత్మాభివృద్ధికి, శీలమునకు ప్రముఖ స్థానమిచ్చారు. ఈనాడు మనము ఇతర ప్రభావముల ఒత్తిడి వలన కేవలం భౌతిక సౌభాగ్యమును ఉత్పత్తిచేయడమే

ప్రధానంగా భావిస్తున్నాము. నైతిక ఆధ్యాత్మిక చింతలకు వెలియైన భౌతికఫలముల కోసం పరుగుపెట్టడం వలననే నిశ్చయంగా ప్రపంచం ఆత్మవినాశనమునకు పాల్పడుతూన్నదని గాంధీజీ అభిప్రాయం.

కనుకనే ఆయన గ్రామపునర్నిర్మాణ ప్రణాళికలు గ్రామస్థుల పేదరికమును ఆకలిని రూపుమాపవలయుననే తీవ్రమైన కోరికతో ఉద్దేశింపబడి యుండడమేకాక దిక్కులేని అట్టడుగు ప్రజానీకమునకుసైతము ఆత్మవిశ్వాసమును స్వయం పోషకత్వమును కల్పించి, శాంతి, అహింస, సాంఘిక న్యాయము, స్వాతంత్ర్యము మొదలగు ఆధ్యాత్మిక ఫలితములను సాధించవలయుననే దృఢనిశ్చయంతో కూడా భావింపబడి యున్నవి. ప్రపంచం ఈ ఆదర్శాలను ఉద్ఘాటిస్తూనేఉన్నది. కాని అది అంతకంతకు వాటికి దూరంగానూ ప్రతికూలం గానూకూడా నడుస్తూన్నట్లు కనిపిస్తూన్నది. అనగా ప్రపంచం దౌర్జన్యం, యుద్ధం, సాంఘిక దురన్యాయం, పరద్రవ్యాకర్షణ, బడుగుప్రజను అడుగుకు త్రొక్కడం, ప్రజాభావాలను అణచివేసి ప్రత్యేక మూసలో కఱగిపోసినట్లు తయారు చేయడం ప్రజలలో ఎక్కువమందికి స్వాతంత్ర్యం నిరాకరించడం, సర్వశక్తిసంపన్నమైన ప్రభుత్వస్థాపనము, సమస్త కార్యములను ప్రభుత్వమే నిర్వహించటం మొదలగు పద్ధతుల వైపుకు ప్రయాణం చేస్తూన్నది. మన ముద్ఘాటిస్తూన్న ఆదర్శాలను మనము అందుకోవలెనంటే ప్రజలనిత్యజీవితంలో

వాటికి పునాదులు వేయవలెనని గాంధీజీ స్పష్టంగా గ్రహించారు. కాబట్టి గ్రామ పునర్నిర్మాణమును గూర్చిన గాంధీజీ అభిప్రాయములలోని గొప్ప విశేషమేమంటే, మన గ్రామాభ్యుదయ ప్రణాళికలలో కేవలం ప్రజల ఆర్థిక జీవితాభివృద్ధికి సంబంధించినవే గాక, అందరికీ సమానమైన న్యాయము, స్వాతంత్ర్యము, శాంతి చేకూర్చేటందుకు తగిన పునాదులు స్థాపింపబడవలయునని వెల్లడించడమే. దీనిని మనము మనస్సులో పెట్టుకోనియెడల, ఆయన సూచనలలోని పరమార్థమును బాగా గ్రహించలేము. గాంధీజీ ప్రబోధిస్తూన్న ఖాదీనిగూర్చి విమర్శకుడు చేసే విమర్శ భౌతిక ప్రయోజనమనే తన సొంత కొలబద్దతో కాక, భౌతిక, ధార్మిక ప్రయోజనములనే గాంధీజీ కొలబద్దతో కొలిచియుండగలిగిన యెడల చాలావరకు తగ్గి ఉండేది.

ఈ చిన్ని పుస్తకము గాంధీజీ గ్రామాలలో జరుగవలసిన పనులనుగూర్చి ఎలా భావించి ఉన్నారో బహు సంగ్రహంగా తెలుపుట కుద్దేశింపబడినది. సంఘ సంస్కరణము, మహిళాసంక్షేమము, ఆహారము, పశుపోషణము, మొదలైన ముఖ్యవిషయాలు చాలా సంగ్రహంగా ఉదాహరించడమో, అసలే వదలివేయడమో జరిగింది. నవజీవన్ ట్రస్టువారీ విషయములపైన గాంధీజీ అభిప్రాయములను వివరంగా ప్రత్యేక గ్రంథములుగ ప్రచురించి ఉండడమే ఇందుకు కారణం. గ్రామ పునర్నిర్మాణమునకు సంబంధించిన ప్రధాన విషయములను సూచించడమే ఈ పుస్తకంలో మేము తలపెట్టిన పని.

ఇతర వివరములు తెలుసుకోవలయుననే ఉత్సాహం కలవారు తక్కిన గ్రంథములను పరికింపవచ్చును. గ్రామ పారిశుద్ధ్యము, గ్రామకార్యకర్తలకు సలహాలు మొదలగువిషయము లీ గ్రంథములో వివరముగా వ్రాయబడినవి. అవి ఇతర గ్రంథములలో లేవు.

ఈ వ్యాసముల శీర్షికలు మూలగ్రంథముల శీర్షికలతో చాలా సందర్భాలలో సరిపోలవు. విషయమునకు తగినట్లుగాను ప్రస్తుత గ్రంథానికనుగుణంగాను శీర్షిక లుంచబడినవి. కాని వ్యాసములలోని విషయం మాత్రం మూలగ్రంథములోనిదే. అయితే కొన్ని సందర్భాలలో వ్యాసములలోని కొన్ని భాగములు మాత్రమే ప్రచురించబడినవి. వదిలిపెట్టబడిన భాగాలు సూచింపబడలేదు.

సెప్టెంబరు 1, 1952. భరతన్ కుమారప్ప



# విషయసూచిక

# 1
# గ్రామాల స్థానము

గ్రామాలను సేవించడమే స్వరాజ్యస్థాపనము. తక్కిన దంతా వట్టికల.

యంగ్ఇండియా 26-12-'29.

గ్రామాలు నశిస్తే భారతదేశం కూడా నశిస్తుంది. అప్పుడది భారతదేశమే కాదు. ప్రపంచంలో దాని ధర్మసందేశం వినబడకుండా పోతుంది.

హరిజన్ 29-8-'36.

భారతదేశమంతటి ప్రాచీనత గలిగినట్టి అతి పురాతనమైన గ్రామాలుగల భారతదేశమా? లేక విదేశీ ప్రభుత్వం సృష్టియైన నగరాలుగల భారతదేశమా? మనకు కావలసినది - అనేది నిర్ణయించుకోవాలి. ఈ నాడు నగరాలు ఆధిపత్యం వహించి గ్రామాలను పీల్చి పిప్పిచేస్తూన్నవి; గ్రామాలు పతనమై పాడుపడిపోతూన్నవి. ఆ నగరాల ఆధిపత్యమే పోయినప్పుడు గ్రామాలకవి అనుయాయ సేవచేయవలసి వచ్చునని నా ఖాదీ చిత్తవృత్తి చెప్పుచున్నది. గ్రామాలను దోచుకొనుట నిర్మాణయుత హింసయే యగును. మనము స్వరాజ్యమును అహింసా సిద్ధాంతముపై నిర్మించదలచుకొన్న యెడల మనము గ్రామాలకు వాటి స్థానము వాటికివ్వాలి.

హరిజన్ 20-1-40.

# 2

# గ్రామపునర్నిర్మాణము (సాధారణం)

## స్వరాజ్యంలో గ్రామకార్యనిర్వహణము

గ్రామాలకు పోయే స్త్రీ పురుషు లందఱు, గ్రామస్థులకు తమ పల్లెలను పరిశుభ్రంగానూ స్వయంపోషకంగానూ ఉంచుకోవడం తమ కర్తవ్యమని చెప్పాలి. ఈ పనులు తమకు స్వరాజ్య ప్రభుత్వం చేసిపెడుతుందని అనుకోకూడదు. గ్రామ పరిశ్రమలు అదృశ్యం కావడంతో మన గ్రామాలు కూలి పోవడానికి తయారుగా ఉన్నవి. గ్రామ పరిశ్రమలను పున రుద్ధరించడం వలననే వానిని తిరిగి పునరుజ్జీవింప చేయగలము. ఈ పరిశ్రమలలో రాట్నం కేంద్ర స్థాన మాక్రమిస్తుంది. తక్కినవి రాట్నం చుట్టూ తేలికగా వాటికవే యేర్పాటు కాగలవు. ఈ విధంగా ప్రతివారు పరిశ్రమయొక్క విలువను గ్రహించగలరు. రాష్ట్ర క్షేమాని కనుగుణమైన పరిశ్రమ లలో అందఱూ పనిచేస్తూండినయెడల అనేక లక్షల రూపాయిలు ప్రజల కొఱకు ప్రజలే ఆదా చేసుకొనవచ్చును. స్వయం సంపూర్ణత, స్వయం సహాయసిద్ధాంతాలను ఆచరణలో పెట్టుకొనేయెడల ప్రజలు మిక్కిలి తక్కువ పన్నులను చెల్లించవలసి ఉంటుందనీ, ప్రపంచంలోని యే యితర విధానము కంటెను కూడా ఈ విధానము వలననే తామెక్కువ సుఖంగా ఉండగలదనీ వారికి నిరూపించవచ్చును.

అహింస పునాదిగాగల స్వరాజ్యంలో ఎవ్వడూ ఎవ నికీ శత్రువుకాడు. ప్రతివాడు సాధారణ లక్ష్యాన్ని చేరడా నికి తనకు తగిన సాహాయ్యం చేస్తాడు. అందఱూ చదువ

గలరు, వ్రాయగలరు. వారి జ్ఞానం కూడా దినదినాభివృద్ధి చెందుతూ ఉంటుంది. జబ్బులు, రోగాలు చాలావరకు తగ్గి పోతవి. ఎవ్వడూ దరిద్రుడుగా ఉండడు. కూలివానికి యెప్పుడూ పని దొరుకుతుంది. అటువంటి ప్రభుత్వం క్రింద జూదానికీ, త్రాగుడుకూ, అవినీతికీ, వర్గద్వేషానికీ తావు లేదు. భాగ్యవంతులు తమ ఐశ్వర్యాన్ని వివేకంతో ఉప యోగకరంగా వినియోగిస్తారు. అంతేకాని, ప్రాపంచిక భోగాలకోసము, ఆడంబరం కోసము తమధనాన్ని దుర్వ్యయం చేయరు. కొద్దిమంది ధనవంతులు చలువరాతి దివ్యసౌధము లలో నివసిస్తూండడం, కోటానుకోట్ల ప్రజలు గాలీ వెలుతురూ లేని పాడుగుడిసెలలో పడిఉండడం జరుగకూడనిపని. హిందూ మహమ్మదీయ విభేదాలు, అంటరానితనము, భాగ్యవంతు లకూ, పేదలకూ కొండంత భేదము — ఇవి ఉండరానివి.

(గాంధీజీ రాజకోట ప్రజలను ప్రబోధిస్తూ చేసిన రెండవ ఉప న్యాసములోని భాగమునకు అనువాదము.)
హరిజన్ 25-3-'39

## గ్రామ స్వరాజ్యము

గ్రామ స్వరాజ్య మంటే సంపూర్ణ ప్రజారాజ్యమని నా అభిప్రాయం. గ్రామం తన ముఖ్యావసరములకోసం ప్రక్క వారిపైన ఆధారపడియుండకూడదు. కాని ఆధార పడవలసిన అనేక ఇతర విషయాలలో గ్రామాలు పరస్పరం ఆధారపడి ఉండాలి. అనగా ప్రతి గ్రామము తన ఆహార ధాన్యాలను, తన బట్టలకు కావలసిన పత్తినీ తాను పండించు

కోవాలి. పశువులకు బీళ్లు, పెద్దవారికి విహారభూములు, పిల్లలకు ఆటస్థలాలు ఉండాలి. ప్రతి గ్రామంలోను వీటికి కాగా ఇంకా ఎక్కువభూమి ఉండే పక్షంలో ఉపయోగకరములైన వాణిజ్యపు పంటలను పండించుకోవాలి. కాని గంజాయి, పొగాకు, నల్లమందు మొదలైన వాటిని మాత్రం పండించరాదు. గ్రామంలో ఒక నాటకశాల, పాఠశాల, ఒక గ్రామ చావడి ఉండాలి. శుభ్రమైన నీరు లభించేటందుకు తగిన జలాశయం కూడా ఉండాలి. ఈ పని గ్రామంలోకి మంచి నీటి చెఱువులను గాని, నూతులను గాని తగిన అదుపులో ఉంచడంద్వారా సాధించవచ్చును. ప్రాథమిక విద్యా పూర్తి అయ్యేవరకు నిర్బంధ విద్యావిధానం ఉంటుంది. సాధ్యమైనంతవరకు ప్రతిపనీ సహకార పద్ధతిపైన జరుగుతుంది. ఇప్పుడున్నట్లుగా సోపాన పరంపరగా ఉన్న అంటరానితనముతో కూడిన కులాలు అప్పుడుండవు. సత్యాగ్రహ నైపుణ్యముతో కూడిన అహింస, సహాయ నిరాకరణములు గ్రామసమాజమునకు అండదండలుగా ఉంటవి. ప్రతి గ్రామంలోను, గ్రామ రక్షణకోసం నిర్బంధంగా కాపలా కాయవలసిన మనుష్యుల పట్టీ ఒకటి ఉంటుంది. వారు ఆ పట్టీ ననుసరించి వంతులు ప్రకారం గ్రామానికి కాపలా కాయాలి. యుక్తవయసు వచ్చిన గ్రామస్థులందఱూ స్త్రీలూ, పురుషులు, కలసి కనీసపు యోగ్యతలుకల ఐదుగురు పంచాయితీ దార్లను యేటేటా ఎన్నుకొంటారు. వారే గ్రామపాలకులుగా ఉంటారు. వీరికి కావలసిన అన్ని అధికారాలు ఉంటవి. అయితే మనమంతా

అనుకొనే అర్థంలో శిక్షలు వేయడం ఉండదు. ఈ పంచాయతీయే, శాసనసభగా, న్యాయస్థానములుగా, కార్యనిర్వాహకవర్గంగా ఆ సంవత్సరమంతా పనిచేస్తుంది. గ్రామస్థుల నుండి శిస్తులు వసూలు చేసుకోవడమే పనిగాగల ప్రస్తుత ప్రభుత్వముయొక్క జోక్యంకూడా ఎక్కువలేకుండా, ప్రతి గ్రామమూ అటువంటి ప్రజాసత్తాకరాజ్యంగా చేసే వ్యవహరించుకొనవచ్చును. ప్రక్క గ్రామాలతోగానీ, ఏదో ఒకే కేంద్రంతోగానీ ఉండవలసిన సంబంధబాంధవ్యములను గూర్చి నేనిక్కడ పరిశీలించడంలేదు. గ్రామప్రభుత్వము యొక్క రూపురేఖలను విశదపఱచడమే నాపని. ఇందులో వ్యక్తి స్వాతంత్ర్యముపైన ఆధారపడిన నిష్కళంక ప్రజారాజ్యము కనిపిస్తుంది. వ్యక్తియే తనకు కావలసిన ప్రభుత్వమును నిర్మించుకోగలిగిన శిల్పి. అహింసా సిద్ధాంతమే అతనిని, అతని ప్రభుత్వాన్ని కూడా నడిపిస్తుంది. ఆయన, ఆయన గ్రామము కలసి ప్రపంచాన్ని ఎదుర్కోగలిగిన శక్తిగలిగి ఉంటారు. ప్రతి గ్రామస్థుడూ తనయొక్క, తన గ్రామము యొక్క గౌరవాన్ని రక్షించుకోవడానికి ప్రాణములనైనా సమర్పించవలయుననే ధర్మసూత్రానికి కట్టుబడి ఉండడమే అందుకు కారణం.

నేను రచించిన ఈ రూపవర్ణనలో సహజంగా అసంభవమైనదేదీ లేదు. అటువంటి గ్రామాన్ని రూపొందించడానికి యావజ్జీవితకృషి అవసరమవవచ్చును. నిజమైన ప్రజారాజ్యముమీద కోరిక ఉన్నవాడెవ్వడైనా ఒక గ్రామాన్ని

తీసికొని అదే తన ప్రపంచము, తన కర్మక్షేత్రము అనుకొని
పనిచేస్తే మంచి ఫలితాలు కలుగగలవు. అతడు ముందుగా
గ్రామంలో పాకీవాడుగా, నూలువడుకువాడుగా, కాపలాదా
రుగా, వైద్యుడుగా, ఉపాధ్యాయుడుగా— అన్నీ తనే అన్న
ట్లుగా పనిచేయాలి. అతని దగ్గరకు తక్కిన పనుల కెవ్వరూ
రాకపోతే పాకీపని, వడుకు నూలు పనిచేస్తూ కూర్చోవాలి.

హరిజన్ 26-7-'42

## గ్రామ కేంద్రము

నేను భావిస్తూ ఉండిన గ్రామకేంద్రము మిక్కిలి
పటిష్ఠమైనది. నా ఊహాలోని గ్రామంలో వేయిమంది
జీవులు ఉంటారు. స్వయం సంపూర్ణసిద్ధాంతంపైన ఆ గ్రా
మాన్ని చక్కగా నిర్మాణం చేసినట్లయితే అది మంచి ఫలి
తాలను ప్రదర్శించగలదు.

హరిజన్ 4-8-'46

## సర్వతోముఖ గ్రామాభ్యుదయము

తాము తయారుచేసే వస్తువులు బయట వెంటనే అ
మ్ముడు పోయేటంత ఎక్కువ స్థాయిలో గ్రామస్థులు తమ
నైపుణ్యాన్ని పెంపొందించుకోవాలి. మన గ్రామాలు
సంపూర్ణంగా అభివృద్ధి నొందినప్పుడు ఉన్నతస్థాయికి చెందిన
కౌశల్యం, శిల్పనైపుణ్యంగల గ్రామస్థులకు కొదువ ఉండదు.
గ్రామాలలో కవులు, చిత్రలేఖకులు, శిల్పులు, బహుభాషా
కోవిదులు, పరిశోధకులుకూడా ఉంటారు. సంగ్రహంగా

చెప్పవలసివస్తే గ్రామాలలో లేని దేదీ జీవితంలో మనం పొంద దగినదిగా ఉండదు. ఈనాడు గ్రామాలు పెంటకుప్ప లుగా ఉన్నవి. రేపు గ్రామాలు చిన్నచిన్న నందనోద్యాన వనములుగా రూపొంది ఎవ్వరి మోసమునకూ ఎవ్వరి స్వార్థ మునకూ గురికాని బుద్ధిమంతులు నివసించేవిగా ఉంటవి.

ఈ పద్ధతులమీద ఇప్పటినుండే గ్రామాల పునర్ని ర్మాణం ప్రారంభం కావాలి. గ్రామాల పునర్నిర్మాణం తాత్కాలిక పద్ధతిలోగాక శాశ్వత పద్ధతిలో ఏర్పాటుచేయ బడాలి.

శిల్పము, కళ, ఆరోగ్యము, విద్య అన్నీ ఒకే ప్రణా ళికలో కలసి ఉండాలి. 'నయీ తాలీమ్'లో ఈ నాలుగు చక్కగా కలసి ఉన్నవి. ఇందులో వ్యక్తి, తల్లి కడుపులో ఉన్నది మొదలు పుట్టి పెరిగి చనిపోయేవరకు కావలసిన విద్య అంతా ఇమిడి ఉన్నది. కాబట్టి నేను మొదటినుండీ కూడా గ్రామాభ్యుదయ కార్యక్రమాలను, ఒకదానితో ఒకటి కలప డానికి వీలులేని ప్రత్యేక భాగాలుగా భావించడంలేదు. పైన చెప్పిన నాలుగు విషయాలను కలిపి పనిచేయడానికి అంగీక రిస్తాను. శిల్పము, చేతిపనీ, విద్యకు భిన్నమైనవిగా నేను భావించడం లేదు. పైపెచ్చు అవి విద్య నేర్వడానికి సాధ నములనికూడా నా అభిప్రాయము. కాబట్టి 'నయీ తాలీమ్' గ్రామపునర్నిర్మాణ ప్రణాళికలో కలసి ఉండాలి.

హరిజన్ 10-11-'46

### డబ్బుయొక్క స్థానము

(ఘనశ్యామదాస్ బిర్లాతో జరిగిన సంభాషణమునుండి)

"పెద్దపెద్ద మొత్తాలు వసూలుచేసి మీ పనిని ఎక్కువ ప్రదేశాలలో ఎందుకు విస్తరింప చేయకూడదు ?"

"వద్దు. నాకు కావలసినదాని కంటె ఎక్కువ వసూలు చేయడంలో నాకు నమ్మకం లేదు."

"అయితే మీరు ఇరవై, పోనీ పది, ఆదర్శగ్రామాలు నిర్మించారనుకోండి ?"

"అది అంత తేలికే అయితే మీ ధనముతో మీరే ఆ పని చేయగలరు. అంత తేలిక కాదని నాకు తెలుసు. డబ్బుతో గారడీ చేసి ఆదర్శగ్రామాన్ని మీరు సృజించ లేరు."

హారిజన్, 30-11-'35

డాక్టర్ - మాట్ (MOTT) : భారతదేశమునకు డబ్బు ఇచ్చేయెడల, యేమీ హానిలేని పద్ధతిని, దానిని వివే కముతో ఇచ్చే మార్గాలేమిటి ? డబ్బుకేమైనా విలువ ఉన్నదా ?

గాంధీజీ : వద్దు. డబ్బిస్తే అది కేవలం హాని కలిగి స్తుంది. కావలసివచ్చినప్పుడు దానిని సంపాదించుకోవాలి. మతప్రచార సంఘములకీయబడిన ఇంగ్లాండు, అమెరికా దేశ ముల డబ్బు మంచికంటె చెరుగు ఎక్కువచేసింది. దైవాన్ని ధనాన్ని ఒకేసారి కొలువజాలము. భారతదేశాన్ని సేవించే

టేందుకు ధనమును పంపగా దేవుడు వెనుకబడి పోయేవాడని, అందుకు ప్రతిఫలంగా ఎప్పుడో ఒకప్పుడు ఆయన కసి తీర్చు కొంటాడని నా భయం. అమెరికా దేశీయుడు 'మా ధనం మూలంగా మీకు ఉపకారం చేస్తా'మని అంటే నాకు గాబరాగా ఉంటుంది. నేను కేవలం వారిని "మీ ఇంజనీర్లను ధన సంపాదనకోసం కాక వారి శాస్త్రజ్ఞానముయొక్క ప్రయోజనమును మాకు కలుగచేసేటందుకు పంపమని' అడుగుతాను. ఆత్మవికాసమునకు సంబంధించినంతవరకు ధనాని కేమీ స్థానం లేదని నా అనుభవమువలన నాకు కలిగిన నిశ్చితాభిప్రాయం.

హరిజన్ 26-12-'36



# 3

# గ్రామ పారిశుద్ధ్యము

## గ్రామములను శుభ్రపరచుట

చెఱువులను నూతులను శుభ్రపఱచి వాటిని నిష్కల్మషంగా ఉంచడం, పేడకుప్పలను తీసివేయడం గ్రామాలలో శ్రద్ధగా చేయవలసిన పనులు. ప్రతిదినమూ, జీతాలతో పనిచేస్తూన్న పాకీవారివలెనే గ్రామాలలోని కార్యకర్తలు తమంతట తాము పనిచేయడం ప్రారంభించి, తుట్టతుదకు గ్రామస్థులే తమ పనులను తాము నిర్వహించుకోవలసి ఉంటుందని నిరంతరం వారికి జ్ఞాపకం చేస్తూఉండినయెడల అనతికాలంలోగానీ, ఆలస్యంగా గానీ వారు గ్రామస్థుల సహాయాన్ని తప్పకుండా పొందగలరు.

సందులను వీధులనూ అన్నిటినీకూడా ఎక్కడా చెత్తాచెదారం లేకుండా బాగుచేయవలయును. దానిలో కొంత భాగం ఎఱువుగా చేయవచ్చును. మఱికొంత కేవలం భూమిలోపాతివేయవలసి ఉంటుంది. ఇంకా కొంత ప్రత్యక్షంగా, సంపదగా మార్చివేయవచ్చును. కనిపించిన ప్రతి ఎముకా ఉపయోగకరములయిన వస్తువులు తయారుచేయుటకు తగిన విలువగల ముడిపదార్థము కాగలదు. లేదా దానిని పొడిచేస్తే ఫలప్రదమైన ఎఱువుగాకూడా అవుతుంది. దొఱికిన గుడ్డపేలికలు, చింపిన కాగితపు ముక్కలు కాగితంగా తయారు కాగలవు. ప్రోగుచేసిన మల మూత్రములు గ్రామములలోని

పొలములకు బంగారంవంటి ఎరువవుతుంది. ఒక అడుగు కంటె ఎక్కువ లోతులేకుండా త్రవ్విన భూమిలోని మట్టితో మల మూత్రములను కలిపిఉంచితే అది మంచి ఎరువవుతుంది. డాక్టరు పూర్ వ్రాసిన 'గ్రామ ఆరోగ్యశాస్త్రము' (Rural Hygiene) అనే గ్రంథంలో మల మూత్రాలను తొమ్మిది లేక పంద్రెండు అంగుళముల లోతుకు మించని గోతిలో పాతి వేయవలయునని వ్రాసినాడు. (ఇది నాజ్ఞాపకాన్ని బట్టి ఉదాహరిస్తున్నాను.) పైపైన ఉన్న మట్టి సూక్ష్మజీవులతో కలసి ఉంటుందనీ, దానిలోకి వెలుతురు గాలీ తేలికగా ప్రసరించడం వలన దానిలో కలిసిన మల మూత్రాలు ఒకవారం రోజులలో మంచి మెత్తని పరిమళంగల మట్టిగా మారిపోతుందనీ ఆ గ్రంథకర్త ఉద్ఘాటిస్తున్నాడు. ఏ గ్రామవాసియైనా దీనిని తనకు తాను పరీక్షించవచ్చును. కుండ కుంపట్లుగానీ, ఇనుప బొక్కెనలుగానీ గోతులలో ఉంచి, వాటిలో మల మూత్ర విసర్జనముచేసి వాటిని ప్రతిరోజూ అందు కేర్పాటు చేయబడిన స్థలములలో క్రుమ్మరించడంవలనగానీ, లేక చదరంగా త్రవ్వబడిన గోతులలోనే మల మూత్ర విసర్జనం చేయడం వలనగానీ, ఈ పనిని సాధించవచ్చును. మల మూత్రములను గ్రామసాముదాయక భూములలోగాని లేక వ్యక్తుల పొలములలోగానీ కూడా పాతివేయవచ్చును. ఈ పని గ్రామస్థుల సహకారం వలననే జరుగగలదు. అంతగా అయితే ఎవడో ఒక సాహసికుడైన గ్రామస్థుడు మల మూత్రాలను సేకరించి సొంత సంపదగా మార్చివేసికోగలడు. ప్రస్తుతం లక్షలకొలదీ

రూపాయిల విలువగల ఈ పంట ఎరువు ప్రతిరోజూ వృథాగా పాడయి వాతావరణాన్ని కంపుకొట్టేటట్లుగాచేసి రోగాలకు తావలమవుతూన్నది.

గ్రామాలలోని చెఱువులు విచక్షణా రహితంగా స్నానాలకు, బట్టలు ఉతుకుకోవడానికీ, త్రాగడానికీ, వంటచేసి కోవడానికీ కూడా ఉపయోగపడుతూన్నవి. వాటిలో చాలా సార్లు దున్నపోతులు దొర్లుతూ కనిపిస్తవి. ఊరిచెఱువు లింత దుర్మార్గంగా దుర్వినియోగం చేయబడుతూన్నప్పటికీ అంటు రోగాలతో గ్రామాలు నాశనం కాకుండా ఉండడమే ఆశ్చర్యం. గ్రామాలకు పరిశుభ్రమైన నీరు సరఫరా చేయ డానికి జరుగుతూన్న అశ్రద్ధయే గ్రామవాసు లనుభవిస్తున్న అనేక రోగాలకు కారణభూత మవుతూన్నదని ప్రపంచంలోని వైద్యశాస్త్రజ్ఞుల ఏకగ్రీవాభిప్రాయం.

ఈ పని భారతదేశంలోని పీడిత ప్రజానీకమునకు అంతు లేని ప్రయోజనకారియై విజ్ఞానప్రదము, శ్లాఘాపాత్రము, ఉత్సాహజనకము అయిన సేవ అని అంగీకరించవలసియు న్నది. ఈ సమస్యనుగూర్చి ఎలా వ్యవహరించాలో నేను వివరంగా వర్ణించి ఉన్నాననుకొంటాను. ఇందుకు హృదయ పూర్వకంగా పనిచేసే కార్యకర్తలుండి, వారు కలము పెన్సిలు ఉపయోగించేటంత తేలికగానూ, గర్వంగానూ చీపురు, పాఱ ఉపయోగించగలిగి నట్లయితే దాదాపు అసలు ఖర్చులేకుం డానే చేసుకోవచ్చును. వారికి కావలసిన పరికరాలు, ఒక

చీపురు, ఒక తట్ట, ఒక పార, ఒక తవ్వుగోల— వీనైతే ఒక అంటురోగ నివారణౌషధము (Disinfectant)—వెలిబూడిద, రసాయన శాస్త్రజ్ఞుడు సరఫరా చేసే యే అంటురోగ నివారణౌషధముతోనైనా తులతూగుతుంది. అయినప్పటికీ పరోపకార పారీణులయిన రసాయన శాస్త్రజ్ఞులు బాగా ప్రయోజనకరములై గ్రామీణులు తమ గ్రామాలలో చౌకగా తయారుచేసుకోగలిగినట్టి శోధనపదార్థములను మనకు తెలియజేయుదురుగాక !

హరిజన్, 8-2-'35.

## ఎరువు గోతులు

పంజాబు గ్రామ పునర్నిర్మాణ కమీషనర్ (Rural Reconstruction Commissioner) బ్రేన్ ఎరువుగోతులను గూర్చి ప్రచురించిన కరపత్రము నుండి ఉదాహరిస్తూ గాంధీజీ ఇలా వ్రాశారు :

ఇక్కడ చెప్పినదంతా ప్రతివారు అంగీకరించవలసినదే. "బ్రేన్" సూచించిన గోతులవంటి గోతులు సాధారణంగా సిఫారసుచేయబడుతూన్నవే. కాని "ఫూర్" సిఫారసు చేసినట్టి, పైపైన మట్టితో పూడ్చిపెట్టే పద్ధతి, యెక్కువ శాస్త్రీయంగానూ లాభప్రదంగానూ ఉంటుందని నా అభిప్రాయం. త్రవ్వేటందుకు, మళ్లీ తీసేటందుకు అయ్యే ఖర్చు ఈ పద్ధతిలో చాలాతక్కువగా ఉంటుంది. అంతేగాక ఇందువలన మలమూత్రాలు దాదాపు ఒక వారం రోజుల

లోనే మంచి ఎరువుగా మారుతాయి. భూమికి ఆరు లేక తొమ్మిది అంగుళాలపైన ఉండే క్రిమికీటకాదులు, గాలి, సూర్యరశ్మి, ఈ అన్నీ-ఆ మలమూత్రాలపైన సోకి వాటిని చక్కని ఎరువుగా తయారుచేయగలవు. మలమూత్రాలను లోతుగా పాతివేసినదానికంటె ఈ పద్ధతివలన అవి ఎక్కువ తొందరగా ఎరువుగా మారుతాయి. అయితే మనం ముఖ్యంగా జ్ఞాపకముంచుకోవలసినది గ్రామాలలోని చెత్తా చెదారములను ఏయే పద్ధతులతో తీసివేయాలనేది కాదు. గ్రామవాసుల ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్నీ అభివృద్ధిచేసే ద్వివిధ ప్రయోజనాలకోసం దానిని పాతిపెట్టి ఎక్కువ పంటలు పండించడానికి తగిన ఎరువుగా తయారుచేసే విధానమును మనము జ్ఞాపకముంచుకోవాలి.

మలమూత్రాలుగాక ఇతరములయిన భౌమికలు, ఆకులు, తొక్కు మొదలగువాటిని ప్రత్యేకంగా పాతిపెట్టవల యునని జ్ఞాపకం పెట్టుకోవాలి. ఆరోగ్యమును గూర్చి శ్రద్ధ వహించడమే గ్రామపునర్నిర్మాణమునకు మొదటిమెట్టనేది నిస్సంశయం.

హరిజన్, 1-3-'35

## పెంట గోతులు

ఒక విలేఖకుని ప్రశ్నలు :

(1) మల విసర్జనమునకు రెండవసారి ఒకే స్థలంలో ఒక అడుగులోతు గోయి త్రవ్వవలెనంటే, ఎంతకాలమునకు త్రవ్వ వలెను ?

(2) సాధారణంగా వరి విత్తనాలు చల్లిన వెంటనే రైతులు పొలాలు దున్నుతారు. విత్తులు చల్లడానికి పూర్వం ఒక వారం ముందుగా మలమును పాతివేసినట్లయితే పొలాలు దున్నేటప్పుడు ఆ మలం పైకివచ్చి పనివాళ్ల పాదాలను ఎడ్ల పాదాలను మురికి చేయదా ?

(1) 'పూర్' సిద్ధాంతం ప్రకారం పైపైన పాతిపెట్టితే మహా అయితే పదిహేను రోజులు కాగానే నిరభ్యంతరంగా విత్తులు చల్లవచ్చును. ఒక సంవత్సరం అయిన తరువాత అదే స్థలం మళ్లీ పాతరకు ఉపయోగించవచ్చును.

(2) మలము చక్కని సువాసనగల ఎరువుగా మారక ముందు విత్తనాలు చల్లనూకూడదు, చల్లడానికి వీలూలేదు. కనుక మనుష్యుల పాదాలు కాని ఎడ్ల పాదాలు కాని మురికి అవుతాయ్యనే ప్రశ్నే లేదు. మలము ఎరువుగా మారిన పిమ్మట ఎవ్వరైనాసరే నిస్సందేహంగా దానిని చేతితోకూడ తీసికోవచ్చును.

హరిజన్, 13-4-'35

## మల వినియోగము

ఒక గ్రామకార్యకర్త ప్రశ్నింపగా గాంధీజీ ఇలా వ్రాశారు :

వర్షకాలంలో కూడ, మనుష్యులు త్రొక్కని చోట గ్రామవాసులు మలమూత్ర విసర్జనము చేయవలెను. మలమును పాతిపెట్టవలెను. గ్రామస్థులు పొందిన శిక్షణ సరియైనది

కాకపోవడం వలన ఈ విషయం కష్టతమ మయినది. సిండీ గ్రామంలో, గ్రామవాసులు వీధులలో మల విసర్జనము చేయకుండా దగ్గరనున్న పొలాలలో ఆ పనిచేసి ఆ మలమును మట్టితో కప్పవలయునని మేము ప్రోత్సహిస్తూన్నాం. రెండు నెల లీ విషయంలో ఎడతెగకుండా పనిచేసి మున్సిపల్ సభ్యుల యొక్కయు తదితరులయొక్కయు సహకారమును పొందినందు వలన ఆ గ్రామస్థులు సాధారణంగా వీధులను పాడుచేయకుండా మానివేశారు. యజమానులు తమ పొలములలోకి గ్రామస్థులు బయలుకు పోవడానికి దయతో అంగీకరించారు. కాని వారు తాము విసర్జించిన మలముపైన మట్టివేసి కప్పడానికి మూర్ఖంగా నిరాకరిస్తూన్నారు. 'నిజంగా ఈ పని పాకీవానిది. మలమును కళ్లతో చూడడమే పాపం. పైగా దాని పైన మన్ను కప్పడం అంతకంటె పాపం' అని వారంటారు. అటువంటి నమ్మకం కలిగేటట్లు వారికి చెప్పడం జరిగింది. కాబట్టి కార్యకర్తలు ఈ పని ఓనమాలదగ్గరనుండీ ప్రారంభించాలి. ఇంతకు పూర్వం గ్రామస్థుల మనస్సులలో నాటుకొని పోయిన అభిప్రాయాలను పూర్తిగా తుడిచివేయాలి. అయితే మన ప్రచారంలో మనకు నమ్మకం ఉండాలి. ప్రతిరోజూ ఉదయం పాకీపని మనం పట్టుదలగా చేస్తూ ఉండాలి. ఇంత మాత్రంతో చాలదు. మనం గ్రామస్థులపై చిట్టుబుస్సులాడకుండా కూడా ఉండాలి. అప్పుడు వారి మూఢత్వం సూర్యకిరణాలముందు మంచు మాయమైనట్లు మాయమవుతుంది. తరతరాలనుండీ గడ్డకట్టుకొనిపోయిన అజ్ఞానము కొద్ది

మాసాల ప్రయోగాత్మక శోధనలతో పాటు. సింద్రీలో వానకాలంలో చేయవలసిన పనికి మేము తయారవుతున్నాము. సహజంగా భూస్వాములు లక్షణంగా తమ పైరులను కాపాడుకో వలసిఉంటుంది. కనుక వారిలో అనేకులు ఇప్పటివలె స్వేచ్ఛగా వారి పొలాలలోనికి ఇతరులను రానీయజాలరు. కాబట్టి పొలాలగట్లు చెడకొట్టకుండా అలాగే ఉంచి, తమ భూమిలో ఆ గట్లలోపలకి కొన్ని అడుగుల దూరంలో అడ్డుకట్టుకొంటే, గట్లకూ, ఆ అడ్డుకూ మధ్య విసర్జనకు ఉపయోగించిన భూమి రాబోయే వ్యవసాయ తరుణంనాటికి మంచి ఎరువు కట్టబడి ఉంటుందని మేము రైతులకు సలహాయిచ్చాము. భూస్వాం ములు తమ పొలాలలో మల విసర్జనమునకు ప్రజలను తామంతట తాము పిలిచే రోజులుకూడా వస్తూన్నవి.

డాక్టరు 'ఫౌలర్సు' అంచనా ప్రకారం ఒక మనిషి ఒక పొలాన్ని ప్రతిరోజూ మలవిసర్జనమునకు ఉపయోగిస్తే, యేడాదికి రెండు రూపాయిల విలువగల ఎరువు దానిమీద పడుతుంది. అయితే ఈ అంచనా సరియైనది కాకపోవచ్చును. కాని మల విసర్జనము వలన పొలము బలపడుతుందనే విషయం మాత్రం నిశ్చయం. సరాసరి మలమునే ఎరువుగా పైరులకు ఉపయోగించవచ్చునని ఎవ్వరూ సూచించలేదు. మలము మట్టితో కలసిన కొన్నాళ్లకు అది ఎరువుగా మారి భూమిని బలపరుస్తుందని వారి అభిప్రాయం. మలం మట్టిలో కలిసిన పిమ్మట, వ్యవసాయం చేయడానికి భూమిని దున్నేముందు అది కొన్ని మార్పులను పొందవలసి ఉంది. ఈ విషయంలో

జరిగిన పరిశీలనలో యేమీ తప్పు కనిపించదు. నిర్ణీతకాలం తరువాత మలముతో నింపిన పాతరను తీసి చూసినప్పుడు మట్టిలో చెడుకంపు లేకుండా ఉండి, మలముయొక్క చిన్నెలు కూడా కనపడకుండా మంచివాసన కొడుతూఉంటే అప్పుడు ఆ భూమి విత్తునాటడానికి తగిఉంటుంది. ఈ విధముగా నేను అన్ని పైరులకూ కడచిన ముప్పది సంవత్సరాలూ మలమును ఉపయోగించాను. అత్యంతమైన ప్రయోజనం కలిగింది.

హరిజన్, 11-5-'35

*కంపోస్టు ఎరువు*

సాధ్యమైనంత ఎక్కువ విస్తృతంగా కంపోస్టును అభివృద్ధి చేయవలయుననే అభిప్రాయంతో ఈ నెలలో క్రొత్త ఢిల్లీలో కంపోస్టు మహాసభ జరిగింది. పట్టణాలకు పల్లెలకూ కూడా సంబంధించిన ప్రణాళికనుగూర్చి అందులో అనేక తీర్మానములు చేయబడినవి. ఈ తీర్మానాలు కేవలం కాగితపు తీర్మానాలు కాకుండాఉంటే చాలా మంచివీ, ఉపయోగకరములైనవీ కూడా. యావద్భారత దేశంలోనూ అవి ఆచరణలోకి వస్తాయా అనేదే ముఖ్యాంశము. భారత దేశంలోని జనసామాన్యం ఈ విషయంలో హృదయపూర్వకంగా సహకరిస్తే ఈ దేశంలో అన్నానికి కొఱతలేకుండా పోవడమే కాకుండా ఇంకా ఎక్కువగాకూడా పండించవచ్చును. ఈ స్వాభావికమైన ఎరువు (Organic manure) ఎప్పుడూ భూమిని బలం చేస్తూనే ఉంటుంది. కాని బలాన్ని

క్షీణింపచేయదు. ప్రతిరోజు వృథాగా పారవేసే చెత్త చెదారములు జాగ్రత్తగా కంపోస్టు చేయబడినప్పుడు అది బంగారం వంటి ఎరువుగామారి లక్షలాది రూపాయిలను మనకు ఆదా చేస్తుంది. అంతేకాక ధాన్యము, పప్పుగింజలు ఇంకా అనేక రెట్లెక్కువగా పండించుకోవచ్చును. పైగా ఈ వృథాగా పారపోస్తూన్న పెంటపోగులను సరిగా ఉపయోగించుకోవడం వలన మన పరిసరాలుకూడా శుభ్రంగా ఉంటవి. పరిశుభ్రత దైవత్వానికి క్రిందిమెట్టు అవడమేగాకుండా అది ఆరోగ్యాన్ని పెంపొందిస్తుంది.

హరిజన్. 28-12-'47



# 4

# గ్రామ ఆరోగ్యము

## వైద్యసహాయ పరిమితి

అఖిల భారత గ్రామపరిశ్రమల సంఘం ప్రారంభింప
బడినప్పుడు చాలామంది కార్యకర్తల కార్యక్రమంలో,
దాదాపు వైద్యసహాయ మొక్కటే పనిగా ఉండకపోయినా,
వైద్యసహాయం మాత్రం అందులో ప్రముఖస్థానం వహిం
చింది. గ్రామస్థులకు ఉచితంగా మందులు పంచిపెట్టడానికి
అల్లోపతి, ఆయుర్వేదం, యునానీ, హోమియో మందులు
వేరు వేరుగా గానీ, అన్నీ కలిపిగాని పంచిపెట్టడానికీ, ఈ
సహాయం యేర్పాటు చేయబడినది. మందుల వర్తకులు,
చౌకగా అమ్మే మందులు కొన్ని ఈ కార్యకర్తలకు ఉచి
తంగా ఇవ్వడానికి సంసిద్ధంగా ఉన్నారుకూడా. బహుశా
వారికి ఉచితంగా యిచ్చినందువలన వారి మందులు ఇంకా
ఎక్కువగా అమ్ముడు పోవచ్చుననే స్వార్థబుద్ధితో కూడా
ఇస్తూండవచ్చును. కాని పాపం రోగులుమాత్రం కార్య
కర్తలు సదుద్దేశంతో ఈ పనిచేస్తూన్నప్పటికీ, వారి అజ్ఞానము
అత్యుత్సాహములకు బలి యవుతూన్నారు. ఈ మందులలో
ముప్పాతిక భాగం వట్టి నిరుపయోగములు కావడమే కాక
ఇవి పుచ్చుకొన్నవారికి ప్రత్యక్షంగా కాకపోయినా పరో
క్షంగానైనా హానికరము లవుతూన్నవి. అందులో కొన్ని
మందులు రోగులకు తాత్కాలికోపశాంతి కలిగించినప్పటికీ,

వాటికి బదులుగా మఱికొన్ని మందులు పల్లెటూరి దుకాణంలో తప్పకుండా దొఱికి తీరుతాయి.

కాబట్టి ఇప్పుడు నేను వర్ణించిన వైద్యసహాయ పద్ధతిని పూర్తిగా అ. భా. గ్రా. ప. సం. వదిలివేస్తున్నది. ఆరోగ్య, ఆర్థిక విషయాలను గుఱించి ప్రబోధించడమే దాని ప్రధాన కర్తవ్యం. ఇవి రెండూ పరస్పర సంబంధంకలవి కావా! లక్షలాది ప్రజలకు ఆరోగ్యమే మహాభాగ్యం కాదా? వారందఱికీ వారి బుద్ధి విశేషంగాక వారి శరీరాలే ఐశ్వర్యాన్ని సమకూర్చే ప్రధాన సాధనాలు. కాబట్టి ఈ సంఘం రోగాలు రాకుండా చేసుకొనే ఉపాయాలను ప్రజలకు ప్రబోధిస్తుంది. లక్షలాది ప్రజలు తినే ఆహారం వారికి పుష్టి కలిగించేది కాదని స్పష్టంగా తెలిసిన సంగతే. వారు తినేది కూడా దురుపయోగం చేస్తారు. వారికి ఆరోగ్యాన్ని గూర్చి యేమీ తెలియదు. గ్రామ ఆరోగ్య విధానం యెంతపాడుగా ఉండడానికి వీలుందో అంతపాడుగానూ ఉన్నది. కాబట్టి ఈ లోపాలను తొలగించి గ్రామస్థులను సామాన్య ఆరోగ్య సూత్రాలను అవలంబించేటట్లు చేస్తే, ఇప్పుడు వారనుభవిస్తూన్న జబ్బులు చాలావరకు, డబ్బుఖర్చు లేకుండాను, విశేష ప్రయత్నం లేకుండానుకూడా నయమవుతయి. కాబట్టి ఈ సంఘం ఔషధాలయాలను స్థాపించదు. మందుల రూపంలో గ్రామస్థులు మనకు సరఫరా చేయగలిగిన వస్తువులను గూర్చి ఇప్పుడు విచారణలు జరుగుతూన్నవి. సతీశ

బాబు యొక్క చౌకచికిత్సలు* ఆ సందర్భంలో జరుగుతూన్న ఒక ప్రయత్నము. అవి నమ్మడానికి వీలులేనంత సులువుగా ఉన్నవి. అయినప్పటికీ ఆయన ఔషధాల ప్రయోజనం తగ్గకుండా వాటి సంఖ్యను పూర్తిగా తగ్గించవలెననే ఉద్దేశంతో ప్రయోగాలు చేస్తూన్నాడు. దుకాణంలో దొరికే ఔషధాలను తీసికొని వాటిని పరిశీలించి, బ్రిటిష్ ఔషధగుణదీపికలో వాటికి ప్రతిగా వున్న మందులతో పోల్చి చూస్తున్నాడు. అమాయకులైన గ్రామస్థులగు వారికి తెలియని ఈ మాత్రలు, ఈ భేషజపు నీళ్ల ప్రమాదం నుండి తప్పించవలయునని ఆయన కోరిక.

హరిజన్ 5-4-'35

## వైద్య సహాయము

ఒక గ్రామకార్యకర్త ఇలా వ్రాస్తున్నాడు :

"నూరు ఇళ్లుగల ఒక కుగ్రామంలో నేను పనిచేస్తూన్నాను. వైద్యసహాయంకంటెకూడ ముందుగా ఆరోగ్యశాస్త్రము, ఆరోగ్యరక్షణలనుగూర్చి శ్రద్ధవహించవలసిందని మీ రాదేశించారు. అయితే ఒక గ్రామస్థుడు జ్వరంతో బాధపడుతూ సహాయం కోరినప్పుడు కార్యకర్త యేమిచేయాలి? నేనింతవరకూ ఫల్లెటూరి దుకాణంలో దొరికే దేశీయ ఔషధాలను వాడవలసిందని వారికి సలహాయిస్తున్నాను."

జ్వరము, మలబద్ధకము, మొదలైన మామూలు జబ్బులకు కార్యకర్తలను సహాయం కోరినప్పుడు వారు చేయగలిగిన

* "హోమ్ అండ్ విలేజి డాక్టర్." సతీశచంద్ర గుప్త వ్రాసిన గ్రంథం. ఖాదీ ప్రతిష్ఠానం, 15 కాలేజీ స్క్వేర్ — కలకత్తా పుటలు xxiv+1,287 ఖరీదు : రు. 10/-

సహాయం తప్పకుండా చేయవలసిందే. రోగం ఫలానా అని స్పష్టంగా తెలిసినప్పుడు ఊరి అంగడిలో దొరికే మందు చాలామంచిది, చాలా చౌక అనేది నిస్సందేహమైన విషయమే. ఔషధాలను ఉంచుకోవలసివస్తే, ఆముదము, క్వినైన్, ఉడుకు నీళ్లు, బాగా పనిచేసే మంచి మందులు. ఆముదం స్థానికంగా దొరుకుతుంది. సెన్నా ఆకు (సునాముఖి ఆకు) కూడా అదే పనికి ఉపయోగపడుతుంది. క్వినైన్ జాగ్రత్తగా వాడాలి. ప్రతి జ్వరమునకు క్వినైన్ వాడనక్కరలేదు. ప్రతి జ్వరము క్వినైన్ వలన తగ్గదుకూడా. చాలా జ్వరాలు పూర్ణోపవాసంతోనో, అర్ధోపవాసంతోనో తగ్గిపోతాయి. ధాన్యాహారము, పప్పులు, పాలు తీసుకోవడము మాని, పళ్లరసము, ఎండుద్రాక్షపళ్లతో కాచిన నీరు, బెల్లంతో కాచిన నీటిని నిమ్మరసముతోకాని, చింతపండు రసముతోకానీ తీసికోవడం అర్ధోపవాసం. బాగా కాచిన నీరు మిక్కిలి పటిష్ఠమైన మందు. ఉడుకు నీరు ఔషధంగా బాగా పనిచేస్తుంది. అది విరేచనసాధకగా పనిచేస్తుంది. వంటికి చెమట పట్టించి, జ్వరాన్ని తగ్గిస్తుంది. అది మిక్కిలి క్షేమకరమైన, చౌక అయిన శోధనం. అది త్రాగవలసిన అవసరం కలిగినప్పుడు నోరు పట్టడానికి తగినంతగా చల్లార్చి త్రాగాలి. ఉడుకు నీరు అంటే కేవలం వేడినీరు కాదు. నీరు కాగుతూన్నప్పుడు బుడగలు వచ్చి, ఆవిరి రావాలి.

కార్యకర్తలకు తాము చేయతగినది స్పష్టంగా తెలియనప్పుడు స్థానిక వైద్యుని చేతిలో సర్వస్వము వదిలిపెట్టాలి.

స్థానిక వైద్యుడు లేకపోయినా ఉన్నప్పటికీ ఆయన నమ్మడా నికి వీలైన మనిషి కాకపోయినా— దగ్గరగా నున్న ఒకానొక పరోపకార బుద్ధిగల వైద్యుని సహాయం పొందాలి.

ఆరోగ్య రక్షణనుగూర్చి శ్రద్ధ తీసికోవడమే రోగ నివారణకు కూడా అత్యంత ప్రయోజనకరమైన మార్గమని కార్యకర్తలు గ్రహించాలి. ప్రకృతియే అత్యుత్తమమైన వైద్యుడని వారు జ్ఞాపకముంచుకోవాలి. మనిషి పాడుచేసిన దానిని ప్రకృతి బాగుచేస్తూన్నదని వారు తెలుసుకోవాలి. మనిషి దానికి మాటి మాటికీ అడ్డం తగులుతూంటే అది శక్తివిహీన మవుతూన్నట్లు కనిపిస్తున్నది. బాగుచేయడానికి వీలులేని పరిస్థితిలో అది తప్పనిసరిగా తన ప్రతినిధిని, మృత్యువును పంపిస్తుంది. అది అప్పుడు దేహికి పనికిరాని పాత తొడుగును తీసివేసి, క్రొత్త తొడుగు ఇస్తుంది. కాబట్టి ప్రతి మనిషికీ, అతనికి తెలిసినా, తెలియకపోయినా, ఆరోగ్య రక్షణ, ఆరోగ్య ప్రచారము చేసే కార్యకర్తలు ఉత్తమ సహాయకులూ, వైద్యులుకూడా.

### ఔషధ సహాయము

వివిధ సంస్థలనుండి నాకు వచ్చే నివేదికలనుబట్టి ఔషధ సహాయము గ్రామకార్యక్రమంలోను, సాంఘిక సేవ లోను ప్రధానపాత్ర వహిస్తున్నది. ఔషధములను పంచి పెడతానని ఎవరు ప్రకటించుకొన్నా అతని చుట్టూ అనేక చోట్లనుండి రోగులు మూగుతారు. వారి కతడు మందులు

ఇస్తాడు. ఇందువల్ల ఈ మందుల మనిషికి యేమీ కష్టంలేదు. అతనికి రోగాలను గురించిగాని రోగచిహ్నములను గురించి కాని, యేమీ తెలియనక్కరలేదు. మందులా, అతనికి ఉపకారబుద్ధిగల ఔషధ విక్రేతలనుండి ఉచితంగా వస్తాయి. ఇక చందాలా, పీడిత ప్రజానీకంకోసమేదో ధర్మం చేశామనే ఆత్మసంతృప్తితో విచక్షణ రహితంగా డబ్బిచ్చేవారిదగ్గర నుండి రానేవస్తాయి.

ఈ రకం సంఘసేవ వట్టి సోమరితనపు పనిగానేకాక తఱచు అరిష్టంగాకూడా కనిపిస్తుంది నాకు. రోగి తనకిచ్చిన మందు మ్రింగడంతప్ప ఇక నేమీ చేయవలసిన అవసరం లేదని తలచినప్పు డది అపకారమే చేస్తుంది. మందు తీసి కొన్నందువలన ఆయన యేవిధంగానూ మెఱుగు కాకపోగా పై పెచ్చు పూర్వంకంటె దుస్థితికి వస్తాడు. ఏమీ ఖర్చులే కుండా చిన్నచిన్న జబ్బులను నయంచేసేటందుకు ఒక మాత్ర గానీ, కాసిన్ని మందునీళ్లుగానీ దొఱుకతవనే నమ్మకం ఆయ నకు కలిగినందున మాటిమాటికీ ఆ మందుకోసం ఆశిస్తూం టాడు. ఉచితంగా ఆ మందు ఆయనకు లభిస్తూండడం వలన, ధర్మంగా ఏమీ పుచ్చుకోకూడదనే ఆయన ఆత్మగౌరవం నశిస్తుంది.

మఱొక రకం ఔషధ సహాయం ఉన్నది. అది శ్రేష్ఠ మైనది. రోగస్వభావాన్ని గుర్తెఱిగి, ఆ రోగం ఎందుకు వచ్చిందో, అది రాకుండా చేసికోవడానికి మార్గాలేమిటో

రోగికి చెప్పి మందు లిస్తూంటారు. అటువంటి సేవాపరాయ ణులు రాత్రీ పగలూ అనకుండా అకాలంలో కూడా పరుగెత్తు కొని పోయి రోగులకు సహాయం చేస్తారు. అట్టి విచక్షణా జ్ఞానంతో కూడిన సహాయం పరిశుభ్రతను, పునరారోగ్య మును పొందే పద్ధతిని నేర్పు ఆరోగ్యశాస్త్రంగా పరిణా మిస్తుంది. కాని అటువంటి సేవాసక్తి చాలా తక్కువ. నివే దికలలో ఔషధ సహాయము అనే పేరుతో కనపడే విష యాలు, చాలావరకు, ఔషధ సహాయంలో వలెనే తగిన జ్ఞానము లేకుండా, శ్రమలేకుండా ఉండే మఱికొన్ని పనుల కోసం చందాలు సంపాదించడానికి ప్రకటనలుగా మాత్రమే పనికివస్తూన్నవి. కాబట్టి సాంఘికరంగంలో పనిచేసే కార్య కర్తలందఱూ, పట్టణవాసులుగానీ, గ్రామవాసులుగానీ, వారి సేవా కార్యక్రమంలో ఔషధసహాయమున కెంత మాత్రమూ ప్రాముఖ్యత నీయకూడదని నా ఆదేశం. అసలాపనిని గూర్చి యేమీ ప్రసక్తి లేకుండా ఉండడం మఱీమంచిది. కార్య కర్తలు తమ తమ స్థలాలలో రోగాలు రాకుండా ఉండే పద్ధతు లవలంబించడం క్షేమకరం. వారి మందులు సాధ్య మైనంత తక్కువగా ఉండాలి. మామూలు దుకాణాలలో దొరికే మందులను పరిశీలించి వాటి ప్రముఖ గుణాలను తెలిసికొని సాధ్యమైనంత వఱకు వాటిని వాడాలి. మాకు 'సింధీ'లో కలుగుతూన్న అనుభవాన్ని బట్టి, వేడినీళ్ళు, ఎండ, పరిశుభ్రమైన ఉప్పు, సోడా, అప్పుడప్పుడు ఆముదము, క్వైనైన్ వాడుతూండడం చాలా సందర్భాలలో ఉపయోగ

కరంగా ఉంటూన్నదని ఇతర కార్యకర్తలుకూడా తెలుసుకో వలసియున్నది. తీవ్రమైన రోగాలతో బాధపడుతూన్నవారిని అందఱినీ సివిల్ ఆస్పత్రికి పంపడం పనిగా పెట్టుకొన్నాము. రోగులు 'మీరా బేన్' చుట్టూ మూగి ఆరోగ్యశాస్త్ర విషయాలు, రోగాలు రాకుండా చేసుకొనే ఉపాయాలు నేర్చుకుంటారు. కేవలం ఒక మందుపొట్లం, కొంచెం మందు నీళ్లు ఈయడానికి బదులుగా ఈ ఉపకారం చేయడం వాళ్లకు కష్టంగా లేదు.

హరిజన్, 9-11-'35.

## రోగాలకు ప్రకృతి చికిత్స

పని ప్రారంభించిన మఱునాటినుండీ రోగులు రావడం ప్రారంభించారు. షుమారు ముప్పయిమంది రోగులున్నారు. గాంధీజీ వారిలో ఐదారుగురను పరీక్షచేసి, వారి వారి రోగ స్వభావాలనుబట్టి కొద్ది మార్పులతో (దాదాపు) అందరికీ ఒకే తరహా చికిత్స నిర్ణయించారు. రామనామస్మరణము, ఆతప స్నానము, తొట్టిస్నానములు (friction & hip baths) విఱిగిన పాలలోని నీరు (Eliminative diet of milk) మజ్జిగ, పండ్లు, పండ్లరసము, త్రాగినన్ని మంచినీళ్లు – ఇవీ ఆయన సూచించిన చికిత్సలు. "ప్రకృతి వైద్యం" చేయడానికి పెద్ద శాస్త్రజ్ఞానముకాని, పాండిత్యముకానీ, అక్కఱలేదని ఆయన అభిప్రాయం. నిరాడంబరత్వం, సార్వలౌకికత్వముయొక్క సారం. లక్షలాది ప్రజల ప్రయోజనముకోసం ఉద్దేశింపబడిన

దానికి దేనికీ విశేషపాండిత్య మక్కరలేదు. పాండిత్యం కొద్ది మందికే లభిస్తుంది. అది భాగ్యవంతులకే ఉపయోగపడు తుంది. భారతదేశం, ఎవ్వరికీ తెలియకుండా ఏ మూలనో ఉన్న ఏడులక్షల కు గ్రామాలతో కూడి ఉంది. కొన్ని గ్రామా లలో జనసంఖ్య కొన్ని వందలకు మించిలేదు. చాలా గ్రామాలు వందకులోపు జనసంఖ్యకలవి కూడా ఉన్నవి. నేనటువంటి గ్రామానికి పోయి నివసించవలయునని ఉన్నది. అదే నిజమైన ఇండియా. ఏ ఇండియా దేశంకోసం నేను జీవి స్తున్నానో ఆ నా ఇండియా అదే. ఈ దీనజనుల కడకు మహోన్నత పాండిత్యంగల డాక్టర్లను, వారి సామగ్రిని, ఆస్పత్రి సామానులను అన్నిటినీ తీసికొనిపోజాలము. కాబట్టి నిరాడంబరములైన ప్రకృతి చికిత్సలు, రామనామస్మరణ ములే వారికి తరణోపాయములు.''

గ్రామవాసులు- తాను గట్టిగా పనిచేయించే మనిషి అని-ముందుగా తెలిసికొని ఉండవలెనని ఆయన అన్నారు. ఆయన వారితో కలసిమెలసి ఉండే పక్షంలో ఆయన ఊరు కోరు, ఇతరులను ఊరుకోనీయరు. గ్రామవాసుల ఇండ్లకు పోయి చూస్తారు. వారి వీధులను, మురుగు కాల్వలను, వంట శాలలను, మఱుగు దొడ్లను పరిశీలిస్తారు. ఎక్కడా దుమ్ము గానీ, మురికిగానీ ఉండడం ఆయన సహించరు.

హరిజన్, 7-4-'46.

వ్యక్తిగతంగానూ, గృహంలోను, ప్రజాసమూహాము నకు సంబంధించీ, ఆరోగ్య పద్ధతులను శ్రద్ధగా అవలంబిస్తూ

ఆహార విషయంలోనూ, శరీర పరిశ్రమలోనూ, తగు జాగ్రత్త గలిగి ఉంటే, జబ్బులకు, రోగాలకు అవకాశమే లేదని నా అభిప్రాయము. శారీరకంగాను, ఆత్మగతంగాను నిష్కలుషంగా నున్నయెడల జబ్బురావడం అసాధ్యం. గ్రామవాసులీ మాత్రం అర్థం చేసుకోగలిగితే వారికి డాక్టర్లుగాని, హకీములుగానీ, వైద్యులుకానీ అక్కరలేదు.

ప్రకృతి చికిత్సలోనే ఆదర్శజీవిత దృక్పథము ఇమిడి ఉంది. ఆ దృక్పథమే పట్టణాలలోను, పల్లెలలోను ఆదర్శ జీవిత పరిస్థితులకు కారణభూతమౌతుంది. దేవుని పేరు (దైవత్వము) అనే ఇరుసు చుట్టూ ప్రకృతి చికిత్సా విధానము తిరుగుతూంటుంది.

హరిజన్. 26-5-'46,

ప్రకృతి చికిత్స అనడంలోనే, అది మిక్కిలి నిరాడంబరముగానూ, మిక్కిలిచౌకయైన చికిత్సావిధానముగానూ ఉండవలెననే భావం ఇమిడిఉంది. అటువంటి చికిత్సావిధానమును గ్రామాలలో ఆచరణలో పెట్టవలయునని మా ఆదర్శము. గ్రామస్థులందుకు తగిన అవకాశాలు సాధనసామగ్రి సరఫరా చేయగలిగి ఉండాలి. గ్రామాలలో లభించని వస్తువులను పైనుండి సంపాదించుకోవాలి. ప్రకృతి చికిత్స అంటే మన జీవిత దృకథంలోనే ఒక మంచి పరిణామమన్నమాట. ఆరోగ్యసూత్రముల ననుసరించి మనిషియొక్క జీవితమును నియమించుకోవడమని దాని అర్థం. ఆస్పత్రినుండి ఉచితం

గానో లేక కొంతరుసుమునకో మందుపుచ్చుకోవడం కాదది. ఆస్పత్రినుండి ఉచిత చికిత్సను పొందే మనిషి దానం పుచ్చుకొంటున్నాడన్నమాట. ప్రకృతి చికిత్సను అంగీకరించే మనిషి యెప్పుడూ యాచించడు. స్వయంసహాయం ఆత్మగౌరవాన్ని పెంపొందిస్తుంది. ఆ మనిషి శరీరంలోని దోషాలను నివృత్తి చేసికొని, ముందెప్పుడూ జబ్బుపడకుండా ఉండేటందుకు తగిన జాగ్రత్తలను ముందే తీసికొంటాడు.

సరియైన ఆహారము, సముచితాహారము అవసరం. ఈనాడు మనమెంత దౌర్భాగ్యులంగా ఉన్నామో మన గ్రామాలు కూడా అంత దౌర్భాగ్యంగానూ ఉన్నవి. గ్రామాలలో కావలసినన్ని కూరగాయలు, పండ్లు, పాలు ఉత్పత్తి చేయడం మన ప్రకృతి చికిత్సావిధానంలో ప్రధాన భాగం. ఇందుకోసం ఎంతకాలం వెచ్చించినా వృథాకాదు. అందువలన గ్రామాలకు ప్రయోజనం కలిగి తీరుతుంది. తద్వారా యావద్భారతావనికీ మేలు కలుగుతుంది.

హరిజన్, 2-6-'46.

గ్రామస్థుల కొఱకు నేను భావిస్తున్న ప్రకృతి చికిత్స గ్రామాలలో లభించే వస్తువులను బట్టి గ్రామస్థులకు సహాయం చేయడం వరకు మాత్రమే పరిమితంగా ఉంటుంది. అనగా వారి కొఱకు నేను ఎలక్ట్రిసిటీ (విద్యుత్) గానీ, మంచుగడ్డ గానీ కోరను. అటువంటి పని గ్రామీణ చిత్తవృత్తిగల నావంటివారికి మాత్రమే తగి ఉంటుంది.

హరిజన్, 11-8-'46.

ఒక ప్రశ్నకు జవాబుగా గాంధీజీ ఇలా అన్నారు :

"నా ప్రకృతి చికిత్స, గ్రామాలకు, గ్రామస్థులకు మాత్రమే ఉద్దేశింపబడినది: కాబట్టి దానిలో మైక్రోస్కోపు (సూక్ష్మదర్శిని) యక్సురేలవంటి పరికరాలకు తావులేదు. క్వినైన్, ఎమిటిన్, పెన్సిలిన్ వంటి మందుల ప్రసక్తికూడా అందులో లేదు. వ్యక్తిగత ఆరోగ్యరక్షణ, ఆరోగ్యకరమైన జీవితమే అందులో ప్రధానములు: ఇవి చాలు. ప్రతి మనిషీ ఈ కళలో ఆరి తేరినయెడల రోగం ఉండనే ఉండదు. జబ్బును నయంచేసికోవడానికి యీ ప్రకృతి సూత్రాలన్నిటినీ అవలంబిస్తూన్నప్పటికీ కూడా జబ్బుచేసినట్లయితే రామనామమే అత్యంత తరణోపాయం. కాని 'రామ' నామంద్వారా కలిగే ఈ ఉపశమనము ఒక్క తెప్పపాటులో విశ్వవ్యాప్తం కాజాలదు. రోగికి 'రామ'నామంలో నమ్మకం కలిగించాలంటే ముందు వైద్యునకు 'రామ'నామముయొక్క శక్తిలో విశ్వాసం మూర్తీభవించి ఉండాలి. ఈ లోగా ప్రకృతిలోని ఐదు శక్తులను సాధ్యమైనంతవరకు ఉపయోగించుకోగలిగి ఉండాలి. అనగా పృథ్వి, వాయువు, నీరు, అగ్ని ఆకాశము లను ఉపయోగించుకోవాలి. నాకు తోచినంతవఱకు ఇదే ప్రకృతి చికిత్సకు పరిమితి. పంచభూతములను సరిగా వినియోగించుకోవడం ద్వారా రోగులకు చికిత్సచేయడంలోనూ, గ్రామస్థులకు పరిశుభ్రమైన, ఆరోగ్యకరమైన జీవితములను గడపే విధానములను నేర్పుటలోనూ నేను 'ఉరుళీ కాంచన్'

లో ప్రయోగం చేస్తూన్నాను. అవసరమైతే స్థానికంగా పెరిగే ఓషధులను వాడవచ్చును. పవిత్రమైన సముచితాహారము ప్రకృతి చికిత్సకు తప్పనిసరి.

హరిజన్, 11-8-'46.

## ఆరోగ్య సూత్రాలు

శ్రీ బ్రిజ్‌లాల్ నెహ్రూ నావంటి ఛాందసుడే. ఆయన "మన అనారోగ్యమునకు చాలావఱకు మన తప్పే కారణ" మని ఆరోగ్యమంత్రి చేసిన ప్రకటనను మిక్కిలి శ్లాఘిస్తూ, ఈ తప్పిదమును నిర్మూలించేటందుకు యే ప్రభుత్వసంస్థా కూడా బాధ్యత వహించడంలేదని పత్రికలకు వ్రాశారు. ఆయన ఇంకా ఇలా అన్నారు. "ఇంతవరకు మన ఆరోగ్య మంత్రుల దృష్టి, ఆస్పత్రులు, ఆరోగ్యనిలయాలు, చికిత్సా లయాలు, ఔషధాగారములను నిర్మించడంలోనే ఉంది. అనగా రోగాలకు చికిత్సా మార్గములను యేర్పాటుచేయడం లోనే ఉంది. అంతేకాని సరియైన జీవితమును గడపవలసిన అవసరాన్నీ అందుకు తగిన మార్గాలనూ ప్రజలకు బోధించి రోగాలు రాకుండా చేసే సంస్థలు నిర్మింపబడడంలేదు."

తరువాత ఆయన "రోగనివారణమునకు గాక ఆరోగ్యాభివృద్ధిని గూర్చి శ్రద్ధవహించేటందుకు ప్రత్యేక శాఖను యేర్పాటు చేయవలెననీ, ఈ శాఖకు కొంతమంది ప్రవీణులు, మఱికొంతమంది మామూలు మనుష్యులు గ్రామస్థుల అవసరాలను వారి జీవితముయొక్కయు, కృషియొక్కయు పరిమితు

లను గుర్తెఱిగినవారు—సలహాసంఘంగా ఉండి సహాయపడాలి" అనీ కూడా వ్రాశారు. ఈ నా సోదరఛాందసు డింత అవసరమైన పనికి ఎందుకు ప్రత్యేక శాఖ కావాలంటున్నారు? ఖర్చుపైన ఖర్చు పెంచి, ఖర్చు పెరుగుతూన్నకొద్దీ ఉపకారమెక్కువ జరుగుతూన్నట్లుగా అమాయిక ప్రజను మోసంచేసి, తమను తాము మోసం చేసుకొంటూ పాత పరిపాలనక్రింద జరుగుతూ వచ్చిన తమాషా యిది. తామెవ్వరికి సేవచేయడానికి జీతాలు తీసికొంటున్నారో, ఆ ప్రజల ఆరోగ్యమును పొంది దానిని కాపాడుకొనేటట్లు జాగ్రత్త వహించడం తమ ప్రథమ కర్తవ్యమని ఆరోగ్యశాఖామంత్రి తన క్రిందపనిచేసే డాక్టర్లకు తదితర సిబ్బందికి తెలియచేయవలసి ఉంటుందని నా అభిప్రాయం.

ఇందుకు మొదటి మెట్టుగా ఈ విలేఖకుడు "ఇండియాలోని పరిస్థితుల కనుగుణంగా, ఆరోగ్య సూత్రముల ననుసరిస్తూ సరియైన జీవితమును గడుపుటను గూర్చి ఒక గ్రంథము వ్రాయించవలెను. ఆ గ్రంథానికి ప్రజలలో విలువ ఉండడానికి ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి యాజమాన్యం క్రింద అది ప్రచురణకావలెను. ఆ పుస్తకాన్ని ఒక నిర్ణీత కాలంలో వ్రాసి యిచ్చేపని భారతీయ వైద్యసంఘము వారికి (**Indian Medical Association**) అప్పచెప్పవలెను. మన వైద్యకళాశాలలో రోగములనుగూర్చి కంటె, ఆరోగ్యమును గూర్చి ఎక్కువ గట్టిగా బోధించడం అత్యంత వాంఛనీయం" అని కోరుతూన్నాను.

నిజానికి అన్ని పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ కూడా ఆరోగ్య సూత్రాలను తప్పనిసరిగా బోధించాలి. శ్రీ బ్రిజ్‌లాల్ నెహ్రూ సిఫారసుచేసిన పద్ధతిలో గ్రంథము వెలువడే పక్షాన, 'ఆరోగ్యమును కాపాడడమనే' పద్ధతిక్రింద వివిధ రకములైన టీకాలను వేసే పిచ్చితో రోగాలను ప్రవేశ పెట్టే విధానానికి చోటీయవలదని గ్రంథకర్తలు ముందుగా ఆదేశింపబడగలరని ఆశిస్తూన్నాను.

హరిజన్, 28-12-'47.



# 6

# గ్రామీణ ఆహారము

## పచ్చి ఆకు కూరలు

ఆహారాన్ని గురించి విటమినులను గూర్చి వ్రాయబడిన యే పాఠ్యగ్రంథము చూచినా అందులో, ప్రతి భోజనములోనూ, తిన తగిన కొన్ని పచ్చి ఆకులను ఉడకబెట్టకుండా తినవలెనని గట్టి సిఫారసు ఒకటి కనిపిస్తుంది. అయితే ఈ పచ్చి ఆకులను కనీసం ఆరు పర్యాయములైనా మురికి అంతా పోయేటట్లు బాగా కడుగవలసినమాట నిజమే. ఏఱుకొని రావడానికి శ్రమ తీసికోగలిగితే ప్రతి గ్రామంలోనూ ఈ ఆకులు లభిస్తవి. అయినప్పటికీ నగరాలలో మాత్రం ఇవి భోగపదార్థాలుగా భావింపబడుతూన్నవి. ఇండియాలోని అనేక ప్రదేశములలో గ్రామస్థులు పప్పు, వరిఅన్నం, రొట్టె, శరీరానికి హానిచేసే మిరపకాయలు తిని జీవిస్తూన్నారు. గ్రామస్థుల ఆర్థిక పునర్నిర్మాణము ఆహార సంస్కరణముతో ప్రారంభమయినందున, గ్రామస్థులు పోగొట్టుకొన్న ఆరోగ్యమును తిరిగి పొందేటందుకు వీలుగా మిక్కిలి నిరాడంబరము, మిక్కిలి చౌక అయిన ఆహారములను కనిపెట్టడం అవసరం. గ్రామస్థు లిప్పుడు బాధపడుతూన్న అనేక రోగములను నివారించుటకు వారి ఆహారములకు పచ్చి ఆకులను అదనంగా చేర్చడం ఉచితం. గ్రామస్థుల ఆహారములో విటమిన్లు తక్కువగా ఉంటూన్నవి. అప్పటికప్పుడు కోసి తెచ్చిన పచ్చి

ఆకులలో చాలా విటమిన్లు ఉంటవి. పచ్చి ఆకులను సరిగా ఉపయోగించుకో గలిగితే ఆహారమును గురించి అనుశ్రుతంగా వస్తూన్న అభిప్రాయాలలో తీవ్రమైన మార్పు కలుగ గలదనీ, ఇప్పుడు పాలు చేస్తూన్న ఉపకారం చాలావరకు పచ్చి ఆకులు చేయవచ్చుననీ, ఒక ప్రవీణుడైన ఇంగ్లీషు డాక్టరు ఢిల్లీలో నాతో అన్నాడు. అనగా భారతదేశములో వాటంతటవి పెరుగుతూన్న అనేక రకాల గడ్డిలో దాగి యున్న లెక్కలేని ఆకులలోని పుష్టికరపదార్థములను గూర్చి పరీక్షించి విపులంగా పరిశోధించవలసిన అవసరం యెంతైనా ఉన్నదన్నమాట.

హరిజన్, 15-2-'35.

## గ్రామకార్యకర్తలతో సంభాషణ

గ్రామకార్యకర్తల అవసరములను ముఖ్యంగా దృష్టిలో ఉంచుకొని ఈనాటి భోజనపదార్థాలను నేనే నిర్ణయించాను. కాబట్టి ఆ విషయంలో నేను మీకు కొంతవివరంగా చెప్పాలి. మామూలు పల్లెటూరి మనిషికి అందుబాటులో ఉన్నట్టిన్నీ రోజుకు ఎనిమిది గంటల పనికి మనము నిర్ణయించిన మూడణాల కనీస వేతనమునకు లోబడి ఉన్నట్టిన్నీ పుష్టికరమైన ఆహారమును మీకీయవలెననే ఉద్దేశంతో ఈ నిర్ణయం జరిగింది.

ఈ రోజున భోజనం చేయవలసినవాళ్లము 98 మందిమి. మన మొత్తం భోజనం ఖర్చు రు 9-14-3. అనగా ఒక్కొక్క-

భోజనం 6 కానులకంటె కొంచెం ఎక్కువ ఖరీదవుతుంది. అందుకు వివరా లివి,

| | | | |
|---|---|---|---|
| 36 | పౌ॥ | గోధుమపిండి | 1– 8–0 |
| 12 | ,, | రామములగకాయలు | 0–11–3 |
| 4 | ,, | బెల్లం | 0– 6–3 |
| 24 | ,, | రెడ్ గోర్డు(గుమ్మిలాంటికూరగాయ) | 0–7–6 |
| 6 | ,, | అవిసెనూనె | 1– 2–0 |
| 25 | ,, | పాలు | 3–13–0 |
| 4 | ,, | బటానీలు | 0– 6–0 |
| 4 | | కొబ్బరికాయలు | 0– 4–0 |
| 16 | | కోత్ పండు | 0– 2–0 |
| | | చింతపండు–ఉప్పు | 0– 2–3 |
| | | వంట చెఱుకు | 1– 0–0 |
| | | మొత్తం రు | 9–14–3 |

మీ అందఱికి రొట్టె ఈయడానికి మిక్కిలి శ్రమ తీసికోవలసిన అవసరం లేకుండా, మన మందఱము ప్రతి ఉదయం తీసుకొంటూన్న గోధుమగంజి ఈయవచ్చునని వినోబా నాకు సూచించారు. కాని నేను అలా వద్దనుకున్నాను. మీరు పడుచువాళ్లు. మీకు దేవుడు మంచి దంతపుష్టి ఇచ్చాడు. కాబట్టి మీకు బాగా కాల్చిన గట్టి రొట్టె ఎందుకీయకూడదు? అది ఎవరైనా తయారుచేయవచ్చును. ఎక్కడికైనా దానిని తీసికొనిపోవచ్చును. పైగా రెండు రోజులు నిలవ ఉంటుంది

కూడా. గోధుమ పిండిని నీళ్లలో కలిపి జిగురువచ్చేటట్లు తయారుచేసేముందు అవిసెనూనెను ఉపయోగించాలి. అప్పుడది మెత్తగా ముద్దగా తయారవుతుంది. మనకు కొన్ని ఆకులు, పచ్చికూరలు ఉండాలి గనుక, రాముములగ కాయలు, రెండు పచ్చళ్లు ఉంచుకొన్నాము. ఒకటి ఈ ప్రాంతాలలో ఎక్కువగా దొరికే 'కోత్' పండు పచ్చడి. రెండోది మన తోటలోని ఆకులతో తయారైన పచ్చడి. 'కోత్' పండు విరేచనకారి, విరేచనాలను ఆపేదికూడా. ఈ రెండు గుణాలు ఉన్నవి అందులో. దానితో బెల్లం కలిపితే మంచి రుచిగల పచ్చడి అవుతుంది. రెండోది ఆకుపచ్చడి. ఉప్పు, చింతపండు, కొబ్బరి కలిపి చేసిన ఆ పచ్చడి పరిమళంగా ఉంటుంది. మన ఆహారంలో తగినన్ని విటమిన్లు ఉండవలెనంటే యేదో ఒక రూపంలో మనం పచ్చి ఆకులు తిని తీరాలి. మనం ఎన్నుకొన్న కూర మిక్కిలి చౌక. మన గ్రామాలలో ప్రతిచోటా పెరుగుతుంది. పచ్చడి చేయడంలో చింతపండు వేయడానికి నేను అంగీకరించాను. చాలా మందికి దానిమీద అయిష్టము. అయినప్పటికి దానిలో రక్తమును శుభ్రపరిచే గుణము, విరేచనబద్ధకమును పోగొట్టే గుణము ఉన్నవి. మలేరియాతో బాధపడుతూన్న మనలో ఒకరికి తరుచుగా చింతపండు నీళ్ళు పెద్దపెద్ద ప్రమాణాలలో ఇచ్చినందువలన మంచి ప్రయోజనం కలిగింది. మలబద్ధకం విషయంలోకూడా చాలా పర్యాయములు దీని ఉపయోగించాను.

పాలు ఆహారంలో ప్రధానమైన వస్తువు. మీ ఆహారంలో అర పౌను పాలు ఉన్నవి. కాని నేను మీకు నెయ్యి ఈయడం లేదు. అందువలన యేమీ నష్టం లేదనుకుంటాను. మంచి నెయ్యి దొరకడం అనుమానాస్పదమైనప్పుడు కల్తీ నెయ్యి ఎందుకు మనకు ? అయితే పాలు కానీ, మజ్జిగ కానీ ఎంత కొద్దిగానైనా ఉండితీరాలి. అది శాకాహారంలోని క్రొవ్వుపదార్థాలను, ప్రొటీనులను శరీరానికి ఇమిడేటట్లు చేస్తుందని వైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయం. కాబట్టి నెయ్యి ఉపయోగించకపోయినా యేమీ కీడు లేదు.

మీరు ముఖ్యంగా చేయవలసిన పనులు రెండు. గ్రామస్థులకు సముచితాహారము లభించేటట్లు చేయడం. మీరదే ఆహారంతో సంతృప్తిపడి ఉండడం. కొంతమంది అక్కఱలేని అనేక పదార్థములతో తమ భోజనమును నింపవచ్చును. అనేకులు విటమిన్లు మఱింత తక్కువగానున్న భోజనం చేయవచ్చును. మీరు వారికి సక్రమమైన ఆహారమును చూపెట్టాలి. ఆవులను పోషించడం మీరు నేర్చుకొని గ్రామస్థులను ఆ విషయంలో ప్రోత్సహించాలి. మన గ్రామాలలో చాలావాటిలో పాలు దొరకకపోవడం సిగ్గుపడవలసిన విషయముగా భావించాలి. రెండవ ప్రధాన కర్తవ్యం పరిశుభ్రత. అది నిజానికి అత్యంత కష్టమైన పని. మీరు గ్రామస్థులకు సక్రమమైన ఆహారాన్ని చూపెట్టి గ్రామాల పరిశుభ్రత సహించగలిగినంత యోగ్యంగా కాపాడ గలిగినయెడల, మానవ శరీరాలను దేవ మందిరములుగానూ, ప్రతిదినమూ కష్టించి పనిచేయడానికి తగిన పటిష్ఠములైన పరికరములుగానూ చేసినవారవుతారు.

హరిజన్, 2-11-'35.

# 6

# గ్రామీణ విద్య

ఎంత గొప్ప సదుద్దేశములు కలిగి ఉన్నా, ఆంగ్లోపా ధ్యాయులు ఆంగ్లేయుల అవసరాలకు భారతీయుల అవసరా లకూ గల భేదాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేరు. వారికి కావలసిన భవనాలు మన శీతోష్ణస్థితికి అవసరంలేదు. ఆంగ్లే యుల పిల్లలు ప్రధానంగా నగర పరిసరాలలో ఆయా అవసర ములకు తగినట్లుగా పెరిగారు. మన పిల్లలు ప్రధానంగా గ్రామ పరిసరాలలో పెరుగుతున్నారు. కాబట్టి ఆంగ్లేయుల పిల్లలకు కావలసినమోస్తరు విద్య మన పిల్లల కక్కరలేదు.

మన పిల్లలు పాఠశాలలో ప్రవేశించినప్పుడు వారికి పలక, బలపం పుస్తకాలు అక్కరలేదు. నిరాడంబరమూ లైన గ్రామీణపరికరములు, వారు తేలికగాను లాభదాయకం గానూ ఉపయోగించ గలిగినవి ఉంటే చాలు. ఇది విద్యా విధానంలో ఒక తీవ్రమైన పరివర్తనం. ఇంత తీవ్రమైన పరి వర్తనం కలుగకపోతే, పాఠశాలకు పోదగిన వయస్సుగల ప్రతి బిడ్డకు విద్య అందుబాటులో ఉండదు. ప్రభుత్వ పాఠ శాలలలో బాలబాలికలకు నేడు నేర్పుతూన్న చదువు, వ్రాత, లెక్కలు తరువాత జీవితములో వారికి నిరుపయోగము లవు తూన్నవని అందరూ అంగీకరించిన విషయమే. చాలావరు కది ఉపయోగం లేకపోవడం వలననే దానిని మరచిపోతు న్నారు. వారి గ్రామీణ పరిసరాలలో అది అవసరంలేదు.

అయితే వారి పరిసరాల కనుగుణంగా పిల్లలకు వృత్తి విద్యలు నేర్పినట్లయితే, వారు తమ పాఠశాలలలో అయిన

ఖర్చుకు తగు ఆదాయము సమకూర్చుటయేగాక, తరువాత వారి జీవితంలో ఆ చదువును సరిగా ఉపయోగించుకో గలుగు తారు. నూలు వడకడం, నేయడం నేర్పే ఒక పాఠశాలకు అనుబంధంగా ఒక ప్రత్తిచేను కూడా ఉండేయెడల అది పూర్తిగా స్వయం పోషకంగా ఉంటుందని నా భావం.

నేను ప్రతిపాదిస్తూన్న ప్రణాళికలో మామూలుచదువు లేకుండా ఉండదు. చదువు, వ్రాత, లెక్కలు లేని ప్రాథమిక విద్య పరిపూర్ణం గాదు. అయితే, బాలుడుగానీ, బాలిక గాని సరిగా అక్షరాలు నేర్చుకోవడానికి పరిపక్వస్థితిలో నున్నప్పుడు చివరి సంవత్సరంలో మాత్రమే చదువు, వ్రాత ఉంటుంది. దస్తూరీ ఒక కళ. చిత్రకారుడు బొమ్మలను ఎంత చక్కగా గీస్తాడో ప్రతి అక్షరమూ అంత సరిగా వ్రాయగలిగి ఉండాలి పిల్లలు. బాల బాలికలకు ముందుగా బొమ్మలు గీయడంలో ప్రాథమిక పాఠాలు చెప్పడంవలననే ఇది సాధ్యమవుతుంది. పాఠశాలలో, రోజులో ఎక్కువ కాలం వృత్తి విద్యలో శిక్షణ జరుగుతూండగానే, పిల్లలు ప్రాథమిక చరిత్ర, భూగోళం, లెక్కలలో బోధన పొందుతూఉంటారు. వారు మంచి వర్తనం నేర్చుకొంటారు. పరిశుభ్రత, ఆరోగ్యము మొదలగు విషయములను ఆచరణపూర్వకంగా అభ్యసిస్తూ మంచి నడవడిక నేర్చుకుంటారు. ఇటువంటి అలవాట్లతో వారు తమ యిండ్లలో చెప్పకుండానే మంచి మార్పులను తెచ్చే వారవుతారు.

యంగిండియా, 11-7-'౭౭.

# 7

# గ్రామపరిశ్రమలు - వ్యవసాయము

ఖ ట్టి

చాలా గ్రామాలు తమకు కావలసిన ధాన్యమును ఏ విధంగా పండించుకొంటూన్నవో అదేవిధంగా ప్రతి గ్రామం తనకు కావలసిన నూలును వడుకుకొని నేసుకోవడం ఆదర్శమన్న మాట నిస్సందేహం. గ్రామానికి కావలసిన ధాన్యమునంతను పండించుకోవడం కంటె కూడా ప్రతి గ్రామము తనకు కావలసిన నూలు వడుకుకోవడం, నేసుకోవడం ఎక్కువ తేలిక. ప్రతి గ్రామము ఏమీ కష్టం లేకుండా తగినంత ప్రత్తిని నిల్వచేసుకొని, వడుకుకొని నేసుకోవచ్చును.

యంగిండియా, 11-8-'21.

మన ప్రజల సంఘజీవితానికీ, మనకు రాట్నం పునాది. అది లేకుండా శాశ్వత ప్రజాసేవా జీవితం అసంభవం. దేశంలోని అట్టడుగు ప్రజానీకముతో మనకు ప్రత్యక్షమైన ఎడతెగని సంబంధం కలిపి, దానివల్ల వారికి ఆశను కలుగచేసేది అది ఒక్కటే. మనం దాని కింకా అనేక సేవావిషయాలు చేర్చవచ్చును, చేర్చి తీరవలెను— కాని తెలివిగల తాపీ పనివాడు పైన భవనమును కట్టే ముందు పునాది గట్టిగా ఉండేటట్లు చూచుకొన్నట్లు భవనం పెద్దదైనకొద్దీ ఎక్కువ లోతైన, బలమైన పునాది కొరకు చూచుకొన్నట్లు మనం ముందుగా పునాదిగా రాట్నం స్థిరంగా ఉండేటట్లు చూచు

కోవాలి. పొంద తగిన ఫలితం రావలెనంటే నూలువడకడం భారతదేశ మంతటా సర్వేసర్వత్రా, సర్వసాధారణమైపోవాలి.
యంగ్ ఇండియా, 4-9-'24.

వ్యవసాయంలో తగినంత ఆదాయంరాక ఎక్కువ విరామంకలిగి, తీరని పేదఱిక మనుభవిస్తూన్న ప్రజలుగల గ్రామాలలో మాత్రమే మజూరీకి నూలువడికే పద్ధతి ప్రవేశ పెట్టాలి.

పేదరికంతో నిమిత్తంలేకుండా, తమ తమ అవసరాల నిమిత్తం వడుకుకొనే పద్ధతి అన్ని గ్రామాలలోను ప్రవేశ పెట్టాలి. ఆయా సందర్భాలనుబట్టి వారికి ప్రత్తిలో గింజలు తీయడం, ఏకడం, లేక వడకడం నేర్పుతూ, నారికి ప్రత్తి ఇతర పరికరాలు కొన్న ఖరీదుకు లభించేటట్లు, వారి నూలు మామూలు మజూరీకి నేయించేటట్లు సహాయం చేయావలెను.
యంగిండియా 2-5-'29.

### చరఖా

ప్రజాసామాన్యము యొక్క ఆశలకు రాట్నము చిహ్న మని నా అభిప్రాయము. రాట్నం పోవడంతోనే వారికదివఱ కుండే స్వాతంత్ర్యం పోయింది. గ్రామస్థుల వ్యవసాయము నకు రాట్నం అనుబంధంగా ఉండి దానికి గౌరవం తెచ్చింది. అది వితంతువులకు ఆత్మమిత్రునిగానూ, మనశ్శాంతికి ఆధారం గానూ ఉండేది. గ్రామస్థులను సోమరితనమునుండి దూరము చేసేది. వడకడానికి ముందూ, వడకినవెనుక కావలసిన పరి శ్రమ లన్నీ చర్ఖాలో ఇమిడిఉన్నవి. అనగా ప్రత్తిలోగింజలు

తీయడం, ఏకడం, ఏకులు చేయడం, పడుగుచేయడం, పడుగు సరిచేయడం, రంగువేయడం, నేయడం అన్నీ ఇమిడి ఉన్నవి. పైగా ఇవన్నీ గ్రామంలోని వడ్రంగికీ, కమ్మరికీ కూడా తగిన పనిని కల్పిస్తూండేవి. రాట్నం ఏడులక్షల గ్రామాలను స్వయం సంపూర్ణంగా చేయగలిగింది. చర్ఖాపోవడంతోనే నూనెగానుగవంటి ఇతర గ్రామపరిశ్రమలు కూడా పోయినవి. ఈ పరిశ్రమల స్థానంలో ఇంకేదీ స్థాపనకాలేదు. కాబట్టి గ్రామాలలోని వివిధ వృత్తులు, వాని సృజనశక్తీ, ఈ పరిశ్రమలద్వారా లభించిన ఆ కొద్దిపాటి భాగ్యమూ కూడా నశించినది.

కనుక గ్రామస్థులు తమ పూర్వస్థితికి రావలెనంటే చర్ఖాను, దాని అన్ని పరికరములతో తిరిగి పునరుద్ధరించవలెననడమే సహజంగాతోచే ఆలోచన.

చర్ఖాసందేశమును గ్రామాలలో ఏకాగ్రతతో వ్యాపకంచేసి గ్రామస్థుల కాంతివిహీనములైన కళ్లలో ఆశాకిరణమును ప్రజ్వలింపచేయడానికి దేశభక్తి, తెలివితేటలు గలిగి స్వార్థరహితులైన భారతీయులనేకమంది ముందుకు వస్తేనే గాని ఈ పునరుద్ధరణం సాధ్యంకాదు. ఇదియే వయోజన విద్యకు, సహకారోద్యమమునకు సరియైన పద్ధతిలో జరుగుతూన్న ఒక గొప్ప ప్రయత్నము. నిశ్శబ్దంగానూ, నిశ్చయంగానూ, జీవనప్రదాయిగానూ ఉండే దాని పరిభ్రమణం వలెనే రాట్నం సడీ చప్పుడూలేని పరివర్తనం తీసికొనివస్తుంది.

ఈనా వాదం సరియైనదని ఇరవై సంవత్సరాల చర్ఖాఅనుభవం నాకు గట్టి నమ్మకం కలిగించింది. చర్ఖా నిరుపేదలయిన మహమ్మదీయులకు, హిందువులకు కూడా దాదాపు సమానంగా ఉపకారం చేసింది. పెద్ద అడావడి హంగామాలేకుండా లక్షలాది గ్రామ కళాకారుల జేబులలో దాదాపు ఐదుకోట్ల రూపాయిలు ఉంచగలిగింది ఈ చర్ఖాయే.

కాబట్టి అన్ని మతాలకు చెందిన సామాన్యప్రజల భాషలో స్వరాజ్యానికి దారితీసేది చర్ఖాయేనని నేను నిస్సందేహంగా చెప్పగలను. చర్ఖా గ్రామాలను తిరిగీ వాటి అర్హస్థానంలో ఉంచి ఎక్కువ తక్కువ లనే భేదాన్ని నిర్మూలిస్తుంది.

హరిజన్, 13-4-'40.

## *గ్రామ పరిశ్రమలు.*

గ్రామ పరిశ్రమలనుగూర్చిన కాంగ్రెసు తీర్మాన రచయితగాను, వాటి అభ్యున్నతికి నిర్మింపబడిన సంఘమునకు ఏకైక నాయకుడుగాను ఉన్న నేను ఆ పరిశ్రమలను గూర్చి నా మనస్సులో ఉప్పొంగుతూన్న అభిప్రాయాలను సాధ్యమైనంతవరకు ప్రజలకు తెలియచేయడం సమంజసంగా ఉంటుంది.

నేను హరిజన సంచార సందర్భంలో మలబారు ప్రవేశించే నాటికే ఈ సంఘనిర్మాణమును గూర్చిన అభిప్రాయం నా మనస్సులో స్పష్టంగా రూపొందింది. గ్రామీణులనుండి క్రూరంగానూ, అనాలోచితంగానూ నగరవాసులచే హరింప

బడిన దానిని తిరిగి గ్రామవాసులకు చేరేటట్లు నిజమైన ప్రయత్నం చేయగల ఒక సంస్థ ఉండడం ఎంత అవసరమో ఒక ఖాదీ కార్యకర్తతో జరిగిన యాదృచ్ఛిక సంభాషణలో నాకు తెలిసింది.

ఈ నాడు భారతదేశంలో క్రమబద్ధంగా లేని చిన్న చిన్న భూఖండములలో వ్యవసాయం లాభప్రదం కాదనే విషయం చాలామందికి తెలియదు. గ్రామస్థులు ప్రాణంలేని బ్రతుకు బ్రతుకుతూన్నారు. వారి జీవితం క్రమక్రమంగా పస్తూలుండడంతో గడుస్తూన్నది. వారు అప్పులలో మునిగి పోతున్నారు. షాహుకారుకు అప్పు లీయక తప్పదు గనుక ఇస్తున్నాడు. అలా ఈయకపోతే ఆయనదంతా పోతుంది. గ్రామాలలో ఋణాలిచ్చే పద్ధతిని గూర్చి విచారించడం సాధ్యంకాని పని. ఎంత ఎక్కువగా విచారించినా దానిని గూర్చి మనం తెలుసుకోగలిగింది చాలా తక్కువ.

గ్రామ పరిశ్రమల నిర్మూలనము, ఇండియాలోని 7 లక్షల గ్రామాలను పూర్తిగా నాశనం చేస్తుంది.

నేను ప్రతిపాదించిన సూచనల విమర్శనమును దిన పత్రికలలో చూచాను. నూతన విషయాలను కనిపెట్టగల మానవుని మేధస్సు లోబఱచుకొన్న ప్రకృతి శక్తులను ఉపయోగించుకోవడం ద్వారా విమోచనం కలిగించేటందు కాలోచించవలయునని విమర్శకులు నాకు సలహా యిస్తూన్నారు. ముందడుగు వేస్తూన్న పాశ్చాత్యదేశాలలోవలె

నీరు, గాలి, నూనె, విద్యుత్తు (Electricity) లను పూర్తిగా వినియోగించుకోవలయునని విమర్శకు లంటున్నారు. ప్రకృతిలో దాగియున్న ఈ శక్తులను లోబఱచుకోవడం వలననే ప్రతి అమెరికా దేశీయుడు ముప్పదిమూడుమంది బానిసలను పెట్టుకోవడానికి వీలుకలిగిందని వారు చెబుతున్నారు.

అదే పద్ధతి ఇండియాలో ప్రారంభించినట్లయితే ప్రతి భారతీయునికి ముప్పయిమూడు మంది బానిసలను చేకూర్చడానికి బదులు ప్రతివానిని ముప్పదిమూడు రెట్లు బానిసగా చేయగలమని నేను ధైర్యంగా చెప్పగలను.

చేయవలసిన పనికి తగినంతమంది లేనప్పుడు యంత్రాలను పెట్టుకోవడం మంచిదే. ఇండియాలోవలె, కావలసిన వారికంటె ఎక్కువమంది మనుష్యు లున్నప్పుడు అది హానికరం. ఒక పొలంలో కొన్ని చదరపు గజములు త్రవ్వేటందుకు నేను నాగలిని ఉపయోగించక పోవచ్చును. మన గ్రామాలలో క్రిక్కిరిసి ఉన్న ప్రజానీకమునకు విరామము ఎలా చూపించవలెనా అనేదికాదు మన సమస్య. సంవత్సరంలో వారికి పనిలేని సమయం పని చేయతగిన ఆరు నెలల కాలానికి సరిపోతుంది. దానిని ఎలా ఉపయోగించుకోవడమా అనేదే మన సమస్య. ప్రతి మిల్లు గ్రామస్థులకు భయ కారణమని అంటే వింతగా తోచవచ్చును. నేనయితే లెక్కలు వేయలేదుగాని, ప్రతి మిల్లుకార్మికుడు గ్రామాలలో కనీసం పదిమంది చేసే పని తానొక్కడే చేస్తున్నాడని

ధైర్యంగా చెప్పగలను. అనగా తన సోదర గ్రామస్థులు పదిమందికి నష్టదాయకంగా, తాను తన గ్రామంలోకంటె ఎక్కువ సంపాదించుకొంటున్నాడు. కాబట్టి నూలుమిల్లులు నేతమిల్లులు గ్రామస్థుల ప్రధాన జీవనాధారమును తీసివేసినవి. ఒకవేళ ఈ మాటే నిజమైనప్పటికీ, అవి చౌకగా ఎక్కువ మంచి బట్టలు తయారు చేస్తున్నవిగదా అనడం సరియైన జవాబుగాదు. ఎందువల్లనంటే మిల్లులు వేలకొలది పనివాళ్లకు పనిలేకుండా చేసినప్పుడు మిక్కిలి చౌకయైన మిల్లుబట్ట సైతము గ్రామాలలో నేసిన ప్రియమైన ఖాదీకంటెకూడా ఎక్కువ ప్రియమైనదే అవుతుంది. బొగ్గు గనిలో పనిచేసే వానికి బొగ్గు ఎలా ప్రియంకాదో తన ఖాదీని తాను తయారు చేసికొనే గ్రామస్థునికి కూడా ఖాదీ ప్రియంకాదు. మిల్లులలో తయారైన బట్టలు గ్రామస్థులకు పని పోగొట్టగా బియ్యపు మరలు, పిండిమరలు వేలకొలది పేదరాండ్రకు పని పోగొట్టడమేకాక, జనులందరి ఆరోగ్యమునుకూడా పాడుచేస్తూన్నవి. మాంసాహారము సంపాదించుకోగలిగి తినడానికి అభ్యంతరం లేనివారికి తెల్లని పిండికానీ, మరబియ్యం కానీ ఏమీ కీడు చేయకపోవచ్చును. కాని మాంసం లభిస్తే తినడానికి అభ్యంతరం లేని ఇండియాలోని లక్షలాది ప్రజలు మాంసాహారమును సంపాదించుకోలేనప్పుడు, ముడి బియ్యమును, పొట్టు పోని గోధుమపిండిలో ఉండే పుష్టికరమైన ముఖ్య ఆహార పదార్థములను వారికి లేకుండా చేయడం పాపం. తెల్లని గోధుమ పిండినీ, మరబియ్యమునూ ఉపయోగించినందువలన

కలిగే అపాయమునుగూర్చి, దేశంలోని వైద్యశాస్త్రజ్ఞులూ తదితరులూకూడా కలసి ప్రజలకు ప్రబోధించవలసిన తరుణం వచ్చింది.

గ్రామవాసులకు పనికల్పించడం యంత్రములద్వారా గాదని, ఇంతవరకు వారు అనుసరిస్తూన్న పరిశ్రమల పునరుద్ధరణం వలననే అది జరుగవలసి యున్నదనీ చూపుటకు మొత్తం మీద స్పష్టంగా కనపడే కొన్ని విషయాలను దృష్టిలోనికి తెచ్చాను.

కాబట్టి అఖిల భారత గ్రామ పరిశ్రమలసంఘం, నేడు నిలచియున్న పరిశ్రమలను ప్రోత్సహిస్తూ, జీర్ణిస్తూన్నట్టిగాని, పూర్తిగా జీర్ణించిపోయినట్టిగాని పరిశ్రమలను గ్రామీణ పద్ధతుల ప్రకారం, అనగా అనాదికాలంనుండి జరుగుతూన్నట్లుగా వారి కుటీరములలోనే వారు పనిచేసికొనే పద్ధతిని సాధ్యమైనంతవఱకు, వాంఛనీయమైనంతవఱకు పునరుద్ధరించవలయునని నా అభిప్రాయం. చేతితో ప్రత్తిగింజలు తీయడం, చేతితో ఏకడం, చేతితో వడకడం, చేతితో నేయడంవలెనే ఈ నిరాడంబరములైన పద్ధతులు చాలావరకు అభివృద్ధి చేయవచ్చును.

‘పురాతన పద్ధతి కేవలం వ్యక్తిగతమైనది. అది ఎప్పుడూ సమాజకృషికి దోహదం చేయదు’ అని విమర్శకు డనవచ్చును. ఈ అభిప్రాయం కేవలం ఆలోచనారహితమైనది. గ్రామస్థులు తమ కుటీరములలో వస్తువులను తయారు

చేసుకొన్నప్పటికీ, వాటి నన్నిటినీ ఒక్క-చోట చేర్చి, అమ్మి లాభాలు పంచుకోవచ్చును. గ్రామస్థులు ఒక ప్రణాళిక ప్రకారం ఒక తనిఖీకి లోబడి పనిచేయవచ్చును. ముడి వస్తు వులు ఉమ్మడి భాండారంనుండి పొందవచ్చును. సహకార ప్రయత్నమునకు ఇష్టపడేటట్లు చేయగలిగినయెడల, పరస్పర సహాయమునకు, శ్రమ విభాగమునకు, సమయ పరిరక్షణకు, పనిలో నైపుణ్యమునకు నిజంగా కావలసినంత అవకాశ మున్నది. ఈ పను లన్నీ ఐదువేలకు మించిన గ్రామాలలో అఖిల భారత చరఖాసంఘం నేడు నిర్వహిస్తూన్నది.

అయితే ఖాదీ గ్రామ మనే సూర్యకుటుంబమునకు సూర్యుని వంటిది. ఖాదీవలన తాము పొందుతూన్న చైతన్య మునకూ పుష్టికీ బదులుగా వివిధ పరిశ్రమలు ఖాదీకి స్థైర్య మును చేకూరుస్తూన్న గ్రహాలు. ఖాదీ లేనిదే తక్కిన పరిశ్రమలు అభివృద్ధి పొందజాలవు. కాని నా క్రిందటి సంచా రములో ఇతర పరిశ్రమలను పునరుద్ధరించని యెడల ఖాదీ ఇకముందు అభివృద్ధి పొందజాలదని తెలిసింది. గ్రామస్థులు తమ విశ్రాంతికాలమును లాభకరంగా వినియోగించుకోవాలె నంటే గ్రామ జీవితమును గూర్చి సర్వతోముఖంగా పని చేయాలి. ఈ రెండు సంఘాలు చేయదలచుకొన్న పని అదే.

ఖాదీ ఒక ఆర్థిక ప్రతిపాదనము కానేకాదని అభి ప్రాయపడేవారు కూడా కొంద ఱున్నారని నాకు తెలుసు. గ్రామీణ కార్యకలాపములలో ఖాదీని కేంద్రంగా పేర్కొ-

న్నందుకు వారు గాబరాపడ రనుకొంటున్నాను. ఖాదీకి తది తర గ్రామపరిశ్రమలకును గల పరస్పర సంబంధమును వివ రించనిదే నా మనస్సులోని అభిప్రాయాన్ని సమగ్రంగా చిత్రించినట్లు కాదు. దానిని గ్రహించనివారు తదితర పరి శ్రమలయెడల తమ దృష్టిని కేంద్రీకరించవలయునని ఆహ్వా నిస్తున్నాను.

హారిజన్, 16-11-'34.

## *గ్రామ పరిశ్రమల ప్రణాళిక*

మన రోజునారీ అవసరములను సరఫరా చేసేటందుకు గ్రామాల వైపుకు మన దృష్టిమరల్చడమే గ్రామపరిశ్రమల ప్రణాళికలోని అభిప్రాయము. అయితే మనకు కావలసిన వస్తువులు కొన్ని ఆ విధంగా లభించనప్పుడు, కొంచెం శ్రమ పడి తగిన యేర్పాటు చేసుకుంటే అవి లాభకరంగా సరఫరా అవడానికి వీలుందా ? అని ఆలోచించాలి. లాభకరంగా సరఫరా కావడం అంటే మనకు లాభకరంగాకాదు; గ్రామస్థు లకు లాభకరంగా. ప్రారంభదశలో వస్తువు మంచిది దొరకక పోవచ్చు, కొంచెం ఎక్కువ ఖరీదుకూడా కావచ్చు. అయితే మనకు వస్తువులు సరఫరా చేసేవానియందు శ్రద్ధవహించి, వస్తువు ఎక్కువ బాగా తయారుచేయవలయునని వానిని ప్రోత్సహిస్తూ వానికి సహాయపడేయెడల పరిస్థితులు అభివృద్ధి పొందగలవు.

హారిజన్, 23-11-'34.

శ్రమ తగ్గించుకొనే ఉపాయము లేలకూడదు ? చేతితో వడ్లు దంచడం, తిరగలితో పిండి విసరడం కూడదని ఒక విలేఖకుడు అభ్యంతరపెట్టగా గాంధీజీ ఇలా ప్రత్యుత్తర మిచ్చారు?

పిండి విసురుకోవడం, వడ్లు దంచుకోవడంవంటి పురాతన పద్ధతులపైన కేవలం పక్షపాతంతో కాదు నేనా పనులను ప్రోత్సహిస్తూన్నది. పనిలేకుండా జీవిస్తూన్న లక్షలాది ప్రజలకు పని కల్పించడానికి మఱొక మార్గం లేకపోబట్టి నేనా పనులు సూచిస్తూన్నాను. తీవ్రమైన ఆర్థిక దుస్థితిని మనం పరిష్కరింపజాలని యెడల గ్రామాభ్యుదయం సాధ్యంకాదని నా అభిప్రాయం. కాబట్టి వారికి పనిలేని కాలాన్ని సద్వినియోగం చేయడానికి ప్రోత్సహించడమే గట్టి గ్రామాభ్యుదయ కార్యం.

హరిజన్, 30-11-'34.

*గ్రామ పరిశ్రమలు దేనికి ?*

రోజువారీ ఉపయోగంకోసం, ఇంతకుముందు గ్రామస్థులు చేయని వస్తువుకానీ ఇప్పుడు చేయజాలని వస్తువుకానీ లేదు. మన బుద్ధిసూక్ష్మతను ఉపయోగించి మన దృష్టిని కేంద్రీకరించేయెడల, చెప్పదగిన ప్రతిఫల మేమీా ఈయకుండా ఇప్పుడు మన స్వార్థంకోసం ఉపయోగించుకొంటూన్న గ్రామస్థులకు వెంటనే లక్షలాది రూపాయిలు లభించేటట్లు చేయవచ్చును. ఈ విషాద పరిస్థితిని అరికట్టేటందు కిదే

సమయం. అస్పృశ్యులుగా పరిగణింపబడుతూన్న వారే అస్పృశ్యత అనే ఆచారాన్ని రూపుమాపడంకంటె ఇంకా ఎక్కువ అర్థం నా అస్పృశ్యతా ప్రతికూలోద్యమంలో ఇమిడి ఉన్నది. నగరవాసికి పల్లెటూళ్లు అస్పృశ్యములు. గ్రామాలను ఆయన ఎఱుగడు. అక్కడ ఆయన నివసించడు. ఒక వేళ ఆయన గ్రామంలో ఉండవలసివస్తే అక్కడ నగర జీవితాన్ని ఒరవడిగా పెట్ట ప్రయత్నిస్తాడు. ముప్పయి కోట్ల ప్రజలు నివసించడానికి తగినన్ని నగరాలను మనం నిర్మించ గలిగితే ఇది సహించవచ్చును. తక్కిన కారణముల కంటె ముఖ్యంగా నిర్బంధ, నిరుద్యోగ పరిస్థితివలన అంతకంతకు పెఱిగిపోతూన్న పేదరికమును అరికట్టటందుకు గ్రామపరిశ్రమలను పునరుద్ధరించడంకంటే కూడా ఇది ఎక్కువ అసాధ్యము.

హరిజన్, 30-11-'34.

## గ్రామములలో తయారైన వస్తువులనే వాడండి

(ఒక ఉపన్యాసమునుండి)

గ్రామస్థులకు మనము తీరని హాని చేసినాము. ఆ పాపానికి ప్రాయశ్చిత్తంగా పడిపోయిన వారి పరిశ్రమలను కళలను పునరుద్ధరించి అవి వెంటనే అమ్ముడుపోయే సదుపాయం కలిగించాలి. దేవునికంటె సహనశీలుడూ, క్షమాశాలీ మఱొకడు లేడు. కాని ఆయన సహనానికీ క్షమకూ కూడా ఒకపరిమితి ఉంది. మనం మన గ్రామాల యెడ నిర్వర్తించవలసిన కర్తవ్యము ను గూర్చి అశ్రద్ధచేసిన యెడల మన నాశనాన్ని మనమే

కోరుకుంటున్నా మన్నమాట. ఈ కర్తవ్యమేమీ అంతకష్ట మైనది కాదు. అది నమ్మడానికి వీలులేనంత తేలిక. మనం గ్రామీణ చిత్తవృత్తి కలిగివుండాలి. ఆ గ్రామీణ చిత్తవృత్తి తోనే మన అవసరాలను, మన కుటుంబ అవసరాలను ఆలో చించాలి. ఈ పని చాలా వ్యయముతో కూడినది కూడా కాదు. గ్రామస్థులు తయారుచేసిన ప్రతివస్తువు, పట్టణాలలోను నగరాలలోను వెంటనే అమ్ముడుపోవడానికి వీలుకలదని వారికి నచ్చచెప్పడాకి సమీప గ్రామాలకు పోయేటందుకు స్వచ్ఛంద సేవకులు కావాలి. ఈ పని అన్నికులాలకు, అన్నిసిద్ధాంతా లకు, అన్ని పక్షాలకు, అన్ని మతాలకూ సంబంధించిన స్త్రీ పురుషులందఱూ చేయదగినది. ఇది మన దేశము యొక్క నిజమైన ఆర్థిక వ్యవస్థకు అనుగుణమైనది.

హరిజన్, 1-3-'35

### గ్రామాలు స్వార్థపరులబారినుండి తప్పించుకోవాలి

(ఒక సంభాషణనుండి)

గ్రామం పరుల స్వార్థంకోసం ఉపయోగించుకోబడ కుండా ఉన్నప్పుడే దాని పునరుద్ధరణం సాధ్యపడుతుంది. భారీ యెత్తున జరిగే పారిశ్రామిక విధానం వలన ఉత్పత్తి విషయంలోనూ సరుకు విడుదల సందర్భంలోనూ పోటీ యేర్పడి తప్పనిసరిగా గ్రామవాసులను ప్రయత్నపూర్వకంగా గానీ, అప్రయత్నంగా గానీ స్వార్థం కోసం వినియోగించు కోవడం జరుగుతుంది. కాబట్టి మనం గ్రామస్థులకు ప్రధానంగా

కావలసిన వస్తువులను తయారుచేసికొని గ్రామాలు స్వయం సంపూర్ణములుగా ఉండేటట్లు శ్రద్ధ తీసుకోవాలి. గ్రామ పరిశ్రమలలోని ఈ సుగుణాన్ని నిలుపుకొన్నట్లయితే, గ్రామస్థులు ఆధునిక యంత్రములను గానీ, తాము చేసుకోగలిగి వాడుకోగలిగిన ఇతర పరికరములను గాని ఉపయోగించుకొనేటందు కభ్యంతరంలేదు. వారు పరుల స్వార్థంకోసం పనిముట్లుగా మాత్రం ఉపయోగపడకూడదు.

హారిజన్, 29-8-'36.

### ఉన్న యంత్రశక్తిని ఉపయోగించుకోవడం

ప్రశ్న : గుజరాతులోని వేలకొలది గ్రామాలలో పిండి మరలు ఇంజన్లతో పనిచేస్తూన్నవి. వీటిని నదులు, చెఱువులు, నూతులు మొదలగు జలాధారములకు మరల్చి వ్యవసాయమునకు నీళ్లు తోడేటందుకు తేలికగా ఉపయోగించుకోవచ్చును. పిండి విసరడంతోపాటు ఈ ఇంజన్లను ఉపయోగకరమైన పనికి మరల్చేటందుకు ప్రభుత్వం వారిని కోరడానికి కానీ యజమానులను ప్రోత్సహించడానికి కానీ వీలులేదా ?

జవాబు : వేలకొలది గ్రామాలలో ధాన్యాలను పిండి చేయడానికి ఉన్నయంత్రాలు మన నిస్సహాయత్వముయొక్క అవధిని ప్రకటిస్తూన్నవని నా అభిప్రాయము. ఇండియా, అన్ని పిండియంత్రాలనూగానీ, అన్ని ఇంజన్లనూగానీ ఉత్పత్తి చేయడంలేదను కొంటాను. ఈ విలేఖకుడు వ్రాసినది నిజం

కాకూడదనీ భారత దేశమంతటిలో కూడా యంత్రాలు కాని, ఇంజనులు కానీ వేలసంఖ్యలో ఉండవనీ నేను ఎక్కువగా ఆశిస్తూన్నాను. కాని ఇదే నిజమైతే మన వాళ్లెంత సోమరి తనమునకు పాల్పడ్డారో దీనివలన తెలుస్తుంది. అటువంటి యంత్రసామగ్రినీ, ఇంజన్లను అంత భారీఎత్తున స్థాపించడం కూడా దురాశకు ఒక చిహ్నం. పేదవాళ్లకు నష్టం కలిగించి ఈ విధంగా తమ జేబులు నింపుకోవడం న్యాయమా? ఒక్కొక్క యంత్రం వేలకొలది చక్కీలను మూలపడవేస్తుంది. ఈ చక్కీలను తయారుచేసే వేలకొలది కళాకారులకు, గృహిణులకు పనిలేకుండా చేస్తుంది. పైగా ఈ పద్ధతి అంటుజాడ్యం వంటిది. ప్రతి గ్రామపరిశ్రమకు వ్యాపిస్తుంది. గ్రామ పరిశ్రమతోపాటు పనితనం కూడా నశిస్తుంది. ఇది పాతపరిశ్రమలకు బదులు క్రొత్త పరిశ్రమలు స్థాపించడమయితే, అంతగా ప్రతికూలంగా ఉండనక్కరలేదు. కాని ఈ జరుగుతూన్నపని అదికాదు. ఇంజన్లతో తిరిగే యంత్రాలున్న వేలకొలదీ గ్రామాలలో, ఉదయంపూట తిరగళ్ల మధురగానం వినపడకుండా పోతుంది కూడా.

ఇక అసలు విషయానికి వద్దాము. ఈ పవరింజనులు ప్రస్తుతం దుర్వినియోగం చేయబడుతూన్నప్పటికీ, ఈ ఇంజనులు ప్రస్తుతం చేస్తూన్నపనికితోడు నదులు, చెఱువులు, నూతులలోనుండి వ్యవసాయం నిమిత్తం నీళ్లు తోడేటందుకుపయోగింపబడే యెడల అది కొంత మేలుగానే ఉంటుంది. దీనికి ప్రభుత్వ సహాయం కావాలంటాడు మా విలేఖకుడు.

అది అవసరమా? ఆ యజమానులే తమ ఇంజన్లను, అవసరమూ ప్రయోజనకరమూ అయిన ఈ పనికి మఱల్చలేరూ? ప్రభుత్వంవారి నిర్బంధంలేకుండా మనం యేపనిచేయడానికీ ఇష్టంలేనంత హీనస్థితికి దిగిపోయినామా? అయినప్పటికీ ప్రజలను ఎదుర్కొంటూన్న భయంకర పరిస్థితినుండి రక్షించేటందుకు ప్రస్తుత యంత్రశక్తిని సద్వినియోగంచేయడానికి అవసరమైన అన్ని చర్యలను తీసికోవలసిందని నా నిశ్చితాభిప్రాయము.

హరిజన్ 10-3-'46.



# 8

## భూస్వామ్యము - అహింసాదర్శము

జమీందారులు ఉన్న అవకాశాన్ని పోగొట్టుకోక పోవడం మంచిది. వారు కేవలం శిస్తులు వసూలు చేసుకొనే వారుగా ఉండకూడదు. వారు తమ రైతులకు ట్రస్టీలుగాను, నమ్మిన మిత్రులుగాను ఉండవలెను. వారి సొంత ఖర్చులకు పరిమితి యేర్పాటు చేసుకోవాలి. వివాహములలోను తదితర సందర్భములలోను రైతులనుండి నిర్బంధముగా తీసికొనే కట్నములు మొదలగు ఆక్షేపకరము లయిన సంపాదనలను వదులుకోవాలి. ఒక రైతునుండి మఱొక రైతుకు పట్టాను బదిలీ చేసినప్పుడు, శిస్తు చెల్లించని కారణంతో భూమినుండి తొలగించిన రైతును తిరిగి భూమిలో ప్రవేశపెట్టినప్పుడు, పుచ్చుకునే నజరానాలను ఆశించకూడదు. వారు రైతులకు నిలకడగల భూస్వామ్యమును కలుగచేయాలి. రైతుల క్షేమానికి ఎక్కువగా శ్రద్ధ తీసుకోవాలి. వారి పిల్లలకు చక్కగా పరిపాలింపబడుతూన్న పాఠశాలలు, పెద్దలకు వయోజన విద్యాశాలలు యేర్పాటు చేయాలి. రోగులకు ఆస్పత్రులు ఔషధాలయాలు నిర్మించాలి. గ్రామాల ఆరోగ్య రక్షణకు తగిన శ్రద్ధ తీసికోవాలి. ఇంకా అనేక పద్ధతులద్వారా జమీందారులు తమ నిజమైన మిత్రులనీ, వారు చేస్తూన్న అనేక విధములయిన ఉపకారాలకు ఏదో కొంత రుసుము మాత్రమే వారు ప్రతిగ్రహిస్తూన్నారనీ రైతులకు తోచేటట్లు చేయాలి.

సంగ్రహంగా చెప్పవలసివస్తే వారి స్థితికి తగినట్లు వారు ప్రవర్తించాలి. వారు కాంగ్రెసువారిని విశ్వసించాలి. వారే కాంగ్రెసువాదులై కాంగ్రెసు — ప్రజలకు — ప్రభుత్వానికి ఒక సేతువు వంటిదని గ్రహించాలి. ప్రజల నిజమైన క్షేమమును మనస్సులో పెట్టుకొన్న వారందరు కాంగ్రెసు యొక్క సేవలను ఉపయోగించుకోగలరు. జమీందారుల యెడ కిసానులు తమ బాధ్యతలను 'తూ' 'చా' తప్పకుండా నిర్వర్తించేటట్లు కాంగ్రెసు వాదులు జాగ్రత్త వహించాలి. కేవలం చట్టబద్ధము లయిన బాధ్యతలు మాత్రమే కాదు, వారు న్యాయమని అంగీకరించిన బాధ్యతలు కూడానని నా అభిప్రాయం. జమీందార్లతో యేమీ సంబంధం లేకుండా భూములు కేవలం తమవేననే సిద్ధాంతాన్ని వారు నిరాకరించాలి. జమీందారు కుటుంబ యజమానిగా రైతుల హక్కులకు భంగం రాకుండా కాపాడుతూ ఉండగా రైతులు సమిష్టికుటుంబ సభ్యులుగా ఉంటారు, లేక ఉండాలి.

చట్టం ఎలా ఉన్నప్పటికీ జమీందారీ సిద్ధాంతం సమర్థనీయం కావలెనంటే అది సమష్టికుటుంబ పరిస్థితులకు సన్నిహితంగా ఉండాలి.

యంగ్ ఇండియా, 28-5-'31

*జమీందారులు, తాలూకుదారులు*

క్షత్రియులని పిలవబడేవారు అధికులుగా నటించడానికీ పేదరైతులు పుట్టుకతోనే తక్కువజాతికి చెందినట్లూ తమ

జీవితమునకదే తగియున్నట్లూ అంగీకరించి లోబడి ఉండడానికీ వర్ణాశ్రమ ధర్మములను గూర్చిన వికారపు వర్ణనమే కారణము. భారతీయ సంఘం శాంతిపద్ధతులద్వారా అభివృద్ధిపొందవలెనంటే, ధనికవర్గాలవారు, రైతులు కూడా తమ ఆత్మవంటి ఆత్మనే కలియున్నారనీ, తమ భాగ్యమువలన తాము పేదలకంటె ఏ విధంగానూ అధికులుకారనీ గ్రహించాలి. జపానుదేశపు శ్రీమంతులవలెనే తాము కూడా తమ రక్షణలోనున్న రైతుల క్షేమంకోసం తమ ధనమునకు ట్రస్టీలుగా నున్నట్లు భావించాలి. అప్పుడు వారు తమ శ్రమకు తగిన మొత్తం కంటె యెక్కువగా ప్రతిఫలం తీసుకోరు. ప్రస్తుతం ధనికవర్గము వారి ఆడంబరానికీ, దుబారాఖర్చుకూ, వారెవరి మధ్య నివసిస్తున్నారో ఆ రైతుల నీచ పరిస్థితులకు నిత్యదరిద్రానికీ పరస్పర సంబంధమేమీలేదు. కాబట్టి ఆదర్శప్రాయుడయిన జమీందారు, రైతు భరిస్తూన్న భారాన్ని వెంటనే తగ్గిస్తాడు. రైతుతో సన్నిహిత సంబంధం కల్పించుకొంటాడు. వారి కోరికలు తెలుసుకొంటాడు. వారిని నిర్జీవులుగా చేస్తూన్న నిరాశకు బదులు ఆశను ప్రజ్వలింప చేస్తాడు. ఆరోగ్య రక్షణను గూర్చి పరిశుభ్రతను గూర్చి వారికి తెలియకపోవడం ఆయనకు సంతృప్తికరంగా ఉండదు. రైతుకు కావలసిన జీవితావసరములకోసం ఆయన పేదరికాన్ని అనుభవిస్తాడు. తన రక్షణక్రింద నున్న రైతుల ఆర్థిక పరిస్థితులను పరిశీలిస్తాడు. తన పిల్లలతోపాటు కలిసి రైతుల పిల్లలు కూడా చదువుకోవడానికి పాఠశాలలు స్థాపిస్తాడు. గ్రామంలోని

నూతిని, చెఱువును పరిశుభ్రంచేయిస్తాడు. తమ రోడ్లను తాను ఊడ్చుకొనేటట్లు, తమ మఱుగు దొడ్లను తాము శుభ్రంచేసికొనేటట్లు, రైతులకు ప్రబోధం చేస్తాడు. రైతులు నిరభ్యంతరంగా తన తోటను ఎరమరిక లేకుండా ఉపయోగించుకొనే సావకాశం కల్పిస్తాడు. తన ఆనందంకోసం, అనవసరంగా ఉంచుకొన్న భవనాలను చాలా వాటిని ఆస్పత్రులుగా, పాఠశాలలుగా, ఇంకా ఇతర ధర్మసంస్థలుగా వినియోగిస్తాడు. ధనవంతులు కాలపరిణామమును గుర్తించి, తమ ఆస్తులపైన తమకుగల హక్కును భగవంతుడు ప్రసాదించాడనే భావాన్ని మార్చుకొన్న యెడల, ఇప్పుడు గ్రామాలుగా పరిగణింపబడుతూన్న పేదులక్షల మురికి కూపాలూ క్షణమాత్రంలో, శాంతికీ, ఆరోగ్యమునకూ, సౌఖ్యమునకూ నిలయములు కాగలవు. పెట్టుబడిదారు జపాను దేశీయుడైన సమురాయిని అనుకరించిన యెడల అతనికి నిజంగా పోయేదేమీలేక పోగా పై పెచ్చు లాభిస్తుంది కూడా. ధనవంతుడు తన భోగములను బుద్ధిపూర్వకంగా త్యాగంచేసి తక్కినవారందఱి సౌఖ్యమునకు దోహదం చేయవలెను. ఇంతకంటె గత్యంతరంలేదు. ధనవంతుడు సకాలంలో మేల్కొనక పోయినయెడల దరిద్రమనుభవిస్తూ అజ్ఞానంలో మునిగియున్న లక్షలాది ప్రజలు దేశాన్ని కల్లోల పరిస్థితులకు తీసికొని రాగలరు. మిక్కిలి శక్తివంతమైన ప్రభుత్వం ప్రయోగించగలిగిన సైనికబలం కూడా ఆ పరిస్థితులను ఆపలేదు. భారతదేశ మటువంటి విపత్తు రాకుండా కాపాడుకో

గలదని ఆశిస్తున్నాను. సంయుక్త రాష్ట్రాలలోని యువక తాలూకాదారులతో నాకు కలిగిన సన్నిహిత సంబంధం వలన నాకీ ఆశ మఱింత పటిష్ఠమయింది.

యంగిండియా, 5-12-'29.

## సమ విభాగము

ప్రతి మనిషికీ ప్రకృతిసిద్ధములయిన అవసరాల నిమిత్తం "కావలసిన ద్రవ్య ముండాలి. అంతకంటె ఎక్కువ ఉండ కూడదు" అనే సిద్ధాంతమే సమవిభాగంలోని నిజమైన భావం. ఉదాహరణకు జీర్ణశక్తి తక్కువగానున్న మనిషికి పావుపౌను గోధుమపిండి కావలసి ఉంటే మఱియొకనికి వాని ఆకలితీర్చు కోవడానికి పౌనుపిండి కావలసి రావచ్చును. ఈ ఉభయులు కూడా తమ అవసరాలను తీర్చుకోగలిగిన స్థితిలో ఉండాలి, ఈ ఆదర్శాన్ని ఆచరణలోకి తీసికొనిరావలెనంటే సంఘ వ్యవస్థ యావత్తూ పునర్నిర్మాణం కావాలి. అహింసమీద ఆధారపడిన సంఘం ఇంతకంటె వేఱొక ఆదర్శాన్ని ప్రబో ధించదు. బహుశా మన మీ ఆదర్శాన్ని అందుకోలేక పోవచ్చును; కాని దానిని మనస్సులో పెట్టుకొని దానిని సమీపించడానికై నిరంతరం ప్రయత్నించాలి. ఆ ఆదర్శా నికి ఎంత దగ్గరగా పోగలమో అంత సంతృప్తీ, ఆనందమూ పొందగలము. అంతేకాక ఆ మేరకు అహింసాయుత సమా జాన్ని స్థాపించేటందుకు కృషిచేసిన వారము కాగలము.

ఇతరుల కొఱకు వేచియుండకయే ఈ పద్ధతి జీవితము నవలంబించుటకు ప్రతి వ్యక్తికీ చక్కగా సాధ్యముకాగలదు.

ఒక వ్యక్తి తన ప్రవర్తనలో ఒక నియమమును అవలంబించ గలిగిన యెడల కొంతమంది వ్యక్తులు కూడా అట్టి నియమ మును అవలంబించ గలుగుదురన్నమాటే. ఒక మంచి మార్గ మును అవలంబించేటందుకు ఎవ్వరూ ఇతరులకోసం వేచి యుండనక్కరలేదని నేను గట్టిగా చెప్పగలను. తమ లక్ష్యాన్ని సంపూర్ణంగా సాధించలేమనుకొన్నప్పుడు మనుష్యులు సాధా రణంగా ఒక పనిని ప్రారంభించడానికే సందేహిస్తారు. అటు వంటి చిత్తవృత్తి నిజంగా అభివృద్ధికి అడ్డంకు కలిగిస్తుంది.

అహింసద్వారా సమవిభాగ మెలా ఆచరణ యోగ్యము కాగలదో ఇప్పుడు విచారిద్దాం. ఈ ఆదర్శాన్ని తనలో జీర్ణించుకొన్నవాడు తన వ్యక్తిగత జీవితంలో అవసరమైన మార్పులను చేసుకోవడమే మొట్టమొదట నిర్వహించవలసిన పని. భారతదేశము యొక్క పేదఱికమును మనసులో పెట్టు కొని తన కోరికలను సాధ్యమైనంతవఱకు ఆయన తగ్గించుకో గలడు. ఆయన సంపాదనలో యేవిధమైన అన్యాయము ఉండదు. ఆకస్మిక లాభాలకోసం అంగలార్చడు. అతని నూతన జీవిత విధానమునకు తగినట్లుగా అతని నివాస ముంటుంది. అతని జీవితంలో ప్రతివిషయంలోను ఆత్మ నిగ్రహం ప్రతిబింబిస్తూంటుంది. అతడు తన జీవితంలో తనకు సాధ్యమయినంత వరకు ఈ ఆదర్శమును నిర్వహించగలిగిన పిమ్మటనే దీనిని తన స్నేహితులకు తన ఇరుగు, పొరుగువారికి బోధించగలడు.

ధనవంతులు తమ కవసరమైన దానికంటె ఎక్కువగా నున్న ద్రవ్యమునకు ట్రస్టీలు మాత్రమేనన్న సూత్రము ఈ సమవిభాగ సిద్ధాంతమునకు మూలము. ఈ సిద్ధాంత ప్రకారం వారు తమ ఇరుగు, పొరుగు వారికంటె ఒక్క రూపాయి కూడా ఎక్కువ కలిగి యుండరాదు. దీనిని ఆచరణలోకి ఎలా తేవడం? అహింసా యుతంగానా? లేక ధనవంతుల ఐశ్వర్యాన్ని తొలగించడం ద్వారానా? ఈ పనికి మనం నిజంగా హింసకు దిగవలసి ఉంటుంది. ఈ హింసా యుతమైన చర్య సమాజమునకు మేలుచేయదు. అందువలన సమాజం ఎక్కువ నష్టపడుతుంది. ఎందుకనగా, ధనసేకరణం చేయగల మానవుని శక్తులను అది పోగొట్టుకొంటూన్నది. కాబట్టి అహింసాయుత మార్గమే ఉత్తమమైనది. ఈ పద్ధతి వలన ధనవంతుని ఐశ్వర్యం అతనికడనే ఉంటుంది. అతడు తన వ్యక్తిగతావసరములకు న్యాయంగా కావలసినంత వఱకు ఉంచుకొని, తక్కిన దానిని సమాజమునకు వినియోగించేటందుకు ట్రస్టీగా ఉంటాడు. ఈ వాదంలో ట్రస్టీ నిజాయితీగా ఉంటాడనే భావం ఇమిడి ఉంది.

తాను సమాజమునకు సేవకుడుగా భావించినంతనే, మానవుడు సమాజంకోసం సంపాదించి దానికోసమే వెచ్చిస్తాడు. అప్పుడు అతని సంపాదనకు పవిత్రత వస్తుంది. అతని కృషిలో అహింస ఉంటుంది. పైగా మానవుల మనస్సులీ తరహా జీవిత విధానమువంకకు మఱలినయెడల సమాజంలో

శాంతియుత విప్లవము, యే విధమైన పారుష్యమూ లేకుండా జరుగుతుంది.

మానవ ప్రకృతిలో ఎప్పుడైనా అటువంటి మార్పు జరిగినట్లు చరిత్ర చెబుతూన్నదా అని ప్రశ్నించవచ్చును. అట్టిమార్పులు వ్యక్తులవిషయంలో నిజంగా జరుగుతూనే వచ్చినవి. సమాజ మంతటిలో అట్టివి జరిగినట్లు కనిపించక పోవచ్చును. అనగా అహింసామార్గంలో పెద్ద ఎత్తున ఇటు వంటి ప్రయోగం ఇంతవఱకు జరుగలేదని మాత్రమే అర్థం. ఎందువల్లనో కాని అహింస ముఖ్యంగా వ్యక్తులకు మాత్రమే తగిన ఆయుధమనీ, కాబట్టి దానిని ఆ పరిమితరంగంలోనే ఉపయోగించ తగునని ఒకతప్పు నమ్మకం మనలో ఆవరించు కొని ఉన్నది. అది సరియైనది కాదు. అహింస నిశ్చయంగా సమాజమునకు ఉపాధి. ఈ సత్యమును ప్రజలు గ్రహించేటట్లు చేయడమే నా ప్రయత్నమూను, నేను నిర్వహిస్తూన్న ప్రయోగమూను. అనేక విచిత్రాలు జరుగుతూన్న ఈ కాలంలో ఒక విషయం కానీ, ఒక అభిప్రాయం గానీ కొత్త దయినంత మాత్రమున పనికిమాలినదని ఎవ్వరూ అనరు. ఒక కష్టమైనపనిని అసాధ్యమనడంకూడా ఈ కాలానుగుణంగా ఉండదు. కలలో కూడా అనుకోని విషయాలు నిత్యమూ జరుగుతూనే ఉన్నవి. అసాధ్యము లనుకొనేవి సాధ్యములవు తూన్నవి కూడా. హింసారంగంలో కనిపెట్టబడుతూన్న అద్భుత విషయాలనుగూర్చి మనము నిత్యమూ ఆశ్చర్యపడు

తూనే ఉన్నాము. అహింసారంగంలో అంతకంటె కూడా అసాధ్యములుగా కనిపించేవి కలలో సైతం కానరానివి కనిపెట్ట వచ్చునని నా దృఢవిశ్వాసము. మత చరిత్రనిండా అటువంటి ఉదాహరణా లనేకములు కనిపిస్తూన్నవి. సమాజంలో నుండి మత విశ్వాసాన్ని పెకలించివేసే ప్రయత్నం ఎండమావుల కోసం పరుగుపెట్టడం వంటిది. అథవా ఒకవేళ ఆ ప్రయత్నం సఫలమయ్యేయెడల, అంతటితో సంఘం నిర్మూలమైనట్లే. మూఢవిశ్వాసము, దురాచారము, ఇంకా ఇతర లోపాలూ సంఘంలో ఆయా కాలములలో వ్యాపించి తాత్కాలికంగా మతమును పాడుచేస్తూ ఉంటాయి. అటువంటివి వస్తూ పోతూ ఉంటాయి. కాని మతం ఆలాగే ఉంటుంది. మొత్తంమీద ప్రపంచం మతంపైన ఆధారపడి ఉండడమే అందుకు కారణం. దైవనియతికి లోబడి ఉండడమే మతము యొక్క అంతిమ నిర్వచనమని చెప్పవచ్చును. దేవుడూ, అతని నియతీ ఈ రెండూ పర్యాయపదములు. కాబట్టి దైవం అనే పదం శాశ్వతమైన సజీవమైన నియతిని సూచిస్తుంది. ఎవ్వరూ ఆయనను నిజంగా దర్శించలేరు. కాని అవతార మూర్తులు, ఋషులు తమ తపోబలం వలన ఈ శాశ్వత నియతిని గూర్చి మానవసమాజానికి అవ్యక్తంగా క్షణమాత్ర నిదర్శనం చూపగలిగినారు.

కాని ఎంత ప్రయత్నం చేసినప్పటికీ పేదలకు భాగ్య వంతులు నిజమైన అర్థంలో సంరక్షకులుగా నుండనప్పుడు,

పేదవాళ్లు అంతకంతకు ఆకలితో పీడింపబడుతూన్నప్పుడు ఏమి జరుపగలెను? ఈ క్లిష్టసమస్యను పరిష్కరించేటందుకు, అహింసాయుత అసహాయోద్యమ శాసనోల్లంఘనములను ప్రమాదరహితములైన సక్రమ మార్గములుగా సూచించాను. సమాజంలో పేదల సహాయం లేనిదే భాగ్యవంతులు ధనమును పోగుచేయ లేరు. మానవుడు మొదటినుండి హింసతో ఎక్కువ పరిచయం గలిగిఉన్నాడు. అతను ప్రకృతిలోనున్న జంతుబలమును పుట్టుకతో పొందియుండడమే అందుకు కారణం. అతడు చతుష్పాద స్థితినుండి ద్విపాదస్థితికి అభివృద్ధి పొందినప్పుడే అహింసాబలమును గూర్చిన జ్ఞాన మతని ఆత్మలో ప్రవేశించింది. ఈ జ్ఞాన మతనిలో క్రమానుగతంగాను, నిశ్చయంగానూ అభివృద్ధి పొందింది. ఈ జ్ఞానము పేదప్రజానీకములోనికి చొచ్చుకొని పోయి వ్యాపించినట్లయితే వారు బలవంతులై, తాము దాదాపు వస్తులు పరుండడానికి కారణభూతమైన పీడాకర వ్యత్యాసములనుండి అహింసా మూలకముగా మోక్షమును సాధించుకొనగల శక్తిని పొందగలరు.

అసహాయోద్యమ శాసనోల్లంఘనములను గూర్చి నేనేమీ ఇక్కడ వ్రాయనక్కరలేదు. వీని సంగతి నా పాఠకులకు బాగా తెలుసు.

హరిజన్ 25-8-'40

## అహింసా విధానములు

అపవిత్రములైన విధానములు దుష్ఫలితములనే చేకూర్చగలవు. సంస్థానాధిపతి తల నఱికినంత మాత్రాన సంస్థానాధిపతీ, రైతూ సమానం కాడు. యజమాని తల నఱికినంత మాత్రాన యజమానీ, పనిమనిషీ సమానం కాడు. అసత్యంవలన సత్యనిర్ధారణ జరుగదు. సత్యప్రవర్తనము వలననే సత్యాన్ని తెలుసుకోగలము. అహింసా సత్యములు రెండూ కవలలు కావా ? స్పష్టంగా 'కానేకావు'. అహింసా సత్యములు రెండూ అవినాభావ సంబంధములు. గనుక వాటిని రెంటిని నాణెముయొక్క బొమ్మ, బొరుసు అని చెప్పవచ్చును. ఒకదానినుండి రెండవదానిని విడదీయడానికి వీలులేదు. నాణెములో ఏ వైపు చదివినా వర్ణక్రమం భేదంగా ఉండవచ్చును. కాని నాణెముయొక్క విలువ ఒక్కటే. ఈ ఉత్కృష్ట పరిస్థితి పరమ పవిత్రభావం లేనిదే సాధ్యంకాదు. మనస్సులోకానీ, శరీరంలోకానీ కల్మష మున్నయెడల, అసత్యమునకూ, హింసకూ తావల మేర్పడు తుంది.

కాబట్టి సత్యసంధులు, అహింసాపరులు, నిష్కల్మష హృదయులు అయిన సామ్యవాదులు మాత్రమే ఇండియా లోను, ప్రపంచంలోనూ కూడా సామ్యవాదాన్ని సంస్థాపింప చేయగలరు.

హరిజన్ 13-7-'47.

## అహింసాయుత అర్థశాస్త్రము

(ఒక ఉపన్యాసమునుండి)

న్యాయంగా చెప్పవలసివస్తే ఎంతకొద్దిగానైనా హింస లేనిదే ఏ పరిశ్రమగానీ ఏ పనిగానీ నడువదు. కొంతయినా హింసలేనిదే అసలు జీవించడమే అసాధ్యం. అయితే సాధ్యమయినంత వఱకు ఆ హింసను తగ్గించగలగడమే మనము చేయగలిగిన పని. అసలు అహింస అనే పదమే నిషేధార్థకపదం. జీవితంలో తప్పనిసరియైన హింసను త్యజించేటందుకు జఱిగే ప్రయత్నమని దానిఅర్థం. కనుక అహింసలో నమ్మకం గలవారు సాధ్యమైనంత తక్కువహింసగల వృత్తులనే అవలంబిస్తారు. అనగా అహింసలో నమ్మకం కలిగిన వ్యక్తి కసాయిపనికి పూనుకుంటాడనుకొనేటందుకు వీలు లేదు. కాని మాంసాహారి అహింసాయుతుడుగా ఉండజాలడనలేము. అహింసలో నమ్మకం కలిగిన మాంసాహారి కూడా వేటకు పోడు. యుద్ధంలోనూ, యుద్ధసన్నాహము లోనూ జోక్యం కలిగించుకోడు. కనుక తప్పనిసరిగా హింసతో కూడిన అనేక వృత్తులను పనులను అహింసాయుతుడైన వ్యక్తి త్యజించి తీరవలయును. అయితే వ్యవసాయం లేకుండా జీవించడం అసాధ్యం. కాని అది కొంత హింసతో కూడిన పని. కనుక మనం నిర్ణయించవలసిన ముఖ్యవిషయమేమంటే ఆ వృత్తిహింసమీాదనే ఆధారపడియున్నదా? అనిఅన్నిపనులలోను ఎంతోకొంత హింస

ఉండనే ఉంటుంది గనుక దానిని సాధ్యమైనంతవరకు తగ్గించడమే మనం చేయగలిగిన పని. అహింసలో హృదయ పూర్వకమైన విశ్వాసం ఉంటేనే గాని ఇది సాధ్యం కాదు. ఒక వ్యక్తి నిజంగా హింసచేయకపోవచ్చు. కష్టపడి జీవిస్తూ ఉండవచ్చు కాని అతడు ఇతరుల ఐశ్వర్యాన్నీ అభివృద్ధినీ చూచి నిరంతరం అసూయతో కృశిస్తూన్నయెడల అతడు అహింసాపరుడు కాడు. కాబట్టి ప్రధానంగా హింసతో నిమిత్తం లేనట్టిన్నీ, ఇతరులను స్వార్థం కోసం వినియోగిం చుకో నట్టిన్నీ, పరులను గూర్చి అసూయపడనట్టిన్నీ వృత్తియే అహింసాయుతమైన వృత్తి అవుతుంది.

ఇందుకు నాకు చారిత్రక దృష్టాంతములు లేవు. కాని, గ్రామ ఆర్థిక వ్యవహారములు అట్టి అహింసాయుత వృత్తుల మీదనూ, మానవుని హక్కులపై గాక కర్తవ్యములపై ననూ మాత్రమే ఆధారపడి నిర్మింపబడిన కాలము ఒకటి భారత దేశంలో ఉండెనని నా విశ్వాసం. అటువంటి వృత్తులను అవలంబించినవారు తమ జీవనోపాధిని సంపాదించుకో గలగడమే గాక సమాజ క్షేమమునకు కూడా తోడ్పడ్డారు. ఉదాహరణానికి వడ్రంగి గ్రామరైతుయొక్క అవసరాలను తీర్చేవాడు. గ్రామస్థులతనికి రొక్కంలో గాక వస్తురూపంలో ప్రతిఫలమిచ్చేవారు. ఈ విధానములో కూడా అన్యాయం జరగడానికి వీలుంది. కాని దానిని అత్యంతం తగ్గించ వచ్చును. అరవై సంవత్సరాల క్రిందట కథియవాడ్‌లోని జీవిత విధానమును నేను ప్రత్యక్షంగా ఎఱిగియున్న దానిని

బట్టి ఈ విషయం చెబుతున్నాను. ఈ నాటి కంటె ఆ నాడు వారి కళ్లల్లో ఎక్కువ కాంతీ, వారి అవయవాలలో ఎక్కువ బలమూ కనిపిస్తూ ఉండేది. అనుకోకుండానే అహింసపైన నిర్మింపబడిన జీవితమది.

ఈ వృత్తులకు, పరిశ్రమలకు శరీరకృషి ప్రధానంగా ఉండేది. భారీమెత్తు యంత్రసామగ్రి ఉండేదికాదు. తాను సొంతంగా దున్నగలిగినంత భూమితో మాత్రమే సంతృప్తి పడి ఉండేవ్యక్తి ఇతరులను స్వార్థంకోసం ఉపయోగించుకోజాలడు. చేతిపనులలో పరపీడనమునకూ, బానిసత్వమునకూ కూడా తావులేదు. భారీమెత్తు యంత్రసామగ్రి, తనకోసం చెమటవోడ్చి పనిచేసిన వారిపైన అధికారాన్ని చలాయించే ఒకానొక వ్యక్తి చేతులలో ఐశ్వర్యాన్ని కేంద్రీకరింపచేస్తుంది. అతడు తన కార్మికులకు ఆదర్శ పరిస్థితులను కల్పించేటందుకు ప్రయత్నించినప్పటికీ, అది వారిని స్వార్థంకోసం వినియోగించుకోవడమే అవుతుంది. కాబట్టి అది హింసయొక్క మఱొక స్వరూపము.

సంఘం పరపీడనముపైనగాక న్యాయంపైన ఆధారపడిన కాలం ఒకటి ఉన్నదని నేనన్నప్పుడు, సత్యాహింసలు కేవలం వ్యక్తులకు సంబంధించిన సుగుణాలుగా కాక సమాజముద్వారా ఆచరింపబడినవని సూచించడమే నా అభిప్రాయం. వ్యక్తులకు మాత్రమే సాధ్యమై కేవలం వారివఱకే పరిమితమైన సుగుణమునకు నేను కించిన్మాత్రం విలువకూడా ఈయను.

హరిజన్ 1-9-'40.

# 9

# గ్రామ రవాణా

## మోటబండిపక్షమున సమర్థన

బరోడా వాస్తవ్యుడు శ్రీ ఈశ్వరభాయి యన్. అమీన్ జంతుశక్తి, యంత్రశక్తుల పరస్పరభేదములను గూర్చి నాకొక పెద్ద వివరణమును పంపినాడు. దానిలోని ముఖ్యమైన భాగములనీ క్రింద పొందుపఱుస్తున్నాను.

"పొలములలోగానీ తక్కువ దూరములకు సంబంధించిన పనులలోగానీ జంతుశక్తి యంత్రశక్తికంటె ఎక్కువ ఖర్చుకు లోను కాదు. అందువలన అత్యధిక సందర్భాలలో జంతుశక్తి యంత్రశక్తితో పోటీచేయగలదు. యంత్రశక్తిపైనగల మోజుతో జంతుశక్తిని తృణీకరించడం ఈ నాటి వైఖరి.

ఉదాహరణానికి ఒక రెండెడ్ల బండిని తీసికొండి. బండి ఖరీదు రు 100 లు, ఎడ్ల ఖరీదు రు 200. ఈ ఎద్దు ఆ బండిని 16 బెంగాలు మణుగుల బరువుతో ఒడిదుడుకుగా ఉన్న గ్రామాల ఇసుకబాటలపైన రోజుకు కనీసం 15 మైళ్లు లాగగలవు. ఇందువల్ల రోజుకు రెండు ఎడ్లకు 0-12-0, 0-6-0 బండి మనిషికి, 0-4-0, బండి అరుగుదలక్రింద మొత్తం 1-6-0 ఖర్చు అవుతుంది. ఒక టన్ను మోటారులారీ 15 మైళ్లు పోవడానికి కనీసం ఒక గ్యాలన్ పెట్రోలు, కొంత మోబిల్ ఆయిలు, పెద్ద మరమ్మతు; డ్రైవరు పోషణ, పెద్దజీతంతో ఒక డ్రైవరు - ఇవన్నీ కావాలి. 15 మైళ్లు నడవడానికి లారీకి మోబిల్ ఆయిల్లుతో సహా, పెట్రోలు ఖర్చు రు 1-12-0 ఎనిమిదిగంటలు పనిచేసినందుకు డ్రైవరు పోషణకు రోజుకు రు 6 లు వంతున 15 మైళ్లకు 0-12-0 అవుతుంది.

డ్రైవరుకు, క్లీనరుకు, సరుకులు ఎక్కించడానికి, దింపడానికి 0-8-0 కావాలి. మొత్తం రు 2-12-0. అనగా 16 బెంగాలు మణుగులు గల ఒక బండి బరువుకు రు 1-6-0 అవుతుంది. ఒక ఎడ్లబండి, ఒక రోజులో ఊళ్లోనుండి ఒక అరమైలు దూరంలోనున్న పొలానికి 7, 8 బళ్ల ఎరువును తోలడానికి రు 1-6-0 అవుతుంది. అయితే ఎరువు నింపడానికీ, దింపడానికీ అదనపు మనిషికి మరొక 0-6-0 ఇవ్వవలసి ఉంటుంది. ఈ పనినే మోటారులారీ చేసే యెడల ఇంత కంటె తక్కువ ఖర్చుకాదు. మంచి కంకరరోడ్డుమీద చాలా దూరం ఒకే పరుగులో బరువులు తీసికొని వెళ్లవలసిన సందర్భాలలో మోటారు, ఎడ్లబండితో పోటీ చేయవచ్చును. ఎడ్లబండి నెమ్మదిగా నడుస్తుంది. కనుక అప్పుడు లాభదాయకంకాదు, ఒకే పర్యాయం జంతువులను చాలా ఎక్కువ దూరం నడిపించడం వాంఛనీయంకాదు. అందువల్ల వాటిశక్తి క్షీణించడమేకాక, ఆరోగ్యం కూడా చెడిపోతుంది. కాని ఎడ్లబళ్లు రైల్వేస్టేషనుల నుండి ఎక్కడో మారుమూలనున్న చోట్లకు మోటారు లారీలతో పోటీచేస్తూ చాలా దూరప్రయాణాలు చేస్తూండడం మనం చూస్తూంటాము. కాని ఆ ఎడ్ల శరీరస్థితిచూస్తే చాలా జాలి వేస్తుంది. యజమానులకు తక్కువ ఆదాయం వస్తూన్నందువల్ల, ఎడ్లకు వారు మేతకూడా తక్కువగా పెడుతూంటారు. సామానులుగాని మనుష్యులుగాని ఒక చోటనుండి మరొక చోటికి తొందరగా చేరవలసిన అవసరాలలో మాత్రం, నెమ్మదిగా పోయే ఎడ్లబళ్లు పనికి రాకుండా పోతున్నవి. అయితే విశ్రాంతి సమయాలలో సంపాదన ప్రసక్తి లేని గ్రామస్థులకు మోటారువల్ల కలిసివచ్చేకాలం అంత ముఖ్యం కాదు. కాబట్టి వారు కొద్దిదూరమయితే నడవడం, ఎక్కువ దూరమైతే ఎడ్లబండిని పెట్టుకోవడం ఉత్తమంగా భావించాలి. రైతు తన సొంత బండిలో ప్రయాణంచేసే యెడల వెంటనే యేమీ

డబ్బు ఖర్చుపెట్టనక్కరలేదు. తన పొలంలో పండిన గ్రాసంతోనే ఎడ్లనుమేపి వాటికి బలం చేకూర్చవచ్చును. రైతు తన పొలంలో పండిన గడ్డినీ, ధాన్యములను పెట్రోలుగాను, తన బండిని మోటారు లారీగాను, ఎడ్లను ఇంజనుగాను, గడ్డి ఆ ఇంజనుకు శక్తిని చేకూర్చేదిగాను భావించాలి. యంత్రం గడ్డితినదు; మిక్కిలి ముఖ్యమైన ఎరువునూ ఈయదు. కాబట్టి గ్రామవాసికి ఎడ్లు ఉండవలసిందే; అతనికి గడ్డి ఉండనేఉంది. అతడు బండి కూడా ఉంచుకొంటే గ్రామంలోఉన్న వడ్రంగిని, కమ్మరినీకూడా పోషించినవాడవుతున్నాడు; అతనికి ఆవు కూడా ఉన్నట్టా, దుంపనేతికి బదులు కమ్మని నెయ్యినీ, వెన్ననూ తయారుచేసే ఫ్యాక్టరీని, ఎద్దులను తయారుచేసే యంత్రసామగ్రినీ- ఈ రెంటినీ ఉత్పత్తిచేసే ఉద్దేశంతో దానిని పోషిస్తూన్నాడన్నమాట.

మోటారు లారీమీద దండయాత్ర జయప్రదం కావచ్చు, కాకపోవచ్చు. తెలివిగల కార్యకర్తలు లాభ, నష్టములను పరిశీలించి గ్రామస్థులకు సలహా ఈయడం వివేకం. ఈశ్వర భాయి వ్రాసిన విషయాలు, ఆయన ఉద్దేశించిన పంథాలో గ్రామ కార్యకర్తల ఆలోచనను ప్రకోపింప చేయ తగినవిగా నున్నవి.

హరిజన్ 3-7-'37

## మోటారు — మోటబండి

ఆగస్టు నెల గ్రామోద్యోగ పత్రిక, గ్రామాలలో ప్రచారం నిమిత్తం— మోటారు వానులు, బస్సు— వీని యొక్క పరస్పర యోగ్యతా యోగ్యతలను గూర్చి పరిశీలిస్తూన్నది. ఆ వాదమును పూర్తిగా చదివేవారు ఆ పత్రిక

తెప్పించుకోవచ్చును. ఆ వాదంలోని ముఖ్యవిషయము నీ దిగువ ఉదహరిస్తున్నాను.

"గ్రామకార్యముల నిమిత్తం కొంత సొమ్మును ప్రత్యేకింప దలచుకొనిన జిల్లాబోర్డులుకానీ తదితర స్థానిక సంస్థలుకానీ గ్రామాలలో వివిధ రకముల ప్రచారమును సాగించేటందుకు ఆ సొమ్మును మోటారు వ్యానులకోసం వినియోగించవచ్చునా? అని మమ్ములను అడుగుతున్నారు. ఈ సంస్థలు గ్రామాలయెడ తాము నిర్వర్తించవలసిన కర్తవ్యమును గ్రహించి, పట్టణములకూ పల్లెలకును, చదువుకొన్నవారికీ చదువురానివారికీ మధ్యనున్న అంతరువును తొలగింప పూనుకోవడం శుభసూచకం. అయితే ఒక రాత్రిలోనే అనేక గ్రామాలను చూడగలిగిన మోటారువ్యాను నుప యోగించి మిక్కిలి తొందరగా వ్యవహరించడం మనం తలపెట్టిన పనికి తగిఉంటుందా, లేదా? అనేదే ప్రశ్న.

మనం ఖర్చుపెట్టేదంతా, - ముఖ్యంగా గ్రామస్థుల శ్రేయస్సు కోసం ఖర్చుపెట్టేది, మళ్లీ గ్రామవాసులకే ముట్టేటట్లు చూడడం అవసరం. జిల్లాబోర్డులు, స్థానికసంస్థలు ప్రజలనుండి డబ్బు తీసు కొంటూన్నవి. కాబట్టి వారుకొనే పరికరములు గ్రామస్థులలోనే ఆ సొమ్ము తిరుగుతూండేటట్లు సహాయపడేవిగా ఉండాలి. స్థానిక సంస్థలు రుసుముల మూలకంగాగానీ, పన్నులద్వారాగానీ వసూలు చేసినడబ్బు ఆ ప్రదేశమును దాటిపోయిన యెడల, ప్రజల పేదరి కాని కది తప్పకుండా దారితీస్తుంది. కాబట్టి తప్పనిసరిగా జిల్లా బోర్డులయొక్కయు తదితర స్థానికసంస్థలయొక్కయు ఖజానాల లోని సొమ్ము అంతకంతకు క్షీణించిపోయేమాట వాస్తవం.

స్థానికసంస్థ గ్రామకార్యముల నిమిత్తం కొన్నివేలకంటె యెక్కువ ప్రత్యేకించి ఉంచదు. ఈ పనికోసం కనీసం ఒక మోటారు

వ్యాన్ కొనడానికి నిర్ణయించినా రు 5000 కావాలి. ఆ మొత్తం ఆ ప్రదేశంనుండి బయటకు పంపడమే అవుతుంది. దానికి తోడు టైరులు, అవసరపు పనిముట్లు కొన్ని కావాలి. ఇక పెట్రోలు వగైరాలకు రోజువారీ ఖర్చుతప్పదు. ఇవన్నీ దిగుమతి చేసుకోవలసిందే. వీటికి సొమ్ము స్థానిక ప్రదేశమునుండి బయటకు ప్రవహించవలసిందే. ఈ ఖర్చుకు ప్రత్యక్షంగా కనిపించే ఉద్దేశం పల్లెటూళ్ల క్షేమం. అయితే గ్రామస్థుడూ, అతని కుటుంబమూ నెలకు రెండురూపాయిలతో జీవించవలసి యుండగా అప్పుడప్పుడు వ్యవసాయము, ఆరోగ్యము, మద్యనిషేధము, శిశుసంరక్షణము మొదలగు విషయములనుగూర్చి గ్రామఫోను, రేడియోలను వినడానికి అతడే వ్యయభారమునంతనూ భరించవలసి వస్తూన్నది. ఈ అన్నిటికంటె ఎక్కువగా గ్రామవాసికి కావలసింది లాభదాయకమైన పని. దిగుమతి అయిన వస్తువులను కొంటూండడంచేత మనం క్రమంగా అతని పనిని పోగొట్టి అందుకు బదులుగా అతనికి ఉపన్యాసాలు, మ్యాజికులాంతరు బొమ్మలు, డబ్బాసంగీతము యిస్తూన్నాము. ఇదంతా అతనిఖర్చుతోనే చేసి అతనికేమో ఉపకారం చేస్తూన్నట్లుగా మనం వీపులు తట్టుకొంటున్నాము. ఇంతకన్న అయుక్తమైన విషయమేమైనా ఉంటుందా?

దీనినిబట్టి మోటారువ్యానుకు బదులుగా మిక్కిలి చులకనగా చూడబడుతూన్న ఎడ్లబండిని ఉపయోగించినయెడల యేమిజరుగుతుందో పోల్చిచూడండి. అది అంత హంగామాచేయదు. గ్రామాల కోసం అద్భుతమైన ఉపకారం యేదో జరుగుతూన్నట్లు ప్రపంచమంతా చాటించదు. కేవలం - ఇంతనాటకం, ఈ బాకాలు ఊదడం - ప్రధానంగా భావించక నిజమైన నిర్మాణ కార్యక్రమమునే ఉద్దేశించే యెడల ఎడ్లబండి ఎక్కువ ఉపయోగకారిగా ఉంటుందని మా మనవి. మోటారులారీ వెళ్లలేని మారుమూల గ్రామాలకు

కూడా అది పోగలదు. వ్యాన్‌కు కావలసిన సొమ్ములో చాలా తక్కువ భాగమే దీనికి కావాలి. కాబట్టి జిల్లాలోని గ్రామ సముదాయములలో పనిచేయవలెనంటే కావలసినన్ని ఎడ్లబండ్లను కొనవచ్చును. వాటిపైన వెచ్చించిన సొమ్ము గ్రామంలోని వడ్రంగికి, కమ్మరికి, బండిమనిషికి ముట్టుతుంది. జిల్లా దాటి ఒక్కపైసా కూడా బయటికి పోవలసిన అవసరంలేదు. బండికూడ శాస్త్ర ప్రకారం వెడల్పైన పట్టాలతో మంచి లక్కాకులతో- ఇరుసులతో సరియైన స్థలములో ముచ్చటగా చెక్కబడిన అద్దలతో, ఆకులతో, పూటీలతో చేయబడిన యెడల దానినొక ప్రదర్శన వస్తువుగా కూడా ఉంచవచ్చును. ఇందువల్ల సామానులపైన వెచ్చించిన సొమ్ము గ్రామంబయటకు పోయేబదులు గ్రామంలోకి మరలుతుంది. చేసేపనికి తొందరయే అవసరమైన యెడల మోటారు అవసరమే. కాని గ్రామసంక్షేమం నిమిత్తం ప్రచారం చేసేటందుకు మాత్ర మది అవసరమనడానికి వీలులేదు, పైగా నెమ్మదిగాను, నియతంగాను జరిగే పద్ధతులెక్కువ ఉపయోగకరములు కాగలవు. ఒక ఊరి నుండి మఱియొక యూరికి పఱుగెత్త లేకపోవడం వలన ప్రతి చోటూ కొంతకాలము గడపవలసిరావడం ప్రయోజనకరమే అవుతుంది. అప్పుడే ప్రజల జీవితమును గూర్చి, సమస్యలను గూర్చి సరిగా అర్థంచేసుకోవడానికి వీలుకలుగుతుంది. ఆ సమస్యలను పరిష్కరించేటందుకు చేసే ప్రయత్నం ఫలప్రదమవుతుంది.

కనుక గ్రామకార్యములకు, మోటారువ్యానులకు పొత్తు కుదరనట్లు కనిపిస్తుంది. స్థిరమైన నిర్మాణ ప్రయత్నం కావాలి కాని, మెఱుపు మెఱసినట్లే మెఱసే శుష్క ప్రదర్శనంకాదు. గ్రామ సంక్షేమకార్యములలో నిజముగా శ్రద్ధగల స్థానికసంస్థలు, తదితర ప్రజాసంస్థలు, గ్రామములలో తయారైన వస్తువులతో పని ప్రారంభించి, గ్రామస్థులలో క్రమక్రమంగా వ్యాపిస్తూన్న

వేదరికమునకు కారణములను పరిశీలించి వానిని ఒక్కొక్క-దానినే తొలగించేటందుకు తమ దృష్టిని కేంద్రీకరించవలయునని కోరుతూన్నాము. గ్రామజీవితములోని ప్రతి విషయము ఏకాగ్రతతో చక్కగా ఆలోచించి చేయవలసియుండగా, గ్రామాభ్యుదయము ఒక్క రాత్రిలో ఊడిపడేటట్లు భావించి చేసే ప్రయత్నాలవలన ప్రజాద్రవ్యం దుబారా అవుతూన్నట్లు కనిపిస్తూన్నది.”

గ్రామ సంక్షేమమును గూర్చి శ్రద్ధగలవారందఱు మోటబండిని గూర్చి కళ్లకు కట్టినట్లు కనపడే వాదమును మనస్సులో మననం చేసుకోగలరని ఆశిస్తూన్నాను. గ్రామ సంక్షేమం కోస ముద్దేశింపబడిన ప్రతినిధివర్గమే గ్రామ ఆర్థిక విధానమును నిర్మూలించడం క్రూరం.

హరిజన్ 16-9-'39

## *గ్రామంలోని పశువులు*

(గ్రామస్థులతో జరిగిన సంభాషణ నుండి)

మన గ్రామాలలో ప్రతిచోటా ఎడ్లు రవాణాకు ఉపయోగపడుతూన్నవి. సిమ్లావంటి స్థలంలో కూడా ఆ విషయంలో మార్పురాలేదు. రైళ్లు, మోటారు కారులు అక్కడకు పోతూనే ఉన్నవి. కాని ఆ కొండల రోడ్డుమీద, ఎడ్లు పైకీ క్రిందికీ భారీబళ్లను లాగుతూండడం చూచాను. ఈ తరహా రవాణా పద్ధతి మన జీవితాలలోను, నాగరికతలోను ఒక భాగంగా కనిపిస్తూన్నది. మన చేతిపనుల నాగరికత జీవించవలయునంటే మన ఎద్దుకూడా జీవించి ఉండాలి.

మీరు ఎవరి పశువులు మిక్కిలి చక్కగాను, బలిష్ఠములుగాను ఉన్నవో చూచి, ఆయన వానినంత చక్కగా ఎలా పోషింపగలుగుతూన్నాడో తెలుసుకోవాలి. ఎవరి ఆవు బాగా పాలు యిస్తూన్నదో కనుగొని దానిని ఆయన అంత చక్కగా ఎలా మేపి, పోషించగలుగుతున్నాడో తెలుసుకోవాలి. గ్రామంలోనున్న అత్యుత్తమమైన ఎద్దుకు, అత్యుత్తమమయిన ఆవుకు బహుమతీ ఏర్పాటుచేయాలి. ఆదర్శప్రాయములైన పశువులు లేనిది ఆదర్శగ్రామము కాజాలదు.

హరిజన్, 15-9-'40



# 10

# గ్రామ స్వపరిపాలనము

## పంచాయతీలు

పంచాయతీకి పురాతన వాసన ఉంది; అది చక్క
మాట. గ్రామస్థులచేత ఎన్నుకోబడిన ఐదుగురి సభ
ఆ మాట కర్థము. ఇండియాలోని లెక్కలేని గ్రామ
ప్రజాపాలనాపద్ధతి కది నిరూపణము. బ్రిటిష్ ప్రభుత్వ
వారిచే పరిపక్వస్థితిని పొంది, నిష్కరుణంగా పన్ను
వసూలు చేయబడు పద్ధతి ఈ పురాతన ప్రజారాజ్యా
దాదాపుగా నిర్మూలించినది. అవి ఈ పన్నుల వసూ
భయంకరత్వమును తట్టుకోలేకపోయినవి. గ్రామంలోని
లకు సివిల్ క్రిమినల్ అధికారాలిచ్చి ఆ విధానాన్ని పునరు
రించడానికి కాంగ్రెసు వాదులిప్పుడు అనాలోచిత ప్రయ
మొకటి సాగిస్తున్నారు. 1921 లో మొట్టమొదటగా
ప్రయత్నం జరిగింది. అది అపజయం పొందినది. తి
యిప్పుడా ప్రయత్నం జరుగుతూన్నది. శాస్త్రీయ పద్ధత
ప్రకారం కాకపోయినా, సముచితమైన సక్రమ విధాన
ననుసరించి ఆ ప్రయత్నం జరుగకపోయినట్లయితే ఇప్పు
కూడా అపజయం పొందుతుంది.

సంయుక్త రాష్ట్రములలోని కొన్ని ప్రదేశములల
స్త్రీలను చెఱచడం వంటి క్రిమినల్ కేసులుకూడా పంచాయ
లని పిలువబడుతూన్న సంస్థలచేత విచారింపబడుతూన్నవ

నాకు తెలుస్తూన్నది. అజ్ఞానంతోను స్వార్థపరత్వంతోనూ కూడుకొన్న కొన్ని పంచాయతీలు ఇచ్చిన చిత్రవిచిత్రము లయిన తీర్పులను గూడా నేను విన్నాను. ఇది నిజమైతే చాలా చెడ్డపని. నియమరహితము లయిన పంచాయతీలు తాము నిర్వహించలేని భారం క్రింద తామే కూలిపోవడం నిశ్చయం. కాబట్టి గ్రామకార్యకర్తలకు మార్గదర్శకములుగా ఈ క్రింది నియమములను సూచిస్తున్నాను.

1. రాష్ట్రీ కాంగ్రెసు సంఘముయొక్క వ్రాతపూర్వక మైన ఉత్తరువు లేనిదే పంచాయతీ యేదీ స్థాపించబడరాదు.

2. పంచాయతీ ఎన్నిక కొఱకు ముందుగా చాటింపు వేయించి మొదటి పర్యాయం, బహిరంగ సభలో పంచాయతీ ఎన్నుకోబడవలెను.

3. తాలూకా కమిటీ దానిని సిఫారసు చేయవలెను.

4. ఆ పంచాయతీకి క్రిమినల్ కేసులను విచారించే అధికారం ఉండకూడదు.

5. కక్షిదారు లందఱూ అంగీకరించే యెడల సివిల్ దావాలను విచారించవచ్చును.

6. పంచాయతీ విచారణకు దావాను పంపవలసిందని ఎవ్వరినీ నిర్బంధించకూడదు.

7. జరిమానాలు విధించడానికి యే పంచాయతీకి యే విధమైన అధికారమూ ఉండకూడదు. పంచాయతీల సివిల్ డిక్రీలకు వెనుక అమలు జరుపదగిన అధికారము, వాటి

నైతికశక్తి, కేవల నిష్పక్షపాతబుద్ధి, కక్షిదారుల హృదయ పూర్వక విధేయత— ఇవే.

8. ప్రస్తుతం సంఘ బహిష్కారం కానీ, ఇతర విధమైన బహిష్కారం కానీ ఉండకూడదు.

9. ప్రతి పంచాయతీ ఈ దిగువ విషయములలో శ్రద్ధ వహించవలయును.

(ఎ) తమ గ్రామంలోని బాలబాలికల విద్య.

(బి) దాని ఆరోగ్యరక్షణము.

(సి) దాని వైద్య అవసరాలు.

(డి) గ్రామంలోని నూతులను చెరువులను పరిశుభ్రంగా ఉంచి పోషించడం.

(ఇ) అంటరాని వారుగా పరిగణింపబడేవారి రోజు వారి అవసరములూ, అభ్యున్నతి.

10. తాను ఎన్నుకోబడిన ఆరునెలలలో తగిన కారణము లేక 9 వ నియమంలో చెప్పబడిన కార్యములయెడ శ్రద్ధ చూపనియెడలను లేక గ్రామస్థుల సుహృద్భావమును మఱొక విధముగా కోల్పోయినను, లేక రాష్ట్ర కాంగ్రెసు సంఘము యొక్క అభిప్రాయములో తగినంత మఱే ఇతర కారణములవలన నైనను తనకు తానే అర్హతను పోగొట్టుకొన్నను— ఆ పంచాయతీ రద్దుచేయబడి మఱొకటి దాని స్థానంలో ఎన్నుకొనబడవలెను.

జరిమానాలను కాని, సంఘ బహిష్కారమును గాని విధించే అధికారాన్ని లేకుండా చేయడం ప్రారంభదశలో

అవసరం. గ్రామాలలో అజ్ఞానులు అవినీతిపరులు అయిన వారి చేతులలో నుంచబడిన సంఘ బహిష్కారమనే ఆయుధం చాలా ప్రమాదకరమైనది. జరిమానాలు వేయడంకూడా హానికరంగా పరిణమించి మన ఆదర్శానికి భంగం తీసికొని రావచ్చును. పంచాయతీ నిజంగా ప్రజారంజకంగా ఉండి 9 వ నియమంలో సూచింపబడిన నిర్మాణకార్యములను నిర్వహిస్తూ తన ప్రజారంజకత్వాన్ని పెంపొందించు కొన్నప్పుడు దాని తీర్పులూ, అధికారమూ దాని నైతిక ప్రతిష్ఠవలననే గౌరవింపబడగలవు. నిశ్చయంగా అదే పంచాయతీకుండ వలసిన బలం. ఆ బలాన్ని ఎవ్వరూ తొలగించజాలరు.

యంగిండియా 28-5-'31

### *ఆంథ్‌లో గ్రామ పంచాయతీ*

చిన్ని ఆంథ్ సంస్థానమును ఎవరెఱుగరు? పరిమాణంలోనూ ఆదాలోనూ కూడా చిన్నది. కాని అడుగకుండానే, ఆ ప్రజకు ఆ రాజు సంపూర్ణస్వయం పరిపాలనమును ప్రసాదించినందున, అది చాలా గొప్పదిగా ప్రసిద్ధిపొందింది. దాని ముఖ్యమంత్రి అప్పాసాహెబ్ పంత్ ఆ ప్రయోగమును వివరిస్తూ తొమ్మిది పుటల ఆకర్షణీయమైన కరపత్ర మొకటి ప్రకటించారు. దానినుండి ఈ క్రిందిభాగం ఉదాహరిస్తున్నాను.

> "గ్రామ ప్రజాపరిపాలనము, నూతన రాజ్యాంగ చట్టమునకు పునాది. ప్రతి గ్రామంలోని వయోజనులందఱూ కలసి వోటు ద్వారా ఐదుగురుతో ఒక పంచాయతీని ఎన్నుకుంటారు. అందులో

ఒకరిని ఏకగ్రీవంగా తమ అధ్యక్షునిగా ఎన్నుకొంటుంది. పంచాయతీ ఈ ఏకగ్రీవమైన ఎన్నిక సాధ్యము కానియెడల వయోజను లందరూ కలసి పంచాయతీలో ఒకనిని అధ్యక్షుడుగా ఎన్నుకొంటారు.

కొన్ని గ్రామాల పంచాయతీ అధ్యక్షు లందరూ కలసి తాలూకా పంచాయతీ అవుతుంది. తనకు వచ్చిన ఆదాయమును ఎలా ఖర్చుపెట్టాలో తాలూకా పంచాయతీ తన సమావేశాలలో నిర్ణయం చేస్తుంది. ఆ తాలూకాలో వసూలుచేయబడిన బాదాపు సగం పన్నులు దాని రాబడిక్రిందకు వస్తాయి. గ్రామాలు తమ ఆదాయ, వ్యయపట్టీలను తయారుచేసి, తమ అధ్యక్షులద్వారా తాలూకా పంచాయతీలకు సమర్పిస్తాయి. ఇవి చర్చింపబడిన పిమ్మట తాలూకా అంతటికీ ఒక ఆదాయ, వ్యయపట్టిక తయారు చేయబడుతుంది. తమ రాబడిని తమకు తోచిన విధంగా గ్రామాలు ఖర్చుపెట్టవచ్చును. ఇంతవరకు విద్య, ప్రభుత్వ కట్టడములు (Public works) వ్యయమునకు సంబంధించిన ముఖ్యవిషయము లుగా నున్నవి.

అస్సెంబ్లీ సభ్యులు కేవలం కేంద్రప్రభుత్వ వ్యవహారములతోనే గాక గ్రామాలలోని దైనందిన కార్యములతోకూడ సన్నిహిత సంబంధములను కలిగియుంటారు. తాలూకా పంచాయతీ సమావేశములలో తాలూకాలోని ఇతర గ్రామాల పనిని కూడా వారు తెలుసుకొంటూంటారు. ఈ విధంగా శాసనసభా సభ్యుడు రోజుకు 12 గంటలు పనిలో నిమగ్నుడై ఉంటాడు. ఆయన కేవలం ఎన్నికకు నిలుచుండడం, కొన్ని సమస్యలపైన ఎన్నిక కావడం, తరువాత మళ్లీ ఎన్నికలు వచ్చేవరకు ఈ విషయాలను ఏమీ పట్టించుకోకపోవడంకాదు. ఆయన ప్రతి దినమూ గ్రామస్థుల ఎదుట పడుతూండవలసిందే. గ్రామస్థు లాయనను తిరిగి రమ్మనడానికి

కూడా రాజ్యాంగ చట్ట మధికారమిస్తూన్నది. 4/5 వంతుల మంది వోటర్లు పంచాయతీకి తిరిగి ఎన్నికను పెట్టవలసిందని కోరవచ్చును.

పంచాయతులు న్యాయవిచారణ చేస్తవి. గ్రామస్థుడు సొమ్ము ఖర్చుపెట్టుకొని గ్రామం విడచి తాలూకా పట్టణానికి పోయి విచారణ కొఱకు రోజుల కొలది వేచియుండనక్కరలేదు. పంచాయతీ ఆయన కేసు అక్కడనే విచారణ చేస్తుంది. రైతు గ్రామం లోని సాక్షులను తీసికొనిరావచ్చును. కొన్ని కష్టమైన దావాలలో న్యాయశాస్త్రపు సూక్ష్మాంశములు పరిశీలించవలసిన సందర్భాలలో ఒక సబ్ జడ్జి వచ్చి న్యాయవిచారణలో పంచాయతీకి తోడ్పడతాడు. సబ్ జడ్జి పంచాయతీలకు శాస్త్ర సంబంధము లయిన సలహాల నీయడమే గాక, న్యాయశాస్త్రప్రకారము తమకుగల హక్కులను ఎంతమాత్రమూ తెలుసుకొనలేక, స్వప్రయోజనపరులైన గూండాలవల్ల తప్పుత్రోవల పడిపోతూన్న రైతులకు కూడా మార్గదర్శకుడుగా ఉంటాడాయన."

కాబట్టి ఆంధ్ సంస్థానంలో న్యాయం చౌకగాను త్వరగాను, ప్రయోజనకరంగానూ లభిస్తుంది. రెండు తాలూకాలలోని పంచాయతులలోనే 197 సివిల్ క్రిమినల్ కేసులు పరిష్కారము చేయబడినవి. నూటికి 75 సివిల్ కేసులలోను నూటికి 50 క్రిమినల్ కేసులలోను కక్షిదారులు ప్లీడర్లను పెట్టుకోలేదు. సాక్షులుకూడా స్థానికంగా ఉన్నవారే కనుక వారికి కూడా యేమీ ఖర్చు లీయనక్కరలేకపోయింది. కాబట్టి కాలమూ, ధనమూకూడా చాలా వరకు కలిసి వచ్చింది. చాలా ఎక్కువ కేసులు ఒక్క సమావేశంతోనే పరిష్కరింపబడినవి. కేసుల విచారణ సమయంలో గ్రామస్థ

లందఱూ అక్కడే ఉంటారు. కాబట్టి అబద్ధమనేది ఉండనే ఉండదు. తేలికగా తెలిసిపోతుందనే భయమే అందుకు కారణం. కనుక చాలా కేసులు కోర్టుకు వెలుపలనే రాజీ అవుతూండేవి. న్యాయాన్ని విచారించడంలో ఈ పద్ధతి గొప్ప వయోజనవిద్య.

72 గ్రామాలకు సంబంధించి 88 గ్రామ పాఠశాలలున్నవి. వయోజన వోటింగు పద్ధతి ప్రవేశపెట్టబడిన పిమ్మట వయోజనులలో నూటికి 35 మంది చదువుకొన్నారు. ప్రధాన విద్య (Basic Education) గాని, శరీరవ్యాయామవిద్య గానీ నిర్లక్ష్యము చేయబడలేదు.

ఈ ప్రయోగము యొక్క మంచిని చూపినప్పటికీ అప్పాసాహెబు ఇందులోని కష్టాలనూ, చిక్కులనూ గమనించకుండా పోలేదు. వాటిని నేను ఉదాహరించడంలేదు. అటువంటి ప్రయోగాలన్నిటిలోనూ ఆ చిక్కులు సాధారణంగా ఉండేవే. ప్రజానాయకులకు తమ ప్రయోగాలలో విశ్వాసం ఉంటే వాటిని తేలికగా దాటిపోగలరు.

హరిజన్, 11-8-'40.

## స్వాతంత్ర్యము

స్వాతంత్ర్యం అంటే భారత ప్రజల స్వాతంత్ర్యమని అర్థం. అంతే కాని వారిని ఈనాడు పరిపాలిస్తూన్న వారి స్వాతంత్ర్యమని అర్థంకాదు. తమ పాదములక్రింద నున్న వారి ఇష్టంమీద పాలకులు ఆధారపడి ఉండాలి. అనగా

వారు ప్రజల ఇష్టానుసారం వర్తించే సేవకులు కావాలన్న మాట.

స్వాతంత్ర్యం అట్టడుగునుంచి ప్రారంభం కావాలి. ఆ ప్రకారం ప్రతి గ్రామము, ఒక పంచాయతీగాగాని, ప్రజా రాజ్యంగాగాని సంపూర్ణాధికారాలతో ఉంటుంది. కనుక ప్రతి గ్రామము స్వయం పోషకంగా ఉండి, ప్రపంచమంతా ఎత్తి వచ్చినప్పటికీ తనను తాను రక్షించుకొనేటంత వఱకూ గూడా తన వ్యవహారములను తాను చక్కపెట్టుకోగలిగిన స్థితిలో ఉండాలి. బయటనుండి వచ్చే యెటువంటి దండయాత్రనైనా ఎదుర్కొని తనను తాను రక్షించుకొనే ప్రయత్నంలో ధ్వంసం కావడానికి కూడా తయారయ్యేటందుకు తగినట్లుగా శిక్షణ పొందాలి. అయితే, తుదకు ఈ విషయంలో వ్యక్తియే కొలబద్దకావాలి. దీనినిబట్టి ప్రక్కవారి పైన ఆధారపడి వారి హృదయపూర్వక సహాయంకానీ లేక ఇతర ప్రపంచం యొక్క సహాయంకానీ పొందకూడదని కాదు. కాని ఆ సహాయం స్వేచ్ఛగాను, స్వచ్ఛందంగాను, పరస్పరం లభించేదిగా ఉండాలి. అటువంటి సమాజంలో తప్పకుండా ఉన్నత సంస్కారం కలిగిన స్త్రీ పురుషులుంటారు. వారందఱూ తమకు కావలసిన దేదో ఎఱిగియుండి సమాన శ్రమచేసేవారిలో ఒకరికన్న ఒకరు ఎవ్వరూ ఎక్కువ కోరకూడదని కూడా తెలుసుకొన్నవారుగా ఉంటారు.

ఇటువంటి సమాజం సహజంగా సత్యాహింసలపైన ఆధారపడి ఉండాలి. నా ఉద్దేశంలో స్వయంవర్తియై, సర్వ

జ్ఞత్వముగల మహత్తమశక్తి, ప్రపంచంలోని తదితర శక్తుల నన్నిటిని ఇముడ్చుకోగలశక్తి, ఇంక దేనిమీదా ఆధారపడని శక్తి, తక్కిన శక్తులన్నీ వినాశనం పొందినప్పుడు లేక చేతనా రహితములైనప్పుడు కూడా చైతన్యవంతంగా ఉండేశక్తి దైవం. అటువంటి దైవంలో బలిష్ఠమైన విశ్వాసం లేని దే సత్యాహింసలు సాధ్యంకావని నా అభిప్రాయం.

విశ్వాన్ని ఆవరించియున్న ఈ మహత్తమ తేజస్సులో విశ్వాసం లేనియెడల నా జీవితమునకు కారణమును నేను చెప్పజాలను.

లెక్కలేని గ్రామాలతో నిండియున్న ఈ నిర్మాణంలో అంతకంతకు విస్తృతములవుతూన్న చక్రాలు ఉండవచ్చును. కాని అతిక్రమించే చక్రాలు మాత్రం ఉండవు. దానిలోని జీవితం అడుగునఉన్న పునాది మీద భారమంతా పెట్టి నిలచే సూక్ష్మాగ్రస్థూపం వంటిదికాదు. అది సముద్ర తరంగమువలె వలయాకారము గలిగి ఉంటుంది. దానికి కేంద్రం వ్యక్తి. గ్రామంకోసం తాను ధ్వంసంకావడానికి కూడా అతడు సిద్ధంగా ఉంటాడు. గ్రామం తనచుట్టూ ఉన్న తదితర గ్రామాలకోసం నాశనం కావడానికి తయారుగా ఉంటుంది. అందువలన ఆ నిర్మాణం యావత్తు తుదకు వ్యక్తులతో కూడిన ఏకజీవిత వ్యవస్థగాకూడా పరిణామం పొందుతుంది. ఆ వ్యక్తులు అహంకారంతో ఎన్నడూ అత్యాచారమునకు దిగక సవినయంగా ఆ నిర్మాణ చక్రంతో

అవినాభావ సంబంధం గలిగి దాని ఉత్కృష్టాశయములలో పాల్గొంటూంటారు.

కాబట్టి అన్నిటికీ వెలుపలనున్న పెద్దపరిధి, లోపల నున్న చిన్న పరిధులను నొక్కివేయడానికి తనశక్తిని వినియోగించదు. కాని లోపలనున్న అన్ని పరిధులకూ బలమునిస్తూ అన్నిటినుండీ తాను తిరిగి బలపడుతూ ఉంటుంది. ఇదంతా భావకల్పిత రాజ్యమనీ, ఒక్క క్షణంకూడా దీనిని గూర్చి విచారించవలసిన పనిలేదనీ నన్ను హేళన చేయవచ్చును. యూక్లిడ్ సిద్ధాంతం ప్రకారం బిందువును (Point) మానవ మాత్రుడు చిత్రింపజాలక పోయినప్పటికీ దానికి శాశ్వతమైన విలువ ఉన్నట్లే నా చిత్రమునకు కూడా మానవ సమాజం జీవించడానికి తగిన విలువ ఉంది. ఈ నా సంకల్పము పూర్తిగా ఎన్నటికీ సిద్ధించక పోయినా అందుకోసమై భారత దేశం సజీవంగా ఉండుగాక! మనకు కావలసినదేదో మనకు సమగ్రంగా తెలిసి ఉంటేనే మనం దానిని సమీపించగలము. ఎప్పటికైనా భారతదేశంలోని ప్రతి గ్రామంలోను చివరివాడు మొదటివానితో సమానంగా ఉండేదిగానీ, లేక మొదటివాడు, చివరివాడు అనే వ్యత్యాసంలేనిదిగాగానీ ఒక ప్రజారాజ్యం స్థాపించబడినట్లయితే నా సంకల్పం వాస్తవికతను పొందినట్లు నేను భావిస్తాను.

ఈ నా సంకల్పంలో ప్రతి మతమునకు సమానమైన సంపూర్ణస్థాన మున్నది. మన మందఱము, భూమిలోనికి లోతుగా వేళ్లు పాతుకొనిపోయి పెకలించడానికి వీలులేని

ఒకానొక మహావృక్షముయొక్క ఆకులుగా ఉంటాము. ఎంత పెద్ద సుడిగాలీ కూడా దానిని కదిలించలేదు.

ఇందులో మానవకృషిని తొలగించి యే కొలదిమంది చేతులలోనూ అధికారమును కేంద్రీకరింపచేసే యంత్రాలకు స్థానములేదు. సంస్కారముగల మానవకుటుంబములో శరీర శ్రమకు ప్రముఖస్థాన మున్నది. ప్రతి వ్యక్తికీ సహాయంచేసే ప్రతి యంత్రానికీ స్థానమున్నది. కాని ఆ యంత్రం ఎటువంటిదిగా ఉండాలో నేనెప్పుడూ కూర్చొని ఆలోచించలేదని మాత్రం ఒప్పుకొని తీరాలి. నేను సింగర్ కుట్టుయంత్రమును గూర్చి ఆలోచించాను. కాని అది కూడా పైపైన ఆలోచించడమే జరిగింది. నా చిత్రమును పూర్తిచేయడాని కది అవసరం కాదు.

హరిజన్ 28-7-'46.

### పంచాయతులు

శనివారం సాయంకాలపు ప్రార్థన సమావేశము, పంచాయతీ గృహము కట్టబడిన శామల్కా గ్రామంలో యేర్పాటు చేయబడింది. పంచాయతీ గృహమును కట్టుకొన్నందుకు గ్రామస్థులను గాంధీజీ అభినందించారు. పంచాయతీ కార్యములను నిర్వహించని యెడల ఆ పనివల్ల కాలము, సొమ్మూకూడా వృథాయయినట్లే. భారతదేశమునకు పూర్వకాలంలో చైనా మొదలయిన విదేశములనుండి ప్రఖ్యాతులయిన యాత్రికులు వచ్చారు. వారు విజ్ఞాన సంపాదనకోసం ప్రయాణంలో మిక్కిలి కష్టములకోర్చి వచ్చారు. వారు

భారతదేశంలో దొంగతనం లేదనీ, ప్రజలు నిజాయితీకలవారనీ, కష్టపడి పనిచేసేవారనీ నివేదించారు. ఆ నాడు వారి తలుపులకు తాళాలు అవసరముండేవికావు. నేటివలె ఆ నాడు ఇన్ని రకాల కులాలు కూడా ఉండేవికావు. నిజాయితీని పరిశ్రమనూ పునరుద్ధరించడం పంచాయతీల కర్తవ్యం. ఒక్క సంవత్సరం తరువాత వారిని ఆయన (గాంధీజీ) అడిగే యెడల వారి నిష్కళంక జీవితమును ప్రదర్శించి వారికి పంచాయతీ తప్ప వేరే న్యాయస్థానం లేదని చూపగలరా? తాము పరిష్కరింపవలసి వచ్చినప్పుడు గ్రామస్థులు తగాదాలకు వెలిగా నుండవలయునని బోధించడం పంచాయతీల పని. అందువల్ల యేమీ వ్యయంలేకుండా తొందరగా న్యాయం కలుగుతుంది. వారికి పోలీసుకాని సైనికబలంకాని అక్కరలేదు.

పంచాయతీ పశుసమృద్ధికి కూడా పనిచేయాలి. వారు క్రమక్రమంగా పాలుఎక్కువగా ఉత్పత్తిఅయ్యేటట్లు చూడాలి. శ్రద్ధ లేకపోయినందున మన పశువులు భూభారంగా పరిణామిస్తున్నవి. గోహత్యకు ముస్లిములను నిందించడం కేవలం అజ్ఞానం. అంగుళం, అంగుళం హింసించి హిందువులు పశువులను చంపుతున్నారని గాంధీజీ అభిప్రాయం. ఒక్కసారిగా చంపడంకంటె హింసించి, హింసించి నెమ్మదిగా చంపడం మరీ దుర్మార్గం. గ్రామంలో ఆహారోత్పత్తి ఎక్కువ అయ్యేటట్లు కూడా పంచాయతీ జాగ్రత వహించాలి. అది భూమికి సరియైన ఎరువు వేయడం వలననే సాధ్యపడుతుంది.

జంతువులయొక్క గానీ మానవులయొక్క గానీ మలమూత్రములు పెంటపోగులతో మిశ్రమముచేసి విలువగల ఎఱువుగా తయారుచేయవచ్చును. ఈ ఎఱువు భూమిని ఎక్కువ ఫలవంతంగా చేయగలదు. పిమ్మట గ్రామముయొక్కయు, గ్రామవాసుల యొక్కయు పరిశుభ్రతకు కృషి చేయవలెను. గ్రామస్థులు శారీరకంగా, మానసికంగా, పరిశుభ్రంగానూ ఆరోగ్యంగానూ ఉండేటట్లు చూడవలెను.

గ్రామంలో సినీమా గృహము ఉండకూడదని గాంధీజీ ఆశిస్తూన్నారు. సినీమా విద్యాప్రబోధమునకు ప్రబలమైన సాధనమని కొందఱంటారు. కొంత కాలాని కది నిజం కావచ్చును. కాని ప్రస్తుతం సినీమా ఎంత అపకారం చేస్తూన్నదో ఆయన గమనిస్తూనే ఉన్నారు. గ్రామాలలో ఆడుకొనే ఆటలు ఉండనే ఉన్నవి. గ్రామస్థులు త్రాగుడు, ఇతర మత్తుపదార్థ సేవనములను మానివేయాలి. వారి గ్రామంలో ఇంకా యేమైనా అస్పృశ్యతా చిహ్నములు కనపడుతూన్నట్లయితే వాటిని రూపుమాపాలి. హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు, పార్శీలు, క్రైస్తవులు అందఱు సోదరీ సోదరులుగా ప్రవర్తించాలి. ఈ చెప్పినదంతా వారు సాధించగలిగినట్లయితే వారు నిజమైన స్వాతంత్ర్యమును నిరూపించిన వారవుతారు. భారత దేశము నలుమూలల నుండీ వచ్చిన ప్రజలా ఆదర్శగ్రామమును దర్శించి దాని నుండి జ్ఞానోదయమును పొందగలరు.

హరిజన్, 4-1-'48.

### పంచాయితీ రాజ్యం
(ఒక ఉపన్యాస నివేదికనుండి)

భారతదేశముయొక్క నిజమైన ప్రజారాజ్యమునకు కొలబద్ద (Unit) గ్రామం. ఆంగ్లములో 'రిపబ్లికు' అని పిలువబడుతూన్న పంచాయతీ రాజ్యమును ఒక గ్రామము కోరుతూన్నప్పటికీ ఎవ్వరూ దానిని ఆపలేరు. కేంద్రంలో కూర్చుండిన ఇరవై మందితో ప్రజారాజ్యం నడవదు. ప్రతి గ్రామములోని జనంతోను క్రిందనుండి ఆ రాజ్యం సాగాలి.

హరిజన్, 18-1-'48

# 11

# గ్రామ సంరక్షణ

### శాంతిసైన్యము

కొట్లాటల విషయంలో— ముఖ్యంగా మత విషయిక మైన— ప్రాణాలకు తెగించి సర్దుబాటు చేయగల మనుష్యులతో శాంతిదళమును నిర్మించుటను గూర్చి కొంతకాలం క్రిందట నేనొక సూచన చేశాను. పోలీసు, సైనికదళములకు బదులుగా ఈ శాంతిసైన్యము ఉండవలయునని నా అభిప్రాయం. ఇది చాలా పెద్దకోరికగా కనిపిస్తుంది. దీనిని ఆచరణలో పెట్టడం సాధ్యం కాకపోవచ్చుకూడా. అయినప్పటికీ కాంగ్రెసు అహింసా సంగ్రామంలో విజయవంతమయ్యే యెడల అటువంటి సంఘటనలో శాంతంగా వ్యవహరించగల శక్తిని అది సంపాదించుకు తీరాలి.

కాబట్టి మనముద్దేశించిన శాంతిదళసభ్యుడుగా ఉండే టందుకు ఏమి అర్హతలు కావలెనో ఆలోచిద్దాం.

(1) అతడుగానీ, ఆమెగానీ అహింసలో అచంచల విశ్వాసం కలిగియుండవలెను. దేవునిలో దృఢవిశ్వాసం లేనిదే ఇది సాధ్యంకాదు. అహింసాతత్పరుడైన మనిషి దైవముయొక్క దయవల్ల, బలంవల్లా తప్ప ఏ పనిని నిర్వహింపజాలడు. అవిలేని యెడల అతడు అక్రోధంగాను, నిర్భయంగాను, ప్రతీకార కాంక్షా రహితంగాను మరణించ గల ధైర్యం కలిగి ఉండడు. దేవుడు అందరి హృదయాల లోను ఉన్నాడనీ దేవుని సమక్షంలో భయపడవలసిన అవసరం లేదనీ గట్టినమ్మకం ఉంటేనేగాని అటువంటి ధైర్యానికి తావులేదు. దేవుడు విశ్వవ్యాపి అనే జ్ఞానంవలన ప్రతి పక్షు లని గాని, గూండాలని కాని పిలువబడేవారి జీవిత ముల యందు కూడా గౌరవమేర్పడుతుంది. మానవునిలో నున్న పశుధర్మం ప్రకోపించి ఆయన మీాద యాజమాన్యం వహిస్తూనప్పుడు ఆయన క్రోధాన్ని శాంతింప చేసేటందుకు మనం జోక్యం కల్పించుకో తలచుకోవడమొక విధానము.

(2) ఈ శాంతి దూత ప్రపంచంలోని ముఖ్య మతముల అన్నిటియందు సమాన గౌరవం కలిగి ఉండాలి. కాబట్టి ఆయన హిందూ అయితే ఇండియాలో ప్రచారములోనున్న అన్ని మతములను గౌరవించాలి. దేశంలో అవలంబింప బడుతూన్న వివిధమతముల సాధారణ సిద్ధాంతాలను ఆయన తెలిసికొని ఉండాలి.

(3) సాధారణంగా ఈ శాంతి కార్యమును, తమ తమ ప్రదేశాలలోని ఆయా స్థానికజనులు మాత్రమే నిర్వహించ గలరు.

(4) ఈ పని ఒంటరిగాగాని, సమూహంగాగాని నిర్వహించవచ్చును. కనుక సహచరులకోసం ఎవ్వరూ వేచి యుండనక్కరలేదు. అయినప్పటికీ సహజంగా ప్రతివ్యక్తి తన ప్రదేశంలో సహచరులను సంపాదించుకొని స్థానిక దళాన్ని యేర్పాటు చేసుకొంటాడు.

(5) ఈ శాంతిదూత తన ప్రదేశంలోకానీ, లేక తాను నిర్ణయించుకొన్న వర్గములోగాని వ్యక్తిగతమైన సేవ మూలకంగా ప్రజలతో సన్నిహితమైన సంబంధం కలిగించు కొంటాడు. అందువలన ఆయన క్లిష్ట పరిస్థితులలో వ్యవహరించవలసి వచ్చినప్పుడు, కొట్లాడుకొంటూన్న గుంపులోకి పిలవని పేరంటంగా వచ్చిన క్రొత్త మనిషివలె అనుమానంతో చూడబడడు.

(6) శాంతిస్థాపకుడు వంకబెట్టవీలులేని సత్ప్రవర్తకుడు గానూ, నిష్పక్షపాతబుద్ధికి పేరు పొందినవాడుగానూ ఉండ వలయుననే విషయం వేఱుగా చెప్పనక్కరలేదు.

(7) సాధారణంగా రానున్న తుపానులకు ముందు సూచనలు కనిపిస్తూనే ఉంటవి. ఆ విషయాలు తెలిసినప్పుడు శాంతిదళము, కల్లోలం ప్రారంభమయ్యేవఱకూ ఆగక ముందు గానే పరిస్థితికి తగినట్లు వ్యవహరించాలి.

(8) ఉద్యమం వ్యాప్తి చెందినప్పుడు పూర్తిగా తమ కాలాన్ని వినియోగించే కార్యకర్తలు ఉంటే మంచిదే. కాని అటువంటి వారు ఉండి తీరవలసిన అవసరంలేదు. సాధ్యమైనంత మంది యోగ్యులయిన స్త్రీ, పురుషులు కావలయునని మాత్రమే నా అభిప్రాయం. వివిధ వృత్తులను అవలంబిస్తూ తమ పరిసరములలో నివసిస్తూన్న ప్రజలతో మైత్రి చేసుకోవడానికి తగిన విరామం కలిగిన వారిలోనుండీ, శాంతిదళములో చేరేటందుకు తగిన తదితర యోగ్యతలు కలవారిలోనుండీ స్వచ్ఛంద సైనికులను తీసికోవడమే ఇందుకు మనం చేయవలసిన పని.

(9) మన ముద్దేశించిన దళములలోని సభ్యులు ప్రత్యేకమైన దుస్తులు ధరించాలి. అందువలన కాలక్రమేణా యెంత మాత్రమూ కష్టంలేకుండా వారిని ఆనవాలు పట్టవచ్చును.

ఇవన్నీ కేవలం సామాన్య సూచనలు. వీనిని ఆధారంగా పెట్టుకొని ప్రతి కేంద్రము తన నియమావళిని తాను తయారుచేసుకోవచ్చును.

హారిజన్, 18-6-'38.

*పోలీసు దళమును గూర్చి నా అభిప్రాయం*

అహింసా రాజ్యంలో కూడా పోలీసు దళం అవసరం కావచ్చును. ఇది నా అహింసయొక్క అపరిపక్వ స్థితికి చిహ్నమని నేనంగీకరిస్తాను. సైనిక దళం లేకుండా మనం గడుపుకోగలమని నేను చెప్పగలిగినంత ధైర్యం, పోలీసుదళం

విషయంలో నాకు లేదు. అయితే పోలీసు దళం అవసరం లేని రాజ్యాన్ని నేను భావించగలను. కాని దానిని సాధించ గలమా? అనే విషయం భవిష్యత్తు మాత్రమే నిరూపించ వలసియున్నది.

నా మనస్సులో నున్న పోలీసుదళము ఇప్పుడున్న పోలీసుదళము యొక్క స్వరూపానికి కేవలం భిన్నంగా ఉంటుంది. ఆ దళము అహింసలో నమ్మకం కలిగిన వారితో నిర్మింపబడుతుంది. వారు ప్రజలకు సేవకులుగా ఉంటారు, యజమానులుగా ఉండరు. ప్రజలు వారికి స్వతసిద్ధంగా ప్రతి సహాయం చేస్తూంటారు. వారిరువురి పరస్పర సహకారంతో అంతకంతకు తగ్గిపోతూన్న కల్లోల పరిస్థితులు తేలికగా సమసి పోగలవు. ఆ పోలీసు దళమునకొక రకమైన ఆయుధములు ఉంటవి. కాని వారు వాటిని ఉపయోగించవలసివస్తే బహు సకృతుగా ఉపయోగిస్తారు. నిజానికి ఆ పోలీసువారు సంస్కర్తలుగా ఉంటారు. వారి పోలీసుపని బందిపోటు దొంగలకు, దారి దోపిడిగాండ్రకు సంబంధించి మాత్రమే ఉంటుంది. అహింసా రాజ్యంలో పెట్టుబడిదారులకు, కార్మికులకు తగాదాలు చాలా తక్కువగా ఉంటవి. అవి కూడా ఎప్పుడో కాని రావు. సంఘంలో అత్యధిక సంఖ్యాకులైన అహింసా వాదుల ప్రభావము సమాజంలోని ప్రధాన శక్తుల గౌరవము నకు పాత్రమయ్యేటంత ఎక్కువగా ఉండడమే అందుకు కారణం. అదే విధంగా మత కల్లోలములకు కూడా అక్కడ తావు లేదు.

### అహింసాయుత స్వచ్ఛంద సైనికదళములు

కొంతకాలం క్రిందట నా ప్రోత్సాహంతో శాంతి దళముల నిర్మాణమును గూర్చి ప్రయత్నం జరిగింది. కాని యేమీ ఫలితం కలుగలేదు. కాని దానివలన, అటువంటి సంస్థల అసలు స్వభావమునుబట్టి, వాటి సభ్యత్వం పెద్దదిగా ఉండకూడదనే అనుభవం మాత్రం కలిగింది. సాధారణంగా, బలప్రయోగంపయిన ఆధారపడిన పెద్దపెద్ద స్వచ్ఛంద సైనిక దళములు సమర్థవంతంగా పనిచేయవలెనంటే, వారిలో క్రమ శిక్షణకు భంగం కలిగినప్పుడు కూడా బలప్రయోగము యొక్క అవసరం ఉంటుందని తెలుసుకోవాలి. అటువంటి సంస్థలలో వ్యక్తిగత శీలమును గూర్చి యేమీ పట్టుదల ఉండదు. శరీరసౌష్ఠవమే ముఖ్యంగా కావలసింది. అహింసా సంస్థలలో ఇందుకు వ్యతిరేకంగా జరుగవలసి ఉంటుంది. కేవలం వ్యక్తి యొక్క శీలము లేక ఆత్మబలమే వాటిలో కావలసింది. శరీర సౌష్ఠవం దాని తరువాతది. దానికి తగిన మనుష్యులను ఎక్కువమందిని సంపాదించడం కష్టం. కనుకనే అహింసా దళం సమర్థవంతంగా పనిచేయవలెనంటే అది చిన్నదిగా ఉండాలి. అటువంటి దళాలను దేశమంతా వ్యాపింప చేయ వచ్చును. ఒక గ్రామానికి గాని, పట్టణంలో ఒక పేటకుగానీ ఒక్కొక్క దళం ఉండవచ్చును. దానిలోని సభ్యులందరూ ఒకరి నొకరు ఎఱిగి ఉండాలి. ప్రతి దళము తన అధిపతిని తానే ఎన్నుకొంటుంది. అందఱు సభ్యులు సమాన ప్రతి పత్తి కలవారుగానే ఉంటారు. కాని ప్రతి వాడూ ఒకే పని

నిర్వహిస్తూన్నప్పుడు ఎవరో ఒకరి క్రమశిక్షణ క్రింద తక్కిన వారు పనిచేయవలసి ఉంటుంది. లేనట్లయితే పని పాడవుతుంది. రెండుకానీ అంతకంటె ఎక్కువ దళాలు కానీ పని చేయవలసినచోట్ల, దళాధిపతులందరూ సంప్రదించుకొని ఒకే పద్ధతిమీద పనిచేయ పూనుకోవాలి. అప్పుడే విజయం కలుగుతుంది.

పై పద్ధతుల ప్రకారం అహింసాయుత స్వచ్ఛంద సైనిక దళములు స్థాపింపబడిన యెడల వారు తేలికగా కల్లోలములను శాంతింపచేయగలరు. ఈ దళాలకు వ్యాయామ సంస్థలలో ఈయబడుతూన్న శరీర వ్యాయామ శిక్షణ అంతా పూర్తిగా ఈయనక్కరలేదు. కాని అందులో కొంతభాగం మాత్రం అవసరం.

అయితే ఆ సంఘంలోని అందరు సభ్యులకు ఒక్క విషయం మాత్రం సాధారణంగా వర్తిస్తుంది. వారందరు దేవునిలో అచంచల విశ్వాసం కలిగి ఉండాలి. ఆయనే వారి సహచరుడు, కార్యకర్త. ఆయనలో విశ్వాసంలేని శాంతి దళములు నిర్జీవములు. దేవుణ్ని ఎవరు ఏ పేరుతో పిలచినప్పటికీ, ఆయన బలం వలననే మనం పని చేయగలుగుతున్నామని గ్రహించాలి. అలా భావించేవాడు ఇతరుని ప్రాణాలు తీయడు. అవసరమైతే తాను చంపబడడానికి ఒప్పుకొని మృత్యుంజయుడుగా రాణిస్తాడు.

ఎవడు ఈ ధర్మసూత్రాన్ని గ్రహించి ఆచరణలో పెట్టగలడో ఆతని మనస్సు సంకట సమయాలలో చీకాకు పడదు. నడుచుకోవలసిన సరియైన పంథాయేమిటో అతనికి సహజంగా తెలిసిపోతుంది.

నేను పైన చెప్పిన విషయమే గాక నా అనుభవమును బట్టి సంపాదించిన ఇంకా కొన్ని నియమములను కూడా ఈ దిగువను పొందు పఱుస్తున్నాను.

1 స్వచ్ఛంద సైనికుడు ఆయుధములను ధరించక పోవచ్చును.

2 దళములోని సభ్యులు తేలికగా గుర్తించ తగినట్లు ఉండాలి.

3 ప్రతి స్వచ్ఛంద సైనికుడు కట్లుకట్టే పరికరాలు, కత్తెర, సూది, దారం, శస్త్రచికిత్స కుపయోగించే చాకు మొదలగునవి ప్రథమ చికిత్స కొఱకు దగ్గర ఉంచుకోవాలి.

4 గాయపడినవారిని, ఆ స్థలమునుండి తప్పించి మోసుకొని పోవడం ఎలాగో అతనికి తెలిసి ఉండాలి.

5 మంటలు చల్లార్చడం తెలిసి ఉండాలి. తన ఒడలు కాలకుండా మంటలోకి పోయే ఉపాయం అతనికి తెలిసి ఉండాలి. బరువుతోగాని బరువు లేకుండా గాని ఇతరులను రక్షించే నిమిత్తం ఎత్తయిన ప్రదేశాలను సురక్షితంగా ఎక్కి దిగే నేర్పుండాలి అతనికి.

6 తన ప్రదేశంలో స్థానికంగా నివసించే వారందఱినీ అతను బాగా ఎఱిగి ఉండాలి. అదే ఒక సేవ.

7 ఎడతెగకుండా ఎప్పుడూ తన మనస్సులో రామనామం జపిస్తూ ఉండాలి. అందులో నమ్మకం కలవారందఱినీ అలా చేయవలసిందని ప్రోత్సహించాలి.

మనిషి తఱచుగా ప్రతిఫలంకోరుతూ దేవుని పేరు చిలకలాగా పలుకుతూంటాడు. నిజమైన జిజ్ఞాసువు, చిలకవలె పదేపదే దేవుని పేరు నుచ్చరించే అవాస్తవిక పరిస్థితిని తనలోనుండి కాక, ఇతరుల హృదయములలో నుండి కూడా తొలగించగల అచంచల విశ్వాసం కలిగి ఉండాలి.

హరిజన్, 5-5-'46.



# 12

# గ్రామ కార్యకర్త

## గ్రామసేవ

(గుజరాత్ విద్యాపీఠ కార్యకర్తలతో జరిగిన సంభాషణనుండి)

రాట్నం గ్రామకార్యకర్త జీవిత కేంద్రంగా ఉంటుంది. ఖాదీ, వ్యవసాయవృత్తికి అనుబంధంగాను, దానితో పాటు విస్తరింప తగినదిగానూ ఉండే పరిశ్రమ. మన గ్రామముల నుండి సోమరితనమును పాఱద్రోలి గ్రామములోని ప్రతి గృహ మును నిర్విరామంగా ఉండేటట్లు చేయని యెడల రాట్నమును మన జీవితంలో దాని సముచితస్థానమున స్థాపించినట్లు చెప్పు కొన వీలులేదు. కార్యకర్త ప్రతి దినము తప్పకుండా నూలు వడకడమే గాక తన పొట్టకోసం బాడితతో కాని, పారతో గాని, దిమ్మెతో గాని పనిచేస్తూ ఉండాలి. నిద్రపోయే ఎని మిది గంటలు తప్ప తక్కిన అన్ని గంటలు అతడు యేదో ఒక పనిలో నిమగ్నుడై ఉండాలి. అతడు కాలం వృథా పుచ్చకూడదు. అతడు సోమరిగా ఉండకూడదు, ఇతరులను ఉండనీయకూడదు. ఎడతెగని ఆనందప్రదమైన పరిశ్రమలో, అతని జీవితము ప్రక్కవారికి నిరంతరం తార్కాణంగా ఉండాలి. బలవంతంగాగానీ, స్వేచ్ఛగాగానీ మన మనుభ విస్తూన్న సోమరితనం పోవాలి. అది పోకపోయినట్లయితే సర్వరోగనివారిణి కూడా నిరుపయోగమవుతుంది. ప్రజలు సగమాకలితో బాధ పడుతూండడం శాశ్వత సమస్యగా

ఉండిపోతుంది. రెండు గింజలు తినే మనిషి నాలుగు గింజలు పండించాలి. ఈ ధర్మసూత్రాన్ని అందరూ అంగీకరించక పోయినట్లయితే జనసంఖ్య ఎంత తగ్గింపబడినప్పటికీ సమస్య పరిష్కారంకాదు. ఈ ధర్మసూత్రమును అంగీకరించి ఆచరణలో పెట్టేయెడల రాబోయే లక్షలాది ప్రజకు కూడా మనం చాలినంత సావకాశం చూపించగలము.

కాబట్టి గ్రామకార్యకర్త రూపం దాల్చిన సజీవ పరిశ్రమ. ఖాదీ పరిశ్రమయొక్క అన్ని పనులను అనగా ప్రత్తిగింజ నాటడం మొదలు బట్ట నేసేవరకూ గల అన్ని పనులను, ఆయన బాగా నేర్చుకొని వాటిలో పరిణతిని పొందే టందుకు తన ఆలోచనను పూర్తిగా వినియోగించాలి. అది ఒక శాస్త్రంగా ఆయన పరిగణించే యెడల ఆయన కది విసుగుగా ఉండదు. పైపెచ్చు దానిలోని గొప్ప అవకాశము లను గ్రహించినకొలదీ ప్రతి దినము ఆయనకది ఒక క్రొత్త ఆనందాన్ని కలుగచేస్తుంది. ఆయన ఒక పల్లెటూరికి ఉపాధ్యాయుడుగా పోయినప్పుడు, నేర్చుకొనే కోరికతో కూడా వెళ్లాలి. ఆడంబరంలేని గ్రామస్థులనుండి నేర్చుకోవలసింది చాలా ఉందని ఆయన త్వరలో తెలుసుకోగలడు. గ్రామ జీవితంలోని ప్రతి సూక్ష్మ విషయమును గ్రహించి గ్రామ గృహాపరిశ్రమలను తెలుసుకొని వాటి అభివృద్ధికీ, విస్తరణకు ఆయన అవకాశములను అన్వేషిస్తాడు. ఖాదీ సందేశానికి గ్రామస్థులు పూర్తిగా ఔదాసీన్యం వహించవచ్చును. కాని

ఆయన తన సేవాతత్పరత్వం వలన దానిపైన వారి దృష్టిని మళలించి వారు శ్రద్ధ వహించేటట్లు చేయగలడు. సహజంగా ఆయన తన శక్తి సామర్థ్యాలను తాను తెలుసుకొని వ్యవసాయ ఋణ సమస్యను పరిష్కరించే వ్యర్థ ప్రయత్నమునకు పోడు.

ఆరోగ్య రక్షణ, పరిశుభ్రత, విషయములలో ఆయన ఎక్కువగా శ్రద్ధ తీసుకొంటాడు. ఆయన గృహమును ఆయన పరిసరములను పరిశుభ్రతకు ఉదాహరణములుగా నుంచడమే గాక, ఆయన స్వయముగా చీపురూ తట్టా చేతబుచ్చుకొని యావత్తు గ్రామము యొక్క ఆరోగ్యమును పెంపొందించే టందుకు సహాయపడగలడు.

ఆయన గ్రామంలో ఒక వైద్యశాలను స్థాపించేటందుకు గాని, తాను గ్రామవైద్యుడు కావాలని గానీ ప్రయత్నం చేయరాదు. ఇవి చిక్కు విషయాలు. వీటిలో పడకూడదు. నా హరిజన యాత్రలో నే నొక గ్రామంపోయినాను. అక్కడ మన కార్యకర్త ఒకరు ఆడంబరమైన భవనం ఒకటి నిర్మించి అందులో మందులు ఉంచి పరిసర గ్రామాల కామందులను ఉచితంగా పంచిపెడుతూన్నాడు. నిజంగా ఇంటింటికీ పోయి వలంటీర్లు మందులు పంచిపెట్టి వస్తూన్నారు. ఈ ఔషధాలయం నెలకు 1200 మంది రోగులకు మందులు సరఫరా చేస్తూన్నట్లు వారు సగర్వంగా చెప్పుకొంటున్నారు. ఈ

విషయాన్ని నేను గట్టిగా విమర్శించక తప్పింది కాదు. గ్రామంలో పనిచేయడం ఇలాకాదని ఆ కార్యకర్తతో నేనన్నాను. గ్రామస్థులకు ఆరోగ్య రక్షణకు, పరిశుభ్రతకు సంబంధించిన విషయాలను బోధించి, రోగాలను నయంచేసే ప్రయత్నంకంటె నివారించే ప్రయత్నం చేయడం కార్య కర్త విధి అని చెప్పి, ప్రాసాదమువంటి ఆ భవనమును స్థానిక సంస్థకు అద్దెకిచ్చి ఆయనను ఏదైనా పాకలో ఉండవలసిందని సలహా యిచ్చాను. నిజంగా దగ్గర ఉంచుకోవలసిన మందులు క్వినైన్, ఆముదం, అయోడీన్ వంటివి మాత్రమే. వ్యక్తి యొక్కయు, గ్రామము యొక్కయు పరిశుభ్రతను గ్రామస్థులు గుర్తించి ఎలా అయినాసరే దానిని వారు కాపాడుకోవడానికి సహాయపడడమే కార్యకర్త ముఖ్యంగా శ్రద్ధ వహించ వలసిన పని.

గ్రామంలోని హరిజనుల క్షేమమును గూర్చి కూడా ఆయన శ్రద్ధ తీసుకోవాలి. ఆయన ఇల్లు వారికిశరణ్యంగా ఉండాలి. తమకు కష్టాలుగాని, చిక్కులుగాని, తటస్థించి నప్పుడు వారు సహజంగా ఆయన కడకు పోవాలి. తన గృహములో హరిజన మిత్రులు ఉండడం గ్రామవాసులు సహించక పోయినట్లయితే తానే హరిజనవాడలో కాపురం పెట్టాలి.

అక్షర జ్ఞానమును గూర్చి ఒకమాట చెప్పవలసియుంది. దానిస్థానం దానికున్నది. కాని అక్కఱలేనిచోట దానిని

గూర్చి ఎక్కువగా నొక్కి చెప్పవలదని నామనవి. పిల్లలకు గాని, పెద్దలకు గానీ ముందుగా చదువను, వ్రాయను నేర్పకుండా గ్రామస్థులకేమీ బోధించడానికి వీలులేదనే అభిప్రాయంతో ప్రవర్తించకండి. అక్షరాలజోలికి పోకుండానే ప్రస్తుత విషయాలు- చరిత్ర, భూగోళం, ప్రాథమిక గణితము, మొదలగు వాటిని గూర్చి నోటితోనే చెప్పి, ఎంతో ఉపయోగకరమైన జ్ఞానం వారికి కలిగించవచ్చును. కళ్లు, చెవులు, నాలుక చేతులకన్న ముందుగా పనిచేస్తవి. వ్రాతకుముందు చదవడం వస్తుంది. అక్షరాలు దిద్దడం కంటె ముందుగా బొమ్మగీయడం వస్తుంది. ఈ స్వతస్సిద్ధమైన పద్ధతిని అవలంబించినట్లయితే, అక్షరాలు నేర్పడంతో పిల్లల చదువును ప్రారంభించిన దానికంటె వారి గ్రహణశక్తి అభివృద్ధి పొందేటందుకు చాలా ఎక్కువ అవకాశముంది.

కార్యకర్త జీవితం గ్రామజీవితంతో సమ్మేళనం కావాలి. ఆయన పెద్దపండితుడులాగా నటిస్తూ ఎప్పుడూ పుస్తకాలలో మునిగి తేలుతూ సామాన్య జీవిత వ్యవహారాలను వినడానికి విసుగు చెందుతుండ కూడదు. పై పెచ్చు ఆయనను గ్రామస్థులెప్పుడు చూడవచ్చినా, రాట్నం, మగ్గం, బాడిత, పార మొదలగు పరికరములతో పనిలో నిమగ్నుడై ఉండాలి. ఆయన వాళ్లడిగే చిల్లర ప్రశ్నలన్నిటికీ కూడా జవాబు చెబుతూ ఉండాలి. ఆయన తన పొట్టకోసం తాను పట్టుదలతో పనిచేయాలి. దేవుడు, ప్రతివ్యక్తికీ తనకు

రోజుకు కావలసిన దానికంటె ఎక్కువ ఉత్పత్తి చేయగల శక్తినిచ్చాడు. అతడు తనకున్న తెలివితేటల నుపయోగించే పక్షంలో, అతనిశక్తిసామర్థ్యాలెంత తక్కువైనా వానికి తగిన వృత్తి అతనికి లభించక పోదు. ప్రజలాయనను పోషించక పోవటం కంటె సంతోషంగా పోషించడానికే ఎక్కువ అవకాశమున్నది. కాని కొన్నిచోట్ల ప్రజలు ఉదాసీనంగా కూడా ఉండవచ్చును. అయినప్పటికీ అతడు కష్టపడి పని సాగిస్తూనే ఉండాలి. హరిజనుల యెడ అతని అనుకూల వైఖరిని బట్టి కొన్ని గ్రామాలలో అతనిని వెలిబెట్ట వచ్చును. అటు వంటి సందర్భాలలో అతడు హరిజనుల కడకు పోయి అన్నం పెట్టమని అడగాలి. కష్టజీవి ఎప్పుడూ అతనికిచ్చే కూలికి అర్హుడై ఉంటాడు. హరిజనులకు తాను హృదయపూర్వకంగా సేవచేస్తూన్న యెడల వారిచ్చిన ఆహారం భుజించడానికేమీ సందేహించ నక్కరలేదు. ఐతే తాను పుచ్చుకొనేదానికంటె ఇచ్చేది ఎప్పుడూ ఎక్కువగా ఉండాలి. అతి ప్రారంభ దశలలో వీలున్నచోట్ల కేంద్రనిధినుండి కొద్దిగా ఏదైనా జీవనభృతి తీసుకోవచ్చును.

మన ఆయుధములు ఆధ్యాత్మికమైనవనే విషయం జ్ఞాపకం పెట్టుకోండి. అవి ప్రత్యక్షంగా కనపడకపోయినా నిర్నిరోధకంగా పని చేయగలశక్తి కలవి. ఆ శక్తి వరుస క్రమంలో రెట్టికి రెట్టింపుగా అభివృద్ధి పొందుతూంటుంది. దానికి వెనుక చోదకం (Propeller) ఉన్నంతవఱకు అది పని చేయకమానదు. కాబట్టి నీ కార్యక్రమమున కంతటికీ పునాది

ఆధ్యాత్మిక దృక్పథముతో ఉండాలి. కనుక నీ శీలము ప్రవర్తన పరమ పవిత్రములుగా ఉండడం అవసరము. ఇది అసాధ్యకార్యక్రమమని, యిందుకు తగిన అర్హతలు మీకు లేవని మీరు నాతో చెప్పరాదు. ఇంతవరకు మీరా కార్యమును నిర్వర్తించ లేక పోవడమే మీసాధనకృషికి అవరోధంగా ఉండరాదు. ఈ పని మీ హృదయానికి నచ్చి యుక్తమని తోస్తే మీ రేమీ వెనుకంజవేయరాదు. చేసి చూడడానికి వెనుదీయకండి. కృషి ప్రయోగం ఎప్పుడూ అంతకంత కెక్కువ ప్రయత్నమునకు ప్రోత్సాహం కల్పిస్తుంది.

హరిజన్, 31-8-'34.

## గ్రామయాత్రలు

తమ పరిసర ప్రదేశములలో గ్రామసేవను గూర్చిన సందేశాన్ని అందించడానికి శ్రీ సీతారామశాస్త్రి కార్యకర్తల గ్రామయాత్రలను ఏర్పాటు చేస్తూన్నారు. ఈ యాత్రికులు రైళ్లలో కాని, మోటారులలో గాని చివరకు మోటబండ్లలో గాని ప్రయాణం చేయకూడదని నేను సలహా యిస్తున్నాను. నా సలహాను వారామోదించిన యెడల వారి కార్యక్రమము ఎక్కువ పటిష్ఠముగా నుండడమేగాక దాదాపు ఖర్చుకూడా ఏమీ ఉండదు. ఒక్కొక్కదళములో ఇద్దరు ముగ్గురు కన్న ఎక్కువ ఉండకూడదు. ఈ దళములకు నిలిచేటందుకు నీడ, తినేటందుకు తిండి గ్రామస్థులే ఈయగలరని నా ఊహ. పెద్దపెద్ద దళాలు గ్రామస్థులకు భారంగా తోచవచ్చును. కాని చిన్నదళాల విషయంలో ఆ బాధఉండదు.

ఈ దళములు, గ్రామ పరిశుభ్రత, గ్రామ పరిస్థితుల పరిశీలన, మిక్కిలి డబ్బు పెట్టుబడితో అవసరం లేకుండా గ్రామస్థుల ఆర్థిక ఆరోగ్యపరిస్థితుల అభివృద్ధి, మొదలగు విషయములను గూర్చియే ఎక్కువగా పనిచేయవలయును.

హారిజన్ 22-౩-'35.

*పూర్వసాంప్రదాయానికి క్రొత్త పద్ధతులా ?*

తగినంత అనుభవం లేకుండా పూర్వ పరికరములతో పూర్వ పద్ధతులతో పూర్వపు నమూనాలతో జోక్యం కల్పించుకోకూడదు. నడుస్తూన్న పూర్వ సంప్రదాయాన్ని చెడగొట్టకుండా అభివృద్ధి మార్గాలను ఆలోచించడం క్షేమం. ఆర్థికంగా అది సరియైన కార్యకర్తలు తెలుసుకోగలరు.

హారిజన్, 29-3-'35.

*గ్రామకార్యకర్త ప్రశ్నలు*

గ్రామస్థుల అనుభవమువకు అనువుగానున్న పండ్లు, కూరగాయలు గ్రామకార్యకర్త తీసికోనవచ్చునా అనే ప్రశ్నకు గాంధీజీ ఇలా వ్రాశారు :

గ్రామ కార్యకర్త గ్రామస్థుల సేవకోఽకు గ్రామంలో ఉన్నాడనే సంగతి ముఖ్యంగా జ్ఞాపకం పెట్టుకోవాలి. కాబట్టి ఆయన కార్యనిర్వాహణమునకు తగిన స్థితిలో ఆయన ఉండే టందుకు కావలసిన ఆహారము, తదితర అవసరాలను చేకూర్చు కొనడం ఆయన హక్కూ, కర్తవ్యమూ కూడా. ఇందువల్ల తక్కిన గ్రామస్థులకంటె గ్రామకార్యకర్త జీవిత ప్రమాణం

ఎక్కువగా ఉండవలసిన అవసరం ఉంది. అయితే ఈ అవసర వస్తువులు గ్రామకార్యకర్తకు సరఫరా చేయడానికి గ్రామస్థు లసూయపడరని నా అభిప్రాయం. దీ నంతకూ కార్యకర్త అంతరాత్మయే సాక్షి. అతడు నిగ్రహం కలిగి ఉండాలి. జిహ్వాచాపల్యం వలన యేమీ భుజించకూడదు. భోగపదార్థాలకు ఆశపడకూడదు. మెలకువతో ఉన్నంత కాలమూ ఏదో సేవచేస్తూనే ఉండాలి. ఇంత చేసినప్పటికీ కొద్దిమంది అతని జీవితపద్ధతిని గూర్చి ఏదో ఆక్షేపిస్తూనే ఉంటారు. అటువంటి విమర్శనలను మనము లెక్కపెట్ట కూడదు. కొంచెం శ్రమచేస్తే నేను సూచించిన ఆహారం గ్రామాలలో లభించకుండా ఉండదు. సాధారణంగా పాలూ కావలసినన్ని పళ్లు ఉంటవి. బేర్, కరండా, మొహూరా పూవులు తేలికగా లభించగలవు. అందువల్లనే మనం వాటి కంత విలువ ఈయము. మన గ్రామాలలో పడి మొలచిన మొక్కల ఆకులు అనేకం ఉంటవి. కేవలం (బడాయివల్ల కాకపోయినా) అజ్ఞానం వల్లనో సోమరితనం వల్లనో మనం వాటిని ఉపయోగించము. నేను ఇదివరకెన్నడూ ఉపయోగించని అనేక రకములైన పచ్చి ఆకులను ఉపయోగిస్తున్నాను. కాని అవి ఉపయోగించవలసిన ఆకులేనని గ్రహించగలుగుతున్నాను. గ్రామంలో ఆవును పెట్టుకొంటే దాని సౌకర్యములకు పోషణకు కావలసిన ఖర్చు అదే సంపాదించి పెడుతుంది. నే నీ విషయం ప్రయత్నించి చూడలేదుకాని అది సాధ్యమేనని నా అభిప్రాయం. గ్రామకార్యకర్తలే

ఆహారముపైన జీవిస్తున్నారో అటువంటి ఆహారాన్ని గ్రామస్థులుకూడా పొంది వారి జీవితమువంటి జీవిత ప్రమాణాన్ని అనుసరించడం అసాధ్యం కాదనికూడా నా విశ్వాసం.

హరిజన్, 24-8-'35.

### గ్రామకార్యకర్తలతో సంభాషణ
(వ్యాసంలోని భాగం)

గ్రామ పరిశ్రమలలో ఖాదీ నిశ్చయంగా కేంద్రస్థానమలంకరిస్తుంది. కాని గ్రామాలను ఖాదీవిషయంలో స్వయం సంపూర్ణములుగా చేయడానికి మన దృష్టిని కేంద్రీకరించవలసి ఉంటుందని మఱచిపోకండి. స్వయంసంపూర్ణఖాదీ, తరువాత కాలక్రమేణా వ్యాపారపుఖాదీ తయారవుతుంది.

అమ్ముడు పోయేటందుకు సావకాశమున్న యే యితర గ్రామ పరిశ్రమనైనా మీరు తీసుకోవచ్చు. కాని యే దుకాణమూకూడా నష్టంమీాద పనిచేయకుండానూ, అమ్ముడుపోని వస్తువు తయారుచేయకుండానూ మాత్రం జాగ్రత వహించాలి. మీా యిష్టము వచ్చిన గృహపరిశ్రమ తీసికొని ఎనిమిది గంటలు పనిచేసి మీా మజూరీ మీారు సంపాదించుకొంటూన్నట్లే గ్రామస్థులుకూడా ఎనిమిది గంటలు పనిచేసి వారి మజూరీ వారు సంపాదించుకోగలరని నిరూపించాలి.

మీాతో కలసి పనిచేయడానికి మఱొక సహచరుని తీసికొని వెళ్లకూడదు. ఒక్కొక్క గ్రామానికి గాని, కొన్ని గ్రామాలకుగాని కలసి ఒక్క కార్యకర్తమాత్రమే పని

చేయడం మన విధానము. అందువలన అతని తెలివితేటలను పూర్తిగా వినియోగించేటందుకు అవకాశం కలుగుతుంది. తాను పని చేసే గ్రామంనుండి యెంతమంది సహచరులనైనా సంపాదించుకోవచ్చు. వారతని ఆదేశం ప్రకారం పని చేస్తూంటారు. కాని ఆయన ఆధీనంలో ఉన్న గ్రామానికి ప్రధానంగా ఆయనే బాధ్యుడు.

యంత్రయుగము యొక్క ఆకర్షణలకు మనం లొంగిపోకూడదు. మన శారీరక యంత్రాలను సలక్షణంగా ఉంచుకొని సమర్థవంతములైన పరికరములుగా చేసుకోవడంలో మనం గట్టిగా శ్రద్ధవహించాలి. అప్పుడు మనం ఎంత పనినైనా చేయగలం. ఇది మీ కర్తవ్యం. ఈ పనిలో జంకూ గొంకూ లేకుండా ముందుకు నడవండి.

హరిజన్, 2-11-'35.

## భీరుత్వ చిత్తవృత్తి

చాలామంది కార్యకర్తలకు గ్రామజీవితమంటే చాలా భయం. ఎక్కడనుండో జీతమువస్తేనేగాని, గ్రామాలలో పని చేసుకొని జీవించలేమనే భయం, ముఖ్యంగా వివాహమయి కుటుంబాన్ని భరించవలసిన కార్యకర్తలకు ఎక్కువగా ఉంది. నా అభిప్రాయంలో ఇది భయోత్పాదకమైన విశ్వాసము. అయితే, ఒక మనిషి నగరచిత్తవృత్తితో గ్రామానికిపోయి గ్రామాలలో నగరజీవితమును గడపవలయునని అనుకొన్నయెడల, తక్కిన నగరవాసులవలెనే తాను

కూడా గ్రామస్థులను స్వార్థంకోసం ఉపయోగించుకోవాలి. లేనిచో తగినంత సంపాదించుకోజాలని మాట వాస్తవమే. కాని అతడు గ్రామంలో ఉండి గ్రామస్థులవలెనే జీవింపతలచు కొన్నప్పుడు చెమట ఓడ్చి పనిచేసుకొని జీవించడం అతనికి కష్టంగా ఉండకూడదు. ఏ విధమైన చాకచక్యములేక సంప్రదాయసిద్ధములైన పద్ధతులలో యేడాది పొడుగునా కష్టించి గ్రామవాసులు జీవనం చేయగలుగుతూండగా తాను కూడా కనీసం సాధారణ గ్రామవాసివలె సంపాదించుకొని జీవించగలననే ఆత్మవిశ్వాసం అతని కుండాలి. అప్పుడు అతడు ఆ గ్రామానికి పరాన్నభుక్కుడుగా గాకుండా ఉత్పత్తి దారుగా వెడతాడు. కాబట్టి, ఈ పని ఆతడు ఏ ఒక్క గ్రామ వాసికీ నష్టం కలుగకుండా చేయగలుగుతాడు.

కార్యకర్త సామాన్య కుటుంబంకలవాడైతే, ఆయన భార్యా, ఆయన కుటుంబంలో మఱొకఱు రోజంతా పనిచేసే వారుగా ఉండాలి. కార్యకర్త గ్రామస్థునివలె వెంటనే కండ పుష్టి కలవాడు కానక్కరలేదు. కాని అతని తెలివితేటలవల్ల శరీరబలంలేని కొఱత కనబడకుండా బాగా వ్యవహరించ గలడు. అతనికుండే సంకోచము, పిఱికితనము మాత్రం విడ నాడాలి. అతని కాలమంతా గ్రామస్థులను సేవించడంలోనే వినియోగించేటందుకు తగినట్లుగా గ్రామస్థుల ప్రవర్తన కన బడువఱకు, అతడు ఉత్పత్తిదారుడుగా ఉండవలెనే కాని కేవలం వినియోగదారుడుగా ఉండకూడదు. అటువంటి

సందర్భంలో తన ప్రయత్నం వలన గ్రామస్థు లధికోత్పత్తి చేయగలిగిన యెడల అతనికి నియమింపబడిన పని సఫలమైనట్లే. కాని అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘంవారి యాజమాన్యమున నడుపబడుతూన్న పనిని గూర్చి కొద్ది నెలల అనుభవము వలన గ్రామస్థులలో కదలిక చాలా నెమ్మదిగా గాని కలుగదనీ, కార్యకర్త తన శీలమునుబట్టీ, పనినిబట్టీ గ్రామస్థుల కాదర్శంగా ఉండవలయుననీ విశదమవుతూన్నది. అయితే అతడు గ్రామస్థులకు తగినంత దూరంగా ఉండి పూజింపదగిన ఆదర్శ పురుషుడుగా ప్రవర్తించకూడదు. వారిలో ఒకడుగా ప్రవర్తించాలి. అప్పుడే వారి వాత డాకర్షింపగలిగిన ఉదాహరణంగా ఉంటాడు.

ఇక కార్యకర్త ఎన్నుకొన్న గ్రామంలో తనకు ప్రతిఫలం ముట్టేపని అత డేమిచేయగలడు అనే ప్రశ్న ఒకటిఉంది. గ్రామస్థులు తోడ్పడినా తోడ్పడకపోయినా, అతడూ అతని కుటుంబమూ గ్రామాన్ని పరిశుభ్రం చేయడంలో కొంత కాలం వినియోగించాలి. తన చేతనైన వైద్యసహాయం కూడా అతడు చేయవచ్చును. ప్రతిమనిషీ చిన్నచిన్న మందులు, క్వినైన్ లాంటివి సూచించవచ్చును. కురుపులు, గాయాలు, కళ్లు, చెవులు, ఇవన్నీ కడిగి శుభ్రం చేయవచ్చును. గాయానికి శుభ్రమైన తైలంకూడా రాయవచ్చును. గ్రామాలలో ప్రతిదినము కనబడే సామాన్యమైన జబ్బులకు మిక్కిలి తేలికయిన చికిత్సా విధానమును చూపించగల పుస్తకం కోసం నేను ప్రయత్నిస్తున్నాను. ఎలాగయినాసరే

ఈ రెండు విషయాలు గ్రామ కార్యక్రమంలో విడదీయరాని భాగంగా ఉండాలి. అవి రోజుకు రెండు గంటలకంటె ఎక్కువ పని పుచ్చుకోకూడదు. గ్రామ కార్యకర్తకు రోజుకు ఎనిమిది గంటలపని అని నిబంధనలేదు. అతడు గ్రామస్థునికి చేసే సేవ ప్రేమపూర్వకమైనది. కాబట్టి ఈ రెండు గంటలకుతోడు తన బ్రతుకుకోసం అతడు కనీసం మఱి ఎనిమిది గంటలు పని చేయవలసి ఉంటుంది. అఖిలభారత చరఖాసంఘం, అఖిల భారత గ్రామపరిశ్రమల సంఘంవారిచే ప్రతిపాదింపబడిన ప్రణాళిక ప్రకారం యావత్తు శరీరశ్రమ సమానమైన కనీసపు విలువ కలిగిఉంటుందనే విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. అనగా ఏకులుచేసే మనిషి సగటున గంటకు తయారుచేసిన ఏకులకు ఎంత మజూరీ ఈయబడుతుందో, నూలువడికే మనిషి గాని, నేసే మనిషిగాని, కాగితం తయారుచేసే మనిషిగాని సగటున గంటకు ఎంతపని చేయగలడో ఆ పనికికూడా అంతే మజూరీ ఈయబడుతుంది. కాబట్టి కార్యకర్త యేపని తాను సుకరంగా చేయగలడో ఆ పనినే నిర్ణయించుకోవాలి. కాని తాను చేసే పనివలన ఉత్పత్తి అయిన వస్తువు ఆ గ్రామంలో కాని, పరిసర గ్రామాలలోగాని, సంఘములద్వారా గాని అమ్ముడుపోయేదిగా ఉండాలి. కార్యకర్త అటువంటి పనినే జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయించుకోవాలి.

కల్తీలేని ఆహారపదార్థాలు ఇతర వస్తువులు అసలు ఖరీదుకు కొద్ది లాభంతో అమ్మే నిజాయితీ అయిన దుకాణం ప్రతిగ్రామంలోనూ ఉండడం ముఖ్యావసరం. దుకాణం

ఎంత చిన్నదైనప్పటికీ కొంత పెట్టుబడి అవసరమయ్యేమాట నిజం. అయితే తన పనినిబట్టి స్థానికంగా బాగా తెలిసిన కార్యకర్తయొక్క నిజాయితీలో ప్రజలకు కల విశ్వాసము వలన ఆయన చిన్న టోకు వ్యాపారానికి తగినంత సరుకు అరువుగా తెచ్చుకోగలిగి ఉంటాడు.

నే నీ వాస్తవిక సూచనలను ఇంకా ఎక్కువగా చెప్ప నక్కఱలేదు. పరిశీలకుడైన కార్యకర్త నిత్యమూ ముఖ్యమైన విషయాలను కనిపెడుతూనే ఉంటాడు. గనుక తన జీవితమునకు కావలసింది తాను సంపాదించుకొంటూ తాను సేవిస్తూన్న ప్రజకు ఆదర్శంగా ఉండేటందుకు తానేమి కృషి చేయవలయునో త్వరలోనే గ్రహించగలడు. కాబట్టి అతడు గ్రామస్థులను తనకోసం ఉపయోగించుకోకుండా వారి ఆరోగ్యానికీ, నీతికీ భంగంరాని పనిని నిర్ణయించుకొంటాడు. గ్రామస్థులు తమ విశ్రాంతి సమయంలో యేదైనా చేతిపని చేసుకొని వారి అల్పాదాయములకు తోడు మఱికొంత సంపాదించుకొనే ఉపాయం చెబుతాడు. గ్రామంలో వృధాగాపడి మొలచిన మొక్కలు మొదలుకొని పైన కనిపించే సహజ సంపదలవరకు ఆయన పరిశీలనాదృష్టికి లోబడగలవు. వాటిని చాలావరకు ఉపయోగపడేటట్లు చేయగల శక్తి ఆయన త్వరలోనే పొందగలడు. తినతగిన మొక్కలను ఆయన ఎన్నగలిగిన యెడల తాను సంపాదించుకోగలిగిన ఆహారంలో అది ఒక భాగమవుతుంది. మీరాబేన్ నాకు చక్కని చలువరాళ్ల ప్రదర్శనశాలను నిర్మించిపెట్టింది. అవి నా కనేక విధాల ఉపయోగపడుతూన్నవి. నాకు విశ్రాంతి ఉన్నట్లు

యితే వాటిని అనేక రూపాలలో మంచి పరికరములుగాను బజారు వస్తువులుగాను తయారుచేసి ఉండేవాడను. కాకా సాహెబు తనకిచ్చిన వాసపుబద్దలను షాయిలో పెట్టడానికి యేర్పాటు చేయబడిన వాటిని, ఒక మోటకత్తితో కాగితం కోసుకొనే చాకులుగాను, కొయ్యతెడ్లుగానూ తయారు చేశాడు. అవి అంగడిలో పరిమితంగా అమ్ముడుపోవచ్చును కూడా. మగన్‌వాడిలో నున్న కొంతమంది కార్యకర్తలు తమ విశ్రాంతి కాలంలో ఒకవైపు కాళీగాఉన్న చిత్తుకాగితాలతో కవర్లు తయారు చేస్తున్నారు.

గ్రామస్థులకు పూర్తిగా ఆకాంక్ష నశించినమాట వాస్తవం. వారు ప్రతి క్రొత్తమనిషినీ, తన స్వార్థంకోసం వినియోగించుకోవడానికి మాత్రమే వస్తున్నాడనీ, అతడు తమ కుత్తుకలు కోయగలడనీ అనుమానిస్తూంటారు. శరీర పరిశ్రమకు, బుద్ధికుశలతకూ ఉన్న విభేదము వారి ఆలోచనా శక్తిని నశింపచేసింది. వారు పనిచేసే కాలమునుకూడా మిక్కిలి ప్రయోజనకరంగా వినియోగించుకోరు. కార్యకర్త అటువంటి గ్రామాలకు నిండు ప్రేమతోనూ ఆశతోనూ పోవాలి. స్త్రీ పురుషులు తమ తెలివిని వినియోగించకుండా కష్టపడి పనిచేస్తూ ఆరునెలలు నిరుద్యోగులుగా ఉంటూన్న గ్రామాలలో, తాను శ్రమకుతోడు తెలివితేటలను కూడా ఉపయోగించి ఏడాది పొడుగునా పనిచేసే యెడల, ఆ గ్రామస్థుల విశ్వాసమును చూరగొనుటయే కాక వారితో కలసి

మెలసి పనిచేసి నిజాయితీగా తాను జీవించగలననే ఆత్మనిశ్చయంతో కూడా ఆత డా గ్రామాలలో అడుగుపెట్టాలి.

'అయితే నా పిల్లలు, వారి చదువుసంగతి ఏమిటి' అని కాబోయే కార్యకర్త అడుగుతాడు. ఆధునిక పద్ధతిలో ఆయన పిల్లలు చదువదలచుకొనే యెడల నా సలహా ఉపయోగకరముగా ఉండదు. వారు ఆరోగ్యవంతులుగా, కండ పుష్టికలవారుగా, నిజాయితీ తెలివితేటలుగల గ్రామస్థులుగా తమ తల్లిదండ్రులు స్వీకరించిన గృహంలోనే తమ జీవితమునకు కావలసినది సంపాదించుకునే స్థితిలో ఉంటే చాలుననే పక్షంలో, వారి స్వగృహంలో వారికి కావలసిన యావత్తు విద్యను నేర్చుకోగలగడమేగాక, వారికి బుద్ధితెలిసి వారి చేతులను కాళ్లను సరిగా ఉపయోగించగలిగిన క్షణమునుండీ కూడా కుటుంబములో యేదో కొంత సంపాదించగలిగిన వారుగా ఉంటారు. చక్కని గృహముతో సమానమైన పాఠశాలకానీ, నిజాయితీపరులు, సుగుణవంతులు అయిన తల్లిదండ్రులతో సమానులైన ఉపాధ్యాయులుకానీ లేరు. ఆధునిక ఉన్నత పాఠశాలలోని విద్య గ్రామస్థులకు మోయరాని బరువు. వారి బిడ్డలు ఎన్నడూ దానిని పొందజాలరు. మంచి యింటి శిక్షణ పొందినవారి కది దూరంకాదు. గ్రామ కార్యకర్త, స్త్రీ గానీ పురుషుడుగానీ మర్యాదగల మనిషికాక, తన యింటిని తాను చక్కగా ఉంచుకోలేని పక్షంలో తాను గ్రామ కార్యకర్త అయ్యే ఉన్నత గౌరవమునకుగాని, హక్కునకుగాని ఆశించకూడదు.

హరిజన్, 23-11-'35.

### *గ్రామ కార్యకర్తల ప్రశ్నలు*

కార్యకర్తల సమావేశములో గాంధీజీని ఉపన్యసింప కోరుటకు బదులుగా, వారు కొన్ని ప్రశ్నలనిచ్చి వివరంగా జవాబులు చెప్పమని కోరినారు.

గ్రామకార్యకర్త కర్తవ్యమును గూర్చినది వారడిగిన మొదటి ప్రశ్న. గ్రామస్థులకు సేవచేయడమే ఆయనవిధి అని గాంధీజీ ప్రత్యుత్తరం. అందుకు ఆయన మార్గదర్శకములుగా వెలుగొందు పదకొండు ప్రతిజ్ఞలు చేయవలయునన్నారు. ఆ ప్రతిజ్ఞలను వినోబా రెండు ద్విపదలలో వ్రాశారు. అవి దేశంలోగల ప్రతి ఆశ్రమంలోని ఆశ్రమవాసులు తమ ప్రార్థనా సమావేశాలలో చదువుతున్నారు.

అహింసా సత్య అస్తేయ బ్రహ్మచర్య అసంగ్రహా,
శరీరశ్రమ, అస్వాద సర్వత్ర భయవర్జన
సర్వధర్మ సమానత్వ స్వదేశీ స్పర్శభావనా
హీః ఏకాదశ సేవాహీః నమ్రత్వే వ్రతనిశ్చయే.

దీని అర్థం:

[అహింసా, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అసంగ్రహం, శరీరశ్రమ, జిహ్వాచాపల్యనిరోధం, నిర్భీతి, సర్వమత సమానత్వం, స్వదేశీ (దూరాన లభించే వస్తువుల కంటె ఎక్కువగా పరిసరాలలో ఉండే వస్తువుల నుపయోగించడం, దూరాన ఉన్నవానికంటె ఎక్కువగా పరిసరాలలో ఉన్న వారిని సేవించడం) సర్వమానవ సోదరభావము—ఈ పదకొండు ప్రతిజ్ఞలను సవినయంగా అనుసరించాలి.]

కార్యకర్త బ్రతుకు తెఱువును గూర్చినది తరువాత ప్రశ్న. అతడు తన భృతిని ఎలా సంపాదించుకోవాలి? అతడేదైనా సంస్థనుండి తన భృతికని యేమైనా తీసికొనవలెనా, లేక తాను శరీర శ్రమచేసి సంపాదించుకొనవలెనా, లేక గ్రామంపైన ఆధారపడి యుండవలెనా? గ్రామంపైన ఆధారపడి ఉండడం ఆదర్శపద్ధతి. అందులో వినయం కనబడుతుంది. అది సిగ్గు పడవలసిన విషయం కాదు. అందువలన స్వీయభోగములకు కూడా తావులేదు. గ్రామస్థులు స్వీయ భోగములను ప్రోత్సహిస్తారని కానీ సహిస్తారని కానీ అతడు భావించడు. కార్యకర్త, గ్రామంయొక్క క్షేమం కోసం తాను పనిచేసే కాలాన్ని పూర్తిగా వినియోగించడమే కావలసింది. తరువాత తనకు కావలసిన తిండిగింజలు, కూరలూ గ్రామస్థులనుండి తీసుకోవచ్చును. అవసరమైతే పోస్టేజీ మొదలయిన ఖర్చులకు కొద్దిగా గ్రామస్థులనుండి చందా కూడా తీసికోవచ్చును. అది కూడా అవసరంలేదని గాంధీజీ అభిప్రాయం. గ్రామస్థుల ఆహ్వానం పైన ఆ గ్రామానికి పోయినట్లయితే వారు హృదయపూర్వకంగా వారిని పోషించగలరు. ఒక్కొక్కప్పుడు కార్యకర్త అభిప్రాయములు గ్రామస్థులకు సరిపడక పోయినప్పుడు వారు అతనితో సహకరించడం మానివేయవచ్చును కూడా. 1915 లో గాంధీజీ సత్యాగ్రహాశ్రమంలో అస్పృశ్యులను చేర్చుకొన్నప్పుడు అలాగే జరిగింది. అప్పుడు కార్యకర్త తన బ్రతుకు తెఱువుకోసం కష్టపడవలసియుంటుంది. అంతే కాని యే సంస్థపైనా ఆధారపడకూడదు.

మూడవ ప్రశ్న శరీరశ్రమను గూర్చినది; గ్రామ కార్యకర్త తన చేతనైనంత శరీరశ్రమ చేసి గ్రామస్థులను సోమరితనం నుండి తప్పించాలి. అతడే విధమైన శరీరశ్రమ యైనా చేయవచ్చు. కాని అన్నిటికంటే పాకీ పని విషయంలో ఆయన ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి. పాకీ పని నిజంగా ఉత్పత్తికి సంబంధించిన కృషి. కార్యకర్త కనీసం రోజుకు ఒక అరగంటయైనా గ్రామానికి సేవగానూ, ఉత్పత్తికి తోడ్పడేదిగానూ ఉండే పనికి వినియోగించాలి. పాకీ పని తప్పకుండా ఈ తరగతి క్రిందకు వస్తుంది. పిండి విసరడం కూడా ఇదే తరగతి. పొదుపు చేసుకున్న సొమ్ము సంపాదించుకొన్నట్లే.

నాలుగవ ప్రశ్న దినచర్య వ్రాయడమును గూర్చి. కార్యకర్త మేలుకొని ఉన్న కాలంలో ప్రతి నిమిషము పనిలో నిమగ్నుడు కావాలి. చేసిన పనిని స్పష్టంగా తన దినచర్యలో వ్రాసి తీరాలి. దినచర్య నిజంగా వ్రాస్తే అది వ్రాసిన వాని యొక్క మనస్సును ఆత్మను ప్రతి బింబింప చేస్తుంది. కాని తమ మానసిక భావాలను ఉన్నవి ఉన్నట్లు వ్రాయడం చాలా మందికి కష్టం. ఆ సందర్భాలలో వారు కేవలం తమ శారీరక చర్యలను మాత్రమే వ్రాయవచ్చును. కాని అది లాంఛన ప్రాయంగా ఉండకూడదు. అంటే "వంటశాలలో పని చేశాను" అని వ్రాయడం కూడదు. వంటశాలలో కొందఱు ఊరికే కాలక్షేపం చేయవచ్చును కూడా. తానేమి పని చేశాడో వివరంగా వ్రాయాలి.

ఐదవ ప్రశ్న 'దుబ్లాల'లో పనిచేయడమును గూర్చి : ఈ దుబ్లాలు గుజరాతులోని కొన్ని ప్రదేశాలలో బానిసలుగా పని చేస్తూంటారు. దుబ్లాలలో పనిచేయడమంటే వారితో కలసి పనిచేయడం, వారి కష్టాలలో పాలు పంచుకోవడం, వారి యజమానులతో సన్నిహిత సంబంధం కల్పించుకొని వారిని దయగానూ, న్యాయంగానూ చూచేటట్లు ప్రయత్నించడం.

చివరకు గాంధీజీ ఇలా అన్నారు : గ్రామ కార్యకర్త రాజకీయాలతో జోక్యం పెట్టుకోరాదు. అతడు కాంగ్రెసు సభ్యుడు కావచ్చును. కాని ఆయన ఎన్నికల కార్యక్రమంలో పాల్గొనరాదు. ఆయన పని యేదో ఆయనకు ప్రత్యేకం నిర్ణీతమయ్యేఉంది. గ్రామపరిశ్రమల సంఘము, చరఖాసంఘము కాంగ్రెసు వలననే సృజింపబడినవి. కాని అవి కాంగ్రెసుతో సంబంధం లేకుండా స్వతంత్రంగా పనిచేస్తూన్నవి. కాబట్టియే అవీ, వానిలోని సభ్యులూ కాంగ్రెసు రాజకీయాల జోలికి కూడాపోరు. అదీ అహింసా పద్ధతి.

''గ్రామకక్షుల జోలికి కూడా పోకూడదు. గ్రామ కార్యకర్త యేవి లేకుండా నగరంలో ఉండి జరుపుకోలేడో అవి లేకుండా గ్రామంలో ఉండి జరుపుకోవడానికి నిశ్చయించుకొని అక్కడకు పోయి నివసించాలి. నేను గ్రామంలో కూర్చొని పనిచేయదలచుకొన్నట్లయితే, యే వస్తువులు నేను గ్రామానికి తీసికొని వెళ్లకూడదో నిర్ణయించుకోవాలి. అవి

సహజంగా నిరపాయకరములయిన వయినా సరే. సామాన్య గ్రామస్థుని జీవితాని కవి ఉపయోగిస్తయ్యా లేదా అనేదే ప్రశ్న. కార్యకర్త యే ఆకర్షణలకు లోబడని దోషరహితుడై నిశ్చలంగా నిలబడాలి. అప్పుడే అత డా దోషములనుండి గ్రామాన్ని రక్షించగలడు. ఒకే ఒక పవిత్రాత్మ గ్రామము నంతను రక్షింపగలదు. లంకను ఒక్క విభీషణుడే రక్షింప గలిగాడు. సోదమ్, గోమోరహ్‌లలో ఒక్క పవిత్రాత్మ మిగిలి ఉన్నంతవఱకూ నాశనం కాకుండా ఉండినవి.''

హరిజన్, 29-2-'36.

### లోపలనుండి అపాయము

శక్తివంతమైన యే ఉద్యమంకానీ, యే సంస్థకానీ బయటనుండి వచ్చే దండయాత్ర వలన సమసిపోదు. లోపల నుండి పుట్టిన క్షయవ్యాధి వలన చచ్చిపోతుంది. ముఖ్యంగా కావలసినవి అనుమానించడానికి వీలులేని శీలము, దినదినాభి వృద్ధిపొందుతూన్న కార్యకౌశలజ్ఞానముతో పాటు నిరంతర సేవా తత్పరత్వము, కఠినమైన నిరాడంబర జీవితము. శీలం లేని వారూ, గ్రామస్థుల సాధారణ జీవితము కంటె చాలా ఎక్కువ ఆడంబరంగా జీవిస్తూన్నవారూ, తాము నిర్వహించ వలసిన పనిని గూర్చి తగినంత జ్ఞానము లేనివారూ, గ్రామస్థుల కెంత మాత్రము నచ్చరు.

ఈ మాటలు నేను వ్రాస్తూన్నప్పుడు, శీలము, నిరాడం బర జీవితమూ లేని కార్యకర్తలు ఉద్యమాన్ని పాడుచేసిన

సందర్భాలూ, వారి పేరులుకూడా నాకుజ్ఞాపకం వస్తూన్నవి. అయితే ఒకందుకు సంతోషం. కేవలం దుష్టప్రవర్తకులుగా నున్న సందర్భాలు చాలా తక్కువ. అయితే గుణవంతులయిన కార్యకర్తలు గ్రామస్థాయిలో జీవితము గడుపుకోలేని కారణం చేత ఉద్యమాభివృద్ధికి గొప్ప ఆటంకం కలుగుతూన్నది. అటువంటి కార్యకర్తలలో ప్రతిఒక్కరూ తాను చేసేపనికి తగిన ప్రతిఫలం కోరేయెడల గ్రామాలు భరించలేవు. కాబట్టి ఈ సంస్థను మూసివేయడమే పర్యవసానంగా పరిణమిస్తుంది. ఎవోకొద్ది తాత్కాలిక సందర్భాలలో తప్ప నగర స్థాయిలో జీతాలు కావలయునని పట్టు పట్టడం, నగరాలకు, గ్రామాలకూ మధ్యనున్న అగడ్తకు సేతువును నిర్మించడం సాధ్యం కాని పని అని సూచించడమే అవుతుంది. గ్రామ ఉద్యమం గ్రామస్థుల కెంత విజ్ఞానప్రదముగా ఉంటుందో నగరవాసులకు కూడా అంత విజ్ఞానదాయకంగా ఉంటుంది. నగరాల నుండి వచ్చిన కార్యకర్తలు గ్రామీణ చిత్తవృత్తిని అలవఱచుకొని గ్రామస్థుల వలె జీవించ గలిగిన కౌశల్యమును నేర్చుకోవాలి. అంటే గ్రామస్థులవలె పస్తులు పడుకోమని అర్థం కాదు. పూర్వ జీవిత పద్ధతిలో ప్రధానమైన మార్పు ఉండవలయునని మాత్రమే దాని అర్థం. గ్రామాలలోని జీవిత ప్రమాణం హెచ్చుకావాలి, నగర జీవితప్రమాణంలో తగినంత మార్పు రావాలి. కాని కార్యకర్త ఆరోగ్యమునకు భంగం కలిగే జీవిత విధానము ననుసరించ వలసినదిగా అతనిని కోర కూడదు.

హరిజన్, 11-4-'36.

## గ్రామ కార్యకర్తల శిక్షణాలయంలోని విద్యార్థులతో సంభాషణ

మీ దృష్టిలో ఉంచుకోవలసిన జీవితము యొక్కయు, పని యొక్కయు ఆదర్శమును గూర్చి దానికొఱకవలంబించ వలసిన పద్ధతిని గూర్చి నేను మీతో ముచ్చటించ దలచు కొన్నాను.

మీరు కేవలం నేటి అర్థంలో వ్యవహరింపబడుతూన్న "వృత్తి"కోసం ఇక్కడ చేరలేదు. నేడు మనిషి యొక్క విలువ రూపాయలు, అణాలు, పైసలలో లెక్కింపబడు తూన్నది. వాని విద్యా ప్రావీణ్యం వాణిజ్య వస్తువుగా భావింపబడుతూన్నది. మీరా కొలబద్దనే మనస్సులో పెట్టు కొని ఇక్కడకు వచ్చియున్న యెడల మీకాశాభంగం కలిగే మాట వాస్తవం. ఇక్కడ మీ శిక్షణ పూర్తియైన పిమ్మట మీరు పది రూపాయల గౌరవ వేతనముతో ప్రారంభించి దానితోనే చివరదాకా పనిచేయాలి. ఒక పెద్ద కంపెనీ మానేజరుగానీ, ఒక ఉన్నతోద్యోగిగానీ తీసికొనే జీతంతో దానిని పోల్చి చూడకూడదు.

ప్రస్తుత ప్రమాణాలను మనం మార్చివేయాలి. మీకీ ప్రాపంచిక పదవులను మేము వాగ్దానం చేయడంలేదు. నిజా నికి మేము మిమ్ములను అటువంటి వ్యామోహాములనుండి తప్పించవలయునని కోరుతున్నాము. మీరు మీ తిండిఖర్చు ఆరు రూపాయిలతో ఇముడ్చుకోవాలని మా తలంపు. ఐ.సి.యస్. ఉద్యోగిభోజనపుఖర్చు నెలకు రు60 లు కావచ్చు.

అంతమాత్రంతో ఆయన శారీరకంగా గాని, నైతికంగా గాని, వైజ్ఞానికంగా గాని మీకన్న మిన్నగా ఉన్నాడనిగాని, ఉండగలడని గాని అర్థంకాదు. ఆయన ఎంత భోగపరాయణు డుగా జీవించినప్పటికీ ఈ అన్ని విషయాలలోనూ మీ కంటె తక్కువకూడా కావచ్చును. మీ అర్హతలను మీరు నాణె ములలో లెక్కించడంలేదు గనుకనే మీరీ సంస్థకు వచ్చారని నా ఊహ. ఏదో కొద్దిగా తీసుకొని దేశసేవ చేయడంలో మీరానందం అనుభవిస్తూన్నారు. పేరుల మారకపు వ్యాపా రంలో ఒక మనిషి వేలకొలదీ ద్రవ్యమును సంపాదిస్తూండ వచ్చును. కాని అతడు మన పనికి ఎంతమాత్రము ఉపయోగ పడడు. మన నిరుపేదల మధ్య అతడు నిలవడానికి కష్టంగా ఉంటుంది. అలాగే వాళ్ల మధ్య ఉండడానికి మనకు కష్టంగా ఉంటుంది. దేశక్షేమంకోసం మనకు ఆదర్శమూర్తులైన కష్ట జీవులు కావాలి. వారి తిండిని గురించి వారేమీ బాధ పడరు. సేవిస్తూన్న గ్రామస్థులు వారికి చేకూర్చనున్న సౌకర్యములను గూర్చి కూడా వారంతగా ఆలోచించరు. వారికి కావలసిన దానిని గూర్చి వారు దేవునిపైన భారము వేసి వారనుభవించవలసి వచ్చెడి కష్టనష్టములకు మహదా నందం పొందుతారు. ఏడులక్షల గ్రామాల శ్రేయస్సును గూర్చి విచారించవలసిన మన దేశంలో ఇది తప్పనిసరి. జీతాలు తీసుకొంటూ క్రమంగా వాని పెంపుదలకోసం, ప్రావిడెంటు ఫండులకోసం, పింఛనుల కోసం ఎదురు చూస్తూ

ఉండే సిబ్బందిని మనం భరించలేము. గ్రామస్థులను నమ్మి కంగా సేవించడములోనే అతనికి తగు సంతృప్తి ఉన్నది.

గ్రామస్థులకు కూడా ఈ ప్రమాణం వర్తిస్తుందా అని మీలో కొందఱికి అడుగవలె ననిపిస్తుంది. ఎంత మాత్రమూ వర్తించదు. ఈ ప్రతిఫలం గ్రామసేవకులమైన మనకే తప్ప మన యజమానులైన గ్రామప్రజకు కాదు. ఇన్ని సంవత్సరాలనుండీ వాళ్ల మెడలమీద యెక్కి కూర్చు న్నాము. కాబట్టి ఈనాడు మన యజమానులయినవారి స్థితి మిక్కిలి బాగుపడడానికి మనం బుద్ధిపూర్వకంగా, అంతకంత కెక్కువ పేదరికమును స్వీకరిస్తూన్నాము. వారిప్పుడు సంపా దిస్తూన్న దానికంటె ఎక్కువగా సంపాదించుకొనేటట్లు మనం ప్రయత్నం చేయాలి. గ్రామ పరిశ్రమల సంఘము యొక్క ఆదర్శమదే. నేను వర్ణించిన సేవకుల సంఖ్య క్రమ క్రమంగా పెఱుగుతూంటేనేగాని ఆ సంస్థ అభివృద్ధి పొందదు. మీ రటువంటి సేవకులయ్యెదరుగాక.

హరిజన్ 23-5-'36

## గ్రామ కార్య నిర్వాహణము

(గ్రామ కార్యకర్తల శిక్షణాలయములోని విద్యార్థులతో గాంధీజీ సంభాషణ సంగ్రహము).

ప్రశ్న: గ్రామ ప్రజలు మీ దర్శనమునకు వస్తూం టారా?

జవాబు: వస్తూంటారు కాని భయంతోను, అనుమా నంతోను వస్తూంటారు. గ్రామస్థులలోని లోపాలలో ఇవి

కూడా కొన్ని. వీటిని కూడా మనం వారిలోనుండి పాఱ ద్రోలాలి.

ప్ర: ఎట్లు?

జ: మర్యాదగానూ, క్రమక్రమంగానూ వారి ప్రేమను చూఱగొనడం ద్వారా. వారిని నిర్బంధించేటందుకు మన మక్కడకు పోతున్నామనే భయం వారికి లేకుండా చేయాలి. మనకు వారిని బలవంత పెట్టే కోరికగానీ, స్వప్రయోజనోద్దేశం కానీ లేదని మన ప్రవర్తనద్వారా వారికి తెలియచేయాలి. అయితే ఇదంతా సహనంతో జఱుగవలసిన పని. మీ సదుద్దేశాలను గూర్చి వారికి వెంటనే నమ్మకం కలిగించలేరు.

ప్ర: ఏ విధమైన ప్రతిఫలమూ లేకుండా పనిచేసే వారు మాత్రమే అనగా ఒక సంఘమునుండిగానీ, గ్రామం నుండి కానీ యేమీ తీసుకోనివారు మాత్రమే వారికి నమ్మకం కలిగించగలరని మీరనుకోవడం లేదా?

జ: అనుకోను. ఎవరు ప్రతిఫలం కోసం పనిచేస్తూన్నారో, ఎవరు ప్రతిఫలం లేకుండా పనిచేస్తూన్నారో కూడా వారికి తెలియదు. మనం జీవించే పద్ధతి, మన అలవాట్లు, మన సంభాషణలు, మన హావభావాలు వారి నెక్కువగా ఆకర్షించగలవు. మనమేదో సంపాదించుకోవడానికి వచ్చామని అనుమానించేవారు కూడా కొద్దిమంది ఉండవచ్చును. వారి అనుమానాన్ని మనం నిర్మూలించవలసిన అవసరమున్న మాట వాస్తవమే. ఇక సంఘంనుండి గానీ గ్రామము

నుండికానీ ఏమీ స్వీకరించనంత మాత్రంతో ఆయన ఒక్కడే ఆదర్శసేవకుడనే అభిప్రాయంతో మాత్రం వెళ్లకండి. ఆయన తఱచుగా మనిషిని పతితునిగా చేసే స్వీయగుణాహంకారానికి బలి అవుతూంటాడు.

ప్ర: మీరు మాకు గ్రామ పరిశ్రమలను నేర్పుతున్నారు. ఇది మా జీవనభృతిని సంపాదించుకోవడానికా, గ్రామస్థులకు నేర్పేటందుకా? గ్రామస్థులకు నేర్పేటందుకైతే, ఒక్క యేడాదిలో మే మా పనిలో ప్రవీణులము కాగలమా?

జ: మీకు సాధారణ పరిశ్రమలు మాత్రమే నేర్పబడుతూన్నవి. ఎందుకంటే మీకు ముఖ్యసూత్రాలు తెలిస్తేనే తప్ప ప్రజలకు మీరు సూచనలిచ్చి సహాయం చేయజాలరు. మీ అందఱిలోకీ ఎక్కువ సాహసం కలవారు ఏదో ఒక పరిశ్రమను అవలంబించి జీవించగలిగిన మాట కూడా నిజమే. మే మిక్కడ మీకు నేర్పుతూన్న విషయాలు గ్రామస్థులకు వాటిలో ఎక్కువ జ్ఞానం కలిగేటట్లు చేయడానికి తగి ఉన్నవి. చేతి తిరుగళ్లను, బియ్యంచేసే చేతిమరలను, నూనె గానుగలను మేము అభివృద్ధి చేశాము. మన పనిముట్లను అభివృద్ధి చేయడానికి మనము కొన్ని ప్రయోగాలు చేస్తున్నాము. ఆ అభివృద్ధి అయిన పనిముట్లను మనము వారికడకు కొనిపోవలసియున్నది. వీటన్నిటినీ మించి, వ్యాపారంలో న్యాయము సత్యము ఉండవలెనని మనం వారికి బోధించాలి. వారు

పాలు కల్తీచేస్తారు. నూనె కల్తీచేస్తారు. చిల్లర లాభాల కోసం సత్యాన్ని కలుషితం చేస్తారు. అది వారి తప్పిదం కాదు. మనది. మనం వారి నింతవఱకు అశ్రద్ధ చేశాము. స్వార్థం కోసం వినియోగించుకొన్నాము. ఎన్నడూ మంచి సంగతులు వారికి చెప్పలేదు. వారితో సన్నిహిత సంబంధము కలిగించుకొన్నందువలన వారిని తేలికగా సరియైన మార్గంలో పెట్టవచ్చును. చిరకాలం అశ్రద్ధచేయబడి వేఱుగా ఉన్నందున వారి బుద్ధి, నైతిక జ్ఞానమూకూడా మందగించినవి. వారిని ఉత్తేజింపజేసి సరియైన మార్గంలోకి మఱలించాలి.

హారిజన్ 25-7-'36

## ఒక గ్రామస్థుని ప్రశ్నలు

శాంతినికేతనంలో నివసిస్తూన్న "వీరభూమిలోని పేద గ్రామీణుడు" దీనబంధు ఆండ్రూస్ ద్వారా నాకీ దిగువ ప్రశ్నలను పంపుతున్నాడు :

1. పూజనీయమైన తమ అభిప్రాయంలో ఆదర్శప్రాయమైన గ్రామ మనగా నేమిటి? ఇండియాలోని ప్రస్తుత సాంఘిక రాజకీయ పరిస్థితులలో 'ఆదర్శగ్రామ' మనే సిద్ధాంతంతో గ్రామ పునర్నిర్మాణం ఎంతవఱకు ఆచరణయోగ్యము కాగలదు?

2. కార్యకర్త మొట్టమొదటగా పరిష్కరింప ప్రయత్నించవలసిన గ్రామ సమస్యలేవి? అతడు ఏవిధంగా నడచుకోవాలి?

3. చిన్న స్థాయిలో, మ్యూజియములు, గ్రామ ప్రదర్శనములు యే ప్రత్యేక విషయమునుగూర్చి యేర్పాటుచేయ్యాలి?

గ్రామ పునర్నిర్మాణం నిమిత్తం ఆ ప్రదర్శనములను అత్యంత లాభదాయకములుగా ఎలా వినియోగించుకోవాలి ?

1. స్వచ్ఛమైన పరిశుభ్రతకు అనుకూలంగా ఉండేటట్లు ఆదర్శగ్రామం నిర్మించబడాలి. చుట్టూ ఐదుమైళ్ళ దూరంలో దొరికే సామానులతో కట్టబడి తగినంత వెలుతురూ, గాలీ గల కుటీరములతో ఉండాలి ఆ గ్రామం. ఆ కుటీరాలకు తగినంత ఖాళీస్థలం ఉండాలి. అందులో గృహస్థులు తమకు కావలసిన కూరగాయలు పెట్టుకోవడానికీ, పశువులచావడి వేసుకోవడానికీ వీలుండాలి. గ్రామములోని సందులూ, వీధులూ వీలైనంత వఱకు దుమ్మూ దుమారం లేకుండా ఉండాలి. గ్రామముయొక్క అవసరాలను బట్టి అందుబాటులో నూతులు ఉండాలి. గ్రామంలోని అందఱికీ పూజామందిరాలు ఉండాలి. గ్రామస్థుల సమావేశములకు తగిన స్థలముండాలి. గ్రామాలలోని పశువుల మేతకు ఉమ్మడి బీళ్లుండాలి. ఒక సహకార క్షీరోత్పత్తి సంఘము, పారిశ్రామిక విద్య ప్రధానంగా గల ఒక ప్రాథమిక పాఠశాల, ఒక ఉన్నత పాఠశాల ఉండాలి. వివాదాలను పరిష్కరించేటందుకు పంచాయతీలు ఉండాలి. గ్రామానికి కావలసిన గింజలు, కూరలు, పండ్లు, ఖాదీ కూడా గ్రామంలోనే ఉత్పత్తి చేసుకోవాలి. స్థూలంగా, ఆదర్శ గ్రామమును గూర్చిన నా అభిప్రాయమిది. ప్రస్తుత పరిస్థితులలో ఇప్పుడున్న కుటీరాలను కొద్దిగా అభివృద్ధి చేస్తే చాలు. ఒక మంచి జమీందారు సహాయంగానీ, లేక ప్రజలలో సహకారంగానీ

ఉంటే ఆదర్శ కుటీర నిర్మాణములు తప్ప తక్కిన కార్యక్రమ మంతా ప్రభుత్వ సహాయంతో నిమిత్తం లేకుండా, గ్రామస్థులయొక్క (జమీందారు లేక జమీందార్లతో సహా) శక్తికి మించని ఖర్చుతో నిర్వహించవచ్చును. అటువంటి సహాయంతో గ్రామ పునర్నిర్మాణమునకు అవకాశం ఎంతైనా ఉంది. సమిష్టి సౌకర్యం నిమిత్తం పరస్పర సహకారము, నిర్బంధంలేని శ్రమదానము లభించే యెడల గ్రామస్థులు తమ సౌఖ్యం కొఱకు యే యే పనులు నిర్వహించుకొనగలరో నే నిప్పుడు కనిపెట్టవలసి యున్నది. తెలివిగల నాయకత్వం క్రింద, వ్యక్తి ఆదాయమునుండి వేరైన గ్రామ సమిష్టి ఆదాయమును రెట్టింపు చేసుకోగలరని నాకు నమ్మకమున్నది. మన గ్రామాలలో తెలుగని సంపద ఉంది. అది అన్ని సందర్భాలలో వ్యాపారానికి ఉపయోగపడకపోవచ్చు. కాని దాదాపు ప్రతి సందర్భంలోను స్థానిక కార్యముల కుపయోగపడి తీరుతుంది. అయితే గ్రామస్థులు తమ స్థితిని బాగుచేసుకోవలెననే కోరిక యెంతమాత్రమూ లేకపోవడమే అన్నిటిలోకే అత్యంత విషాదకరమైన పరిస్థితి.

2 గ్రామ కార్యకర్త పరిష్కరించవలసిన మొట్ట మొదటి సమస్య గ్రామ పరిశుభ్రత. కార్యకర్తలందఱినీ కంగారుపెట్టే సమస్యలన్నిటిలోకీ ఆ సమస్య అత్యంత అశ్రద్ధ చేయబడినది. అది గ్రామస్థుల శారీరక స్థితిని పాడుచేయడమే గాక, రోగాలకు కూడా కారణభూత మవుతూన్నది. కార్య

కర్త బుద్ధిపూర్వకంగా పాకీ మనిషిగా మారిపోయినట్లయితే, అతడు మలమును సేకరించి ఎరువుగా చేయడం, వీధులను ఊడవడంతో తన కార్యక్రమాన్ని ప్రారంభిస్తాడు. అతడు, గ్రామస్థులు తమ కాలకృత్యములను ఎక్కడ, ఏ విధంగా తీర్చుకోవలెనో చెప్పి, పరిశుభ్రతయొక్క విలువను బోధించి దానిని అశ్రద్ధచేసినందున కలుగుతూన్న అపాయములను వివరిస్తాడు. గ్రామస్థులు తనమాట విన్నా వినకపోయినా కార్యకర్త తన పని తాను చేస్తూనే ఉంటాడు.

3 గ్రామ ప్రదర్శనశాలలలో రాట్నం కేంద్ర విషయంగా ఉండాలి. ఆయా ప్రదేశములకు తగిన పరిశ్రమలు దాని చుట్టూ పరిభ్రమిస్తూ ఉండాలి. ఈ విధంగా యేర్పాటు చేయబడిన ప్రదర్శనశాల గ్రామస్థులకు నిదర్శనంగా ఉంటుంది. దానితోపాటు ఊరేగింపులు, ఉపన్యాసాలు, కరపత్రాలు కూడా ఉన్నట్లయితే అది యొక వైజ్ఞానికోత్సవంగా తయారవుతుంది.

హరిజన్, 9-1-'37.

## *మన గ్రామాలు*

పల్లెటూళ్లో ఉండి జీవనం చేయవలయునని ప్రయత్నిస్తూన్న ఒకానొక యువకుడు నాకొక జాలికరమయిన ఉత్తరం పంపినాడు. అతనికంత బాగా ఇంగ్లీషురాదు. కాబట్టి ఆయన ఉత్తరాన్ని సంగ్రహంగా ఈ క్రింద పొందుపఱుస్తున్నాను.

"మూడేళ్లనాడు నాకు 20 ఏండ్ల వయస్సులో, ఈ గ్రామానికి వచ్చాను. అంతకు పూర్వం పట్టణంలో 15 ఏండ్లు గడిపాను. నా గృహ పరిస్థితులవల్ల కళాశాలలో చదువుకోవడానికి నాకు వీలులేక పోయింది. గ్రామ పునరుద్ధరణమును గూర్చి మీరు చేస్తూన్న పని గ్రామ జీవితమునకు నన్ను ప్రోత్సహించినది. నాకు కొంత భూమి కూడా ఉంది. మా గ్రామంలోని జనసంఖ్య 2,500. గ్రామంతో నాకు కలిగిన సంబంధం వలన, అక్కడి ప్రజలలో ముప్పాతిక మందికి ఈ దిగువ గుణాలు ఉన్నట్లు నాకు బోధపడుతూన్నది.

(1) పాక్షిక భావాలు, తగవులు
(2) అసూయ
(3) అక్షర జ్ఞాన శూన్యత
(4) దౌష్ట్యం
(5) అనైకమత్యము
(6) అశ్రద్ధ
(7) మర్యాదైన నడవడి లేకపోవడం
(8) అర్థంలేని పురాతనాచారములను పట్టుకొని వ్రేలాడడం
(9) క్రూరత్వము

ఇది ఒక మారుమూల ప్రదేశం. ఇంత దూరగ్రామాలను ఏ గొప్ప వ్యక్తీ ఎప్పుడు చూడలేదు. అభివృద్ధికి గొప్పవారి సహవాసం ముఖ్యం. కాబట్టి ఈ గ్రామంలో ఉండడమంటే నాకు భయంగా ఉంది. నేనీ ఊరు విడిచిపోనా ? లేకపోతే మీ సలహా ఏమిటి ?

ఈ యువకుడు వ్రాసిన దానిలో కొంత అతిశయోక్తి ఉన్న మాట వాస్తవం. ఐనప్పటికీ ఆయన వ్రాసినది

సాధారణంగా అంగీకరించవచ్చును. ఇటువంటి విషాద పరిస్థితికి కారణం అంతదూరం ఆలోచించ నక్కరలేదు. గ్రామాలు చాలా కాలమునుండి విద్యావంతులయినవారి అశ్రద్ధవలన కష్టాల పాలవుతూన్నవి. వారు నగర జీవితాన్ని వరించారు. సేవాభావంతో ఉత్తేజితులైనవారు గ్రామాలలో కాపురముండి గ్రామస్థుల సేవలో స్వయం ప్రకాశమానులై, వారితో క్షేమకరమైన సంబంధం కలిగి వ్యవహరించేటందుకు చేసే ప్రయత్నమే గ్రామోద్యమం. ఈ విలేఖకుడు కనిపెట్టిన లోపాలు గ్రామ జీవితంలో స్వతస్సిద్ధమైనవి కావు. సేవాభావంతో గ్రామాలలో కాపురం పెట్టినవారు వారి నెదుర్కొనే ఈ చిక్కులకు కంగారు పడరు. తాము గ్రామాలకు పోయేముందే అక్కడ అనేక కష్టాల నెదుర్కోవలసి వస్తుందని వారికి తెలుసు. పైగా గ్రామస్థులు చీటికీ మాటికీ చిరాకు పడుతూంటారు. దానిని కూడా వారు సహించవలసి ఉంటుంది. కాబట్టి తమలోను, తాము నిర్వహించవలసిన పనిలోనూ విశ్వాసం కలవారే గ్రామస్థులలో పనిచేసి వారి జీవితములలో మార్పు తీసుకొని రాగలరు. అటువంటి జనులమధ్య ఆదర్శ జీవితం గడపడం ఒక ప్రత్యేక పాఠంగా ఉండి, దాని ప్రభావం పరిసర ప్రదేశాల మీద కలుగజేసేదిగా ఉంటుంది. బహుశా ఈ యువకుడు సేవ చేయవలయుననే భావంలేకుండా కేవలం బ్రతుకు తెరువు కోసం పోయి ఉంటాడా గ్రామం. అదీ వచ్చినచిక్కు.

ధన సంపాదనకోసం పోయేవాండ్లకు గ్రామ జీవితం ఆకర్ష వంతంగా ఉండదనే సంగతి నే నంగీకరిస్తాను. సేవ చేయ వలయుననే ఉత్సాహం లేకపోతే, కొత్తదనం పోయి పాత పడడంతోటే గ్రామజీవితం విసుగుగా ఉంటుంది. గ్రామా నికి పోయిన యువకుడెవ్వడూ ఒక చిన్న చిక్కు కనిపించడం తోనే తన ప్రయత్నం మానివేసి రాకూడదు. సహనంతో పనిచేయడం వలన, గ్రామస్థులకు నగరవాసులకు విశేషభేదం లేదనీ, గ్రామవాసులు కూడా, దయకు దయా, శ్రద్ధకు శ్రద్ధా చూపగలరనీ అర్థమవుతుంది. దేశంలో గొప్పవాళ్లతో సన్నిహితత్వం కలిగే సావకాశం గ్రామాలలో ఉండేవారికి కలుగదన్నమాట వాస్తవమే. గ్రామీణ చిత్తవృత్తి అభి వృద్ధి అయిన కొలదీ నాయకులు గ్రామాలలో సంచారం చేసి వారితో నిత్య సంబంధం కలిగి ఉండడం అవసరమని గ్రహించగలరు. అంతేకాక, చైతన్యుడు, రామకృష్ణుడు, తులసీదాసు, కబీరు, నానక్, దాదు, తుకారాం, తిరువా ళ్లారు వంటి మహాభక్తుల యొక్కయు ఇంకను వారితో సమానులయిన అనేకమంది సుప్రసిద్ధ తత్త్వవేత్తల యొక్కయు గ్రంథములద్వారా గొప్ప సజ్జనసాహచర్యం లభిస్తుంది. నిత్య సత్య విషయాస్వాదనకు మనస్సును మేళవించడంలోనే కష్ట మంతా ఉన్నది. రాజకీయ, సాంఘిక ఆర్థిక వైజ్ఞానిక శాస్త్రములలోని ఆధునిక భావములు కావలసియున్నయెడల ఆ కౌతూహలమును సంతృప్తిపఱచగల గ్రంథములను సంపా

దించుకోవచ్చును. మత గ్రంథములు లభించినంత తేలికగా తదితర గ్రంథములు లభించవని నే నంగీకరిస్తాను. మత ప్రవక్తలు ప్రజాసామాన్యము కొఱకు మాట్లాడారు, వ్రాశారు. ప్రజాసామాన్యమునకు ఆమోదకరమైన పద్ధతిలో ఆధునిక భావాలను అనువదించడం ఇంకా బాగా ప్రచారం లోకి రాలేదు. కాని అదికూడా కాలక్రమేణా రావాలి. కాబట్టి నా విలేఖకునివంటి యువకులు కేవలం నిరుత్సాహ పడక పట్టుదలతో పనిచేసి తమ ఉనికి వలన గ్రామాలను మఱింత సౌందర్యంగాను, వాసయోగ్యంగానూ చేయవలయు నని నా సలహా. గ్రామస్థులకు ఆమోదకరమైన పద్ధతిని వారు పనిచేయాలి. స్వయంకృషి వలన గ్రామములను పరిశుభ్రం చేయడంతోనూ శక్తివంచన లేకుండా నిరక్షరాస్యతను నిర్మూలనం చేయడంతోనూ గ్రామకార్యకర్త ప్రారంభం చేయాలి. కార్యకర్తలు పరిశుద్ధ జీవితములు కలిగి, ఒక నిర్దిష్టవిధానం ప్రకారం శ్రమించి పనిచేసినట్లయితే వారు పనిచేస్తూన్న గ్రామాలలో వారి భావాలు శీఘ్రంగా వ్యాపించ గలవనేటందు కేమీా సందేహం లేదు.

హరిజన్ 20-2-'37

### కావలసిన అర్హతలు

[సత్యాగ్రహులకోసం గాంధీజీ నిర్ణయించిన అర్హతలలో ఇవి కొన్ని. ఆయన అభిప్రాయ ప్రకారం గ్రామ కార్యకర్తకూడా నిజ మైన సత్యాగ్రహి. కాబట్టి గ్రామ కార్యకర్తకు కూడా ఈ అర్హతలు వర్తించగలవని భావించవచ్చును. సం॥]

1. ఆయనకు దేవునిలో అచంచల విశ్వాసముండాలి. దేవుడే ఆయనకు కొండంత బలం.

2. సత్యాహింసలలో ఆయన మత విశ్వాసం కలిగి ఉండాలి. కనుక ఆయనకు మానవస్వభావములోని స్వతస్సిద్ధమయిన మంచితనములో నమ్మకం ఉండాలి. తన కష్టముల ద్వారా ప్రకటితములయిన సత్యానురాగముల వలన మానవునిలోని మంచితనమును ప్రబోధించేటందుకు ఆయన పూనుకోవాలి.

3. ఆయన పవిత్ర జీవితము కలిగిఉండాలి. తన ఉద్యమ విజయంకోసం ఆయన సర్వస్వము, ప్రాణంతో సహా హృదయపూర్వకంగా ధారపోసేటందుకు సంసిద్ధంగా ఉండాలి.

4. ఆయన నిత్యఖద్దరుధారియై నూలు వడుకుతూ ఉండాలి. ఇది భారతదేశంలో చాలా అవసరం.

5. ఆయన ఆలోచన నిష్కళంకంగాను, ఆయన మనస్సు నిశ్చలంగానూ ఉండేటందుకు మద్యమును గాని తదితర మత్తు పదార్థములను గానీ సేవించకూడదు.

6. అప్పుడప్పుడూ నిర్ణయింపబడే క్రమశిక్షణా నియమములను ఆయన మనఃపూర్వకంగా పాటించాలి.

ఈ అర్హతలు సమగ్రములని భావింపకూడదు. ఇవి ఉదాహరణములు మాత్రమే.

హరిజన్, 25-3-'39

## గ్రామ కార్యక్రమంలో ముఖ్యవిషయములు

గ్రామ పునర్నిర్మాణంలో గ్రామ పరిశుభ్రత చేరని యెడల మన గ్రామాలు నేటివలెనే పెంటకుప్పలుగా మిగిలి పోతవి. గ్రామ పరిశుభ్రత గ్రామ జీవితంలో ముఖ్యభాగము. అదియెంత ముఖ్యమో దానిని నిర్వహించడం అంతకష్టం. తరతరాలనుండీ ఉన్న అపరిశుభ్రతను నిర్మూలించేటందుకు బ్రహ్మాండమైన ప్రయత్నం చేయాలి. గ్రామ పరిశుభ్రతను గూర్చిన విజ్ఞానము లేనట్టేన్ని, పాకీ పనిని చక్కగా చేయలే నట్టేన్ని గ్రామ కార్యకర్త గ్రామసేవకు అర్హుడు కాజాలడు. నూతన విద్యావిధానము లేక బేసిక విద్యావిధానము లేని యెడల ఇండియాలోని లక్షలాది పిల్లలను విద్యావంతులుగా చేయడం దాదాపు అసంభవమని సాధారణంగా అందఱూ అంగీకరించవలసియున్నది. కాబట్టి గ్రామ కార్యకర్త అందులో ప్రవీణుడై తానే బేసిక విద్యకు ఉపాధ్యాయుడుగా పని చేయాలి.

బేసిక విద్యకు పిమ్మట వయోజన విద్యకూడా సహజంగా ఆచరణలోకి వస్తుంది. ఈ నూతన విద్యకు స్థావరం ఏర్పడగానే, పిల్లలే తమ తల్లిదండ్రులకు ఉపాధ్యాయులు కాగలరు. అలా అయినప్పటికీ గ్రామ కార్యకర్త వయోజన విద్యనుగూర్చి కూడా పనిచేయాలి.

స్త్రీ, పురుషుని అర్ధాంగిగా వర్ణింపబడుతూన్నది. ఆమెకు పురుషునితో సమానంగా చట్టబద్ధమైన హక్కులు

లేనంతవఱకు, మొగపిల్లవాని పుట్టుకవలన కలిగినంత ఆనందం ఆడపిల్ల జననం వలన కలుగనంతవఱకు, భారత దేశము ఒక ప్రక్క పక్షపాతరోగముతో పీడింపబడుతూన్నట్లు మనం గ్రహించాలి. స్త్రీలను అణగద్రొక్కడం అహింసను తృణీకరించడం. కాబట్టి ప్రతిగ్రామ కార్యకర్త గ్రామంలోని ప్రతి స్త్రీని తన తల్లిగానో, తోబుట్టువుగానో, కుమార్తె గానో, ఆయా సందర్భాలకు తగినట్లు గౌరవంగా చూడాలి. అటువంటి కార్యకర్తయే గ్రామ ప్రజల విశ్వాసాన్ని చూఱ గొనగలడు.

అనారోగ్యవంతులయిన జనులు స్వరాజ్యాన్ని సంపాదించగలగడం అసాధ్యం. కాబట్టి మన ప్రజల ఆరోగ్యమును గూర్చి అశ్రద్ధచేసే అపరాధమునకు మనమిక పాల్పడకూడదు. ప్రతి గ్రామ కార్యకర్తకు సాధారణ ఆరోగ్య సూత్రములు తెలిసిఉండాలి.

ఒక సామాన్యభాష లేనిదే జాతికి ఉనికియే ఉండదు. హిందీ, హిందూస్థానీ, ఉరుదు భాషలను గూర్చిన వాద ప్రతివాదములతో బాధపడే బదులు గ్రామ కార్యకర్త, హిందువులకు ముస్లిములకు కూడా తెలియదగిన 'రాష్ట్ర భాష' నేర్చుకొని ఉండాలి.

మనకు ఇంగ్లీషు మీాదనున్న మోజుతో, ప్రాదేశిక భాషలకు ద్రోహం చేస్తూన్నాము. ఈ ద్రోహానికి ప్రాయశ్చిత్తంగానైనా గ్రామ కార్యకర్త గ్రామస్థులలో వారి భాష

పైన వారికి ప్రేమకలిగేటట్లు చేయాలి. భారతదేశంలోని సర్వభాషలయందును ఆయన సమాన గౌరవం కలిగిఉండాలి. ఆయన పనిచేసే ప్రదేశంలోని ప్రాంతీయభాషను ఆయన నేర్చి ఉండాలి. అందువలన ఆయన ఆ గ్రామస్థులకు తమ భాషపైన గౌరవం కలిగించగలడు.

అయితే ఆర్థిక సమానత్వమనే గట్టి పునాదిపైన కట్టని యెడల ఈ కార్యక్రమం యావత్తు ఇసుకపైన కట్టిన భవనం వంటి దవుతుంది. ఆర్థిక సమానత్వమనగా, ప్రతివ్యక్తికీ సమానమైన భౌతికసంపద ఉండవలెనని అర్థంకాదు. కాని, ప్రతివానికీ ఉండేటందుకు తగిన ఇల్లు, తినేటందుకు చాలి నంత సముచితాహారము, కట్టుకొనేటందుకు కావలసినంత ఖాదీ ఉండవలయునని అర్థము. అంతేకాదు, ఈనాడున్న దురాగతమైన అసమానత్వము కేవలం అహింసాయుతంగా రూపుమాపాలని కూడా అర్థం.

హరిజన్ 18-8-'40

### *సర్వతోముఖమైన గ్రామసేవ*

నిర్మాణ కార్యకర్తల సమావేశంలో ఒక ప్రశ్నకు జవాబుగా గాంధీజీ ఇలా అన్నారు:

సమగ్ర గ్రామసేవకుడు గ్రామంలో ప్రతివ్యక్తినీ ఎఱిగియుండి వారికి తన చేతనైన సేవ చేయవలయును. ఇంత మాత్రంతో ఆ కార్యకర్త ప్రతిపనీ తానొక్కడే చేయగలడని అర్థంకాదు. గ్రామస్థుల కాయన స్వయం సహాయపద్ధతి

నలవడచేసి వారికి కావలసిన సామగ్రిని తదితర సహాయమును సంపాదించి పెడతాడు. తన సహాయకులకు తానే శిక్షణ యిచ్చి తయారు చేసుకొంటాడు. గ్రామస్థులు తమంతట తాము వచ్చి ఆయనను సలహా అడిగి దానిని అనుసరించేటంత విశ్వాసాన్ని చూఱగొంటాడాయన. నేనొక గానుగను తీసికొని గ్రామంలో కాపురం పెట్టాననుకోండి. నేను నెలకు 15-20 రూపాయిలు సంపాదించుకొనే మామూలు 'ఘంచీ'ని (తెలుకుల మనిషి) కాదు. 'మహాత్మా' ఘంచీని. 'మహాత్మా' అనే పదం నేను హాస్యంగా వాడుతున్నాను. కాని నేను చెప్పదలచుకొన్న దేమిటంటే, నేను 'ఘంచీ'గా గ్రామస్థులకు అనుసరించదగిన ఆదర్శంగా ఉంటాను. 'గీత'ను 'ఖురాను'ను తెలిసిన ఘంచీగా ఉంటాను. గ్రామస్థుల పిల్లలకు బోధించజాలిన విద్యావంతుడుగా ఉంటాను. తగినంత వ్యవధి లేనందున నేనీ అన్నిపనులు నిర్వహింపచాలకపోవచ్చును. అప్పుడు గ్రామస్థులు నాదగ్గఱకు వచ్చి "దయచేసి మా పిల్లల చదువుకేదైనా యేర్పాటు చేయండి" అని నన్నడుగుతారు. అప్పుడు నేనొక ఉపాధ్యాయుణ్ని చూపిస్తాను. ఆయన ఖర్చులు మీరు భరించాలి" అంటాను. అప్పుడు వారందుకు మిక్కిలి హృదయపూర్వకంగా ఒప్పుకుంటారు. వారికి నూలు వడకడం నేర్పుతాను. వారు నా కడకువచ్చి నేతమనిషి కావలయునని అడిగినప్పుడు వారికి, ఉపాధ్యాయుణ్ని కుదిర్చిన షరతులతోనే నేత మనిషి కూడా కుదిర్చి పెడతాను. నేతమనిషి వారికి వారి బట్టలు నేసుకోవడం

నేర్పుతాడు. ఆరోగ్యశాస్త్రము యొక్కయు పరిశుభ్రత యొక్కయు ప్రాముఖ్యతను గూర్చి వారికి నచ్చచెబుతాను. వారు నా కడకు వచ్చి ఊడ్చేటందుకు మనిషి కావలెనని కోరే యెడల "నేనే మీ కాపని చేసిపెట్టి మిమ్ములనందులో ఉత్తీర్ణులను చేస్తానని చెబుతాను" ఇదే సమగ్ర గ్రామసేవకు సంబంధించిన నా భావం.

హరిజన్, 17-3-'46.

*గ్రామ కక్షలు*

ప్ర. దాదాపు అన్ని గ్రామాలలోను ముఠాలు, కక్షలు ఉన్నవి. స్థానిక సహాయం మనం కోరగానే, మనకు ఇష్టమున్నా లేకపోయినా, స్థానికమైన పెత్తనదారీ రాజకీయాలలో చిక్కుకొంటాము. ఈ చిక్కునుండి తప్పుకొని బయట పడడమెలా? ఇరుకక్షుల వారినీ పలకరించకుండానే బయటి కార్యకర్తల సహాయంతో మనం పని చేసుకొని పోవలెనా? అటువంటి పని కేవలం బయటి సహాయంపైన ఆధారపడి ఉండడంచేత ఆ సహాయం పోవడంతోనే ఆ పని కూడా కూలిపోతుందని మా అనుభవం. కాబట్టి స్థానికారంభమును స్థానిక సహకారమును ప్రోత్సహించేటందుకు మేమేమి చేయవలయును?

జ. దురదృష్టవశాత్తు భారతదేశంలో నగరాలలో ఉన్నట్లే గ్రామాలలో కూడా పఠాలూ, కక్షలూ కనిపిస్తూ న్నవి. గ్రామాలలోకి అధికార రాజకీయాలు ప్రవేశించి గ్రామాల క్షేమమును గూర్చిన ఆలోచనకంటె ఎక్కువగా,

వాటిని తమ తమ పక్షాల అధికారాన్ని పెంపొందించుకొనే టందుకు ఉపయోగించుకోవడం వలన, గ్రామస్థుల అభివృద్ధికి సహాయపడడానికి బదులుగా ఆటంకానికి ఎక్కువ హేతువవు తూన్నవి. ఏమి జరిగినప్పటికీ గ్రామస్థుల సహకారాన్ని సాధ్యమైనంతవఱకు ఉపయోగించుకోవాలి. అధికార రాజ కీయాల కళంకం మనకు అంటకుండా ఉన్నంతవఱకు మనం తప్పటడుగు వేసే అవకాశం లేదు. భారత దేశంలోని విద్యా వంతులయిన నాగరిక స్త్రీ పురుషులు, దేశానికి వెన్నెముకగా నున్న మన గ్రామాలను అపరాధంగా పరిణమించేటంత అశ్రద్ధచేశారనే విషయం మనం జ్ఞాపకం పెట్టుకోవాలి. మనం చేసిన అశ్రద్ధను మనం జ్ఞాపకం చేసుకోవడానికి ఓర్పు కావాలి. నిజాయితీగల కార్యకర్త లేని గ్రామం ఒకటి కూడా నేను ఎప్పుడూ చూడలేదు. మన గ్రామాలలోని సుగుణాన్ని మనం గ్రహించగలిగిన వినయసంపత్తి మనలో ఉంటేనేగాని ఆయన మనకు లభించడు. స్థానిక రాజకీయాల నుండి మనం దూరంగా ఉండవలసిన మాట నిజమే. వాస్త వంగా ఎక్కడ ఏది మంచిదో గ్రహించి ఆ ప్రకారం అన్ని పక్షాలనుండీ సహాయం పొందడం కానీ పొందకపోవడంకానీ చేయగలిగినప్పుడే, మన కా పని సాధ్యమవుతుంది. గ్రామస్థు లతో నిమిత్తం లేకుండా ఉండడం విజయానికి విఘాతమని నా అభిప్రాయం. ఈ చిక్కు నాకు తెలిసిఉండబట్టే, 'ఒక గ్రామం, ఒక కార్యకర్తా' అనే నియమాన్ని గట్టిగా అమలు పఱచేటందుకు ప్రయత్నించాను. కాని బెంగాలీ (ప్రాంతీయ

భాష) తెలియని కార్యకర్త ఉన్నచోట్ల వాని కొక దుబాసీని తోడు పంపాను. ఈ పద్ధతి ఇంతవఱకు మన పనికి ఉపయోగ కరంగా ఉన్నదనిమాత్రం నేను చెప్పగలను. కాబట్టి మీ అనుభవానికి నేను తగినంత విలువ ఈయను. పైగా తొందర పడి తప్పు నిర్ణయాలకు వచ్చే దురభ్యాసంకూడా మనలో ఉన్నదని నేను సూచిస్తూన్నాను. "ఆ పని కేవలం బయటి సహాయంపైన ఆధారపడి ఉండడంచేత, ఆ సహాయంపోవడం తోనే ఆ పనికూడా కూలిపోతుంది" అనే వాక్యంలో ఇమిడి ఉన్న నిందాపూర్వకమైన సాధారణ నిర్ణయానికి వచ్చే ముందు, ఒకే గ్రామంలో కొద్ది సంవత్సరాలపాటు ఉండి స్థానిక కార్యకర్తల ద్వారా పనిచేయడానికి ప్రయత్నించి సంపాదించిన అనుభవమునుబట్టి స్థానిక కార్యకర్తలవల్ల పని జరుగ వీలులేదని గట్టిగా ఋజువయినట్లు భావింపరాదని కూడా నేను చెప్పవలసివస్తుంది. పైగా సత్యం అందుకు ప్రతికూలంగా కనిపిస్తూన్నది. ఆ చివరి వాక్యాన్ని ఇంకా వివరంగా ఇప్పుడు చర్చించడం నా కనవసరమనితోస్తూన్నది. ప్రధాన కార్యకర్తకు నేను స్పష్టంగా చెప్పగలిగినదిది: "మీకు బయటిసహాయ మేమయినావస్తే దానిని వదులు కోండి. మీరు పొందగలిగిన స్థానికసహాయ మంతటితో, ఒంటరిగా, ధైర్యంగా, తెలివిగా పనిచేయండి. మీరు విజయం పొందకపోతే మిమ్ములను మీరే నిందించుకోవలెను గాని, మఱి ఎవ్వరినీ, దేనినీ, నిందించకండి."

హరిజన్, 2-3-'47.

---

# 13

# విద్యార్థులు, గ్రామాలు

వయస్సు వచ్చిన విద్యార్థులు, కళాశాలా విద్యార్థులంతా తమ విద్యార్థి దశలోకూడా గ్రామ కార్యములను నిర్వహిస్తూండవలెను.

విద్యార్థులు తమ సెలవులను పూర్తిగా గ్రామసేవలో వినియోగించవలెను. ఇందుకోసం వారు కేవలం కాని త్రోవలను పోవడం కంటె తమ సంస్థలకు సమీపంలో నున్న గ్రామాలకు పోయి ఆయా గ్రామస్థుల పరిస్థితులను పరిశీలించి వారితో స్నేహం చేసుకోవలయును. ఈ అభ్యాసంవలన గ్రామస్థులతో విద్యార్థులకు పరిచయ మేర్పడుతుంది. అందుచేత విద్యార్థులు నిజంగా వారిమధ్య నివసించడానికి పోయినప్పుడు గ్రామస్థులు వారితో అప్పుడప్పుడూ గలిగిన పూర్వపరిచయం వలన, వారిని అనుమానంతో పరాయివారుగా చూడక మిత్రులవలె ఆహ్వానిస్తారు. పెద్ద పెద్ద సెలవులు వచ్చినపుడు విద్యార్థులు గ్రామాలలో ఉండి వయోజనులకు తరగతు లేర్పాటుచేసి గ్రామస్థులకు ఆరోగ్యసూత్రములను బోధిస్తూ, సాధారణమైన జబ్బులకు చికిత్స కూడా చేస్తూ ఉండాలి. గ్రామస్థులలో రాట్నమును ప్రవేశపెట్టి వారికి ప్రతి విశ్రాంతి నిమిషమూ మెలా వినియోగించాలో చెప్పాలి. ఈ పనులు జరుగవలెనంటే విద్యార్థులు ఉపాధ్యాయులు కూడా తమ సెలవురోజులను వినియోగించుటను గూర్చిన పూర్వాభిప్రాయాలను మార్చుకోవాలి. ఆలోచనలేని ఉపాధ్యాయులు

తఱచుగా సెలవు దినములలో విద్యార్థులకు పాఠాలు నిర్ణయి స్తారు. ఇది ఎప్పటికీ దురభ్యాసమని నా అభిప్రాయం. సెలవు దినములలో విద్యార్థుల మనస్సులు మామూలు పనిలో నిమగ్నం గాకుండా స్వేచ్ఛగా ఉండాలి. అప్పుడు వారు స్వయంసహాయమునకు, సమాజాభివృద్ధికీ పాటుపడడానికి సావ కాశం ఉంటుంది. నేను సూచించిన గ్రామకార్యక్రమము అత్యుత్తమమైన కాలక్షేపము సులభమైన శిక్షణమూ కూడా అవుతుంది. చదువు పూర్తియయిన పిమ్మట పూర్తిగా గ్రామ సేవలో మునిగిపోవడాని కింతకన్న చేయతగిన ఉత్తమమయిన కృషి మఱొకటి లేదు.

సంపూర్ణ గ్రామసేవా ప్రణాళికనుగూర్చి ఇప్పుడు విస్త రించి చెప్పనక్కరలేదు. సెలవులలో చేసినది శాశ్వతంగా నిలచి ఉండే పద్ధతిని చేయడమే ఇప్పటి కార్యక్రమం. గ్రామస్థులుకూడా ఇప్పటికంటె ఎక్కువ బాధ్యత వహించవలసి ఉంటుంది. గ్రామజీవితమునుగూర్చి సర్వతోముఖంగా అనగా, ఆర్థిక, ఆరోగ్యరక్షక, సాంఘిక, రాజకీయవిషయా లన్నిం టికీ సంబంధించి పనిచేయాలి. అత్యధికసంఖ్యాకులకు సంబం ధించినంతవఱకు ఆర్థిక సమస్యయొక్క తక్షణ పరిష్కారము నకు రాట్నము తప్ప గత్యంతరం లేదనేమాట వాస్తవం. అది గ్రామస్థులకు కొంత అదనపు ఆదాయమును కల్పించడమే గాక వారి అనవసరపు జోక్యాలకు పోకుండాకూడా కాపాడు తుంది. ఆరోగ్య రక్షణలో, అపరిశుభ్రతనుండీ, రోగముల నుండీ తప్పించుకోవడం ఇమిడి ఉంది. ఈ సందర్భంలో

మలమూత్రములను చెత్త చెదారమును పూడ్చేటందుకు గోతులు త్రవ్వి, ఎఱువు తయారుచేయడానికి, నూతులను, చెఱువులను శుభ్రం చేయడానికీ, చిన్న చిన్న కట్టలు వేయడానికీ, పెంటపోగు లెత్తడానికీ గ్రామాలను సామాన్యంగా వాసయోగ్యములుగా చేయడానికి విద్యార్థులు శరీరశ్రమ చేయవలసి ఉంటుంది. గ్రామకార్యకర్త సాంఘిక విషయాలలో కూడా జోక్యం పెట్టుకోవలసి ఉంటుంది. అతడు అంటరానితనము, బాల్య వివాహములు, అసమ దాంపత్యములు, త్రాగుడు, మత్తుపదార్థసేవనము వంటి దురాచారములను, దురభ్యాసములను, స్థానిక మూఢవిశ్వాసములను మానుకొనేటట్లు గ్రామస్థులకు నెమ్మదిగా నచ్చచెప్పాలి. రాజకీయ వ్యవహారం చిట్టచివరి విషయం. ఇక గ్రామస్థుల రాజకీయ కష్టములను పరిశీలించి, స్వాతంత్ర్యము, స్వయంసంపూర్ణత, స్వయంసహాయముల ఉత్కర్షతనుగూర్చి వారికి బోధించాలి. ఇదే వయోజనవిద్యయొక్క పరిపూర్ణత్వమని నా అభిప్రాయము. ఇంతమాత్రముతో గ్రామకార్యకర్త పని పూర్తియైనట్లు కాదు. చిన్నపిల్లలను దగ్గరకు చేర్చి వారిని జాగ్రత్తగా చూస్తూ చదువు చెప్పాలి. పెద్దవారికి రాత్రి పాఠశాల పెట్టాలి. భాషకు సంబంధించిన ఈ చదువు సమగ్ర విద్యావిధానంలో ఒక భాగం మాత్రమే. ఇది పైన వివరింపబడిన పెద్దకార్యక్రమమునకు ఆధారంగా ఉంటుంది.

ఈ సేవావిధానానికి కావలసిన సామగ్రి, విశాల హృదయమూ, అనుమానరహితమైన శీలమూ అని నా అభి

ప్రాయము. ఈ రెండూ ఉంటే తక్కిన యోగ్యతలు వాటంతటవే వస్తయి.

చిట్టచివరి విషయం తిండి సంగతి. కష్టంచేసేవాడు తనకు వచ్చే ప్రతిఫలానికి తగిఉంటాడు. జీవనభృతికి లోటు ఉండదు. అంతకు మించి ఈయడానికందులో డబ్బులేదు. దేశసేవ స్వయంసేవ రెండూ జరగడం సాధ్యం కాదు. స్వయంసేవ దేశసేవ వలన కఠినంగా పరిమితం చేయబడినది. కాబట్టి కేవలం పేదరికంలో ఉన్న ఈ దేశపుశక్తిని మించిన జీవితము గడిపేటందుకు వీలులేదు.

యంగిండియా, 26-12-'29



# స్త్రీలు-గ్రామాలు

*బాల్యవివాహములను గూర్చి గాంధీజీ :*

నిరాకరించే హక్కునూ, కర్తవ్యమునూ గ్రహింప చేసేటందుకు తల్లులకు శిక్షణ ఈయవలసి ఉంటుంది. ఇది ఎవరు ఈయగలరు స్త్రీలు తప్ప? కాబట్టి అఖిల భారత మహిళాసభవారు తమ పేరుకు తగినట్లుగా గ్రామాలకు పోవలయునని నేను ధైర్యంగా సూచిస్తున్నాను. కరపత్రములు మంచి ఉపయోగమే. కాని అవి ఇంగ్లీషు భాష తెలిసిన కొద్దిమంది నగరవాసులకు మాత్రమే చేరుతున్నవి. గ్రామీణ స్త్రీలతో ప్రత్యక్ష పరిచయం కలిగి ఉండడం అవసరం. ఒకవేళ అటువంటి పరిచయం కలిగినప్పటికీ కూడా చేయవలసిన పని అంత తేలికయినది కాదు. కాని మనం యేదైనా ఫలితము ఆశించేముందు ఎప్పుడో ఒకప్పుడు అందుకు తగిన ప్రయత్నం ప్రారంభించవలెనుగదా! అఖిల భారత మహిళా సంఘం అఖిల భారత గ్రామపరిశ్రమల సంఘంతో ఏకీభవించి పనిచేస్తుందా? గ్రామకార్యకర్తలు, స్త్రీలుగానీ పురుషులుగానీ ఎంత సమర్థులైనా సరే కేవలం సంఘసంస్కరణ ప్రయత్నంలో గ్రామస్థుల దగ్గఱకు పోనక్కఱ లేదు. వారికి గ్రామజీవితంలోని అన్ని రంగములతో సంబంధం ఉండాలి. గ్రామ కార్యక్రమము అనగా వాస్తవిక విద్య అని మఱొకసారి చెప్పవలసి ఉంది. చదువూ, వ్రాత, లెక్కలూ నేర్చినంతమాత్రమున అది విద్యకాదు. ఆలోచనా శక్తికలవారని భావింపబడుతూన్న మానవులకు తగిన వాస్తవిక జీవితావసరములను గ్రహించేటట్లు గ్రామస్థుల మనస్సులను వికసింపచేయడమే నిజమైన విద్య.

హరిజన్, 16-11-'35

# 15
# కాంగ్రెసు - గ్రామాలు

*ప్రజాసంబంధం*

శాసనసభాసభ్యులూ తదితర కార్యకర్తలూ 1920 నాటి నిర్మాణ కార్యక్రమమును, తమ ప్రతినిధులతో సన్నిహిత సంబంధముకల మూడుకోట్ల గ్రామవాసుల కడకు, కొనిపోవలసిన అవసరమునుగూర్చి కాంగ్రెసు కార్యవర్గము విస్పష్టం చేసింది. ఈ ప్రతినిధులు తమ యిష్టానుసారం వారిని అశ్రద్ధచేయవచ్చును, లేదా వారికి చిన్నగానో పెద్దగానో సహాయం చేసి వారి ఆర్థికభారములను తగ్గించవచ్చును; కాని వారికి ఆత్మవిశ్వాసము, గౌరవము, తమ స్థితిని నిరంతరాయంగా క్రమాభివృద్ధిచేసుకొనే శక్తినీ కలిగింపజాలరు. అవి వారికి కలుగవలెనన్నయెడల, నూలువడకడం, ఖాదీ ఉత్పత్తిచేయడం, ఖాదీ ధరించడం సార్వజనీనం కావాలి; హిందూ ముస్లిం సఖ్యత, లేక సాంఘికసమైక్యత జరగాలి. త్రాగుడు కలవాటుపడినవారిలో ప్రచారంవలన సంపూర్ణ మద్యనిషేధం ఆచరణలోకి రావాలి. అంటరానితనమును హిందువులు సమూలంగా త్రెంచివేయాలి. ఈ నాలుగు విధాల నిర్మాణకార్యక్రమములో కార్యకర్తలు గ్రామస్థులకు ఉత్సాహం కలిగించవలసి ఉంది.

ఈ నాలుగు పనులు జరుగనియెడల అహింసా విధానంలో స్వరాజ్యసాధనం అసంభవమని 1920, 1921 సంవత్సరాలలో వేయి వేదికలనుండి విస్పష్టం చేయబడింది. ఈనాటికి కూడా ఆ మాటే నిజమంటున్నాను నేను.

ప్రభుత్వపు పన్నుల విధానమువలన ప్రజాసామాన్యము యొక్క ఆర్థికస్థితి అభివృద్ధి కావడం ఒక యెత్తు, కేవలం ప్రజలు తమ సొంత ప్రయత్నంవలన తమ స్థితిని బాగుచేసు కొన్నామని భావించేటట్లు చేయడం మఱొక యెత్తు. ఈ స్వయంశక్తి నూలువడకడం మొదలయిన చేతిపనులద్వారా జరుగుతుంది.

అలాగే ప్రభుత్వంవారి ఒత్తిడివలనగానీ, లేక స్వచ్ఛందంగా గానీ నాయకులమధ్య జరిగిన ఒడంబడికల ప్రకారం వివిధ మతస్థులు తమతమ ప్రవర్తనలను నియమించుకోవడం ఒక యెత్తు. సామాన్యప్రజలు వివిధ మతములనూ, మతాచారములనూ పరస్పరం గౌరవించుకోవడం మఱొక యెత్తు. ఈ రెండవ పద్ధతి మొదటి పద్ధతికి పూర్తిగా భిన్నమైనది. శాసనసభ్యులూ, కార్యకర్తలూ గ్రామస్థులకడకు పోయి పరస్పర సహనభావమును బోధిస్తేనేగాని ఇది సాధ్యంకాదు.

ఇక మద్యనిషేధాన్ని చట్టంచేసి బలవంతంగా అమలు పఱచడానికీ, బుద్ధిపూర్వకంగా మద్యనిషేధమును పాటించేటట్లు చేయడానికికూడా చాలా భేదం ఉంది. పెద్ద ఖర్చుతో గూడిన గూఢచారిదళం పనిచేస్తేనేగాని మద్యనిషేధం అమలు జరుగదనడం కేవలం తీరికగా కూర్చొని కబుర్లు చెప్పేవారి నిరాశావాదం. కార్యకర్తలు త్రాగుడు ఎక్కువగా నున్న గ్రామాలకుపోయి అందువలన కలిగే కీడులను నిదర్శనపూర్వకంగా బోధించేయెడలను, పరిశోధకశాస్త్రజ్ఞులు సారావలన కలిగే చెడుగులకు కారణములను తెలిసికొని ప్రజ

లకు తెలియచెప్పేయెడలను, మద్య నిషేధమునకు ఎక్కువ వ్యయం కాకపోగా పై పెచ్చు లాభంకూడా వస్తుంది. ఈ పని ముఖ్యంగా స్త్రీలు చేయవలసి ఉంది.

చివరకు, మనం చట్టంద్వారా అస్పృశ్యతను తొలగించివేయవచ్చును. అలా తొలగించివేయవలసిందే. కాని ప్రజలు 'నన్ను తాకవద్దు' అనే భావాన్ని తమ హృదయములనుండి తొలగించుకొంటేనేగాని మనం నిజమైన స్వాతంత్ర్యమును పొందజాలము. సామాన్య ప్రజలు తమ హృదయములనుండి అంటరానితనమును రూపుమాపుకొంటేనేగాని ఒక్క మనస్సుతో కలసిమెలసి పనిచేయజాలరు.

కనుక ఇదిన్నీ తక్కిన మూడు విషయాలున్నూ సామాన్యప్రజలు నిజముగా నేర్చుకొనవలసిన విద్య. తప్పుగానో ఒప్పుగానో మూడుకోట్లమంది ప్రజల చేతులలో అధికారం ఉంచబడింది కనుక, ఇప్పుడది ఇంకా తప్పనిసరి ఐనది. దీనికి ఎన్ని అడ్డంకులు ఉన్నప్పటికీ, ఈ మూడుకోట్ల మంది ప్రజలను సక్రమ పద్ధతులలోగానీ అక్రమపద్ధతులలోగానీ శిక్షణ ఈయవలసిన పని వీరి వోట్లనుకోరే కాంగ్రెసువాదుల చేతులలోగానీ తదితరుల చేతులలోగానీ ఉన్నది. ప్రజలకు ముఖ్యంగా సంబంధించిన విషయాలను పూర్తిగా అశ్రద్ధచేయడం కూడని పని.

హరిజన్, 15-5-'37.

## లోకసేవక సభ్యుల అర్హతలు

[కేవలం గాంధీజీ హత్య చేయబడే ముందు కాంగ్రెసు లోకసేవకసంఘములో లీనం కావలయునవే కోరికతో, ఆయన లోకసేవక సంఘమున కొక నియమావళిని వ్రాశారు. దానిలో సభ్యులుగా

ఉండేటందుకు ఇంకా ఇతర అర్హతలతోపాటు ఈ దిగువ అర్హతలు కలిగి యుండవలయునని ఆయన వ్రాశారు. సం॥]

1. ప్రతి కార్యకర్తా తాను స్వయంగా వడికిన నూలుతో తయారైనట్టిగానీ, అఖిలభారతచర్ఖా సంఘంవారి అనుమతిని పొందినట్టిగానీ ఖాదీని అలవాటుగా ధరించవలయును. పూర్తిగా మత్తుపదార్థములను త్యజించవలయును. అతడు హిందువయినట్లయితే తానుగాగానీ, తన కుటుంబంలో గానీ, యే రూపంలోనూ అస్పృశ్యతను పాటించరాదు. సాంఘిక ఐకమత్యమనే ఆదర్శంలోనూ, అన్ని మతముల యెడల సమాన గౌరవమర్యాదలు చూపడంలోను, జాతి మత లింగభేదములతో నిమిత్తంలేకుండా అందఱూ సమాన ప్రతిపత్తీ, సమానావకాశములు కలిగి యుండడంలోనూ నమ్మకం కలిగి ఉండాలి.

2. తన యాజమాన్యమున ఉన్న ప్రతి గ్రామస్థుని తోనూ అతడు ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండాలి.

3. గ్రామస్థులలోనుండి కార్యకర్తలను చేర్చి వారికి శిక్షణ ఈయాలి. అందుకొక రిజిస్టరు ఉంచాలి.

4. తాను చేసిన పనినిగూర్చిన వివరాలు వ్రాసి ఉంచాలి.

5. గ్రామాలు వ్యవసాయంవల్లను చేతిపనులవల్లను స్వయం సంపూర్ణములుగాను స్వయంపోషకములుగాను ఉండే టట్లు ఏర్పాటు చేయాలి.

6. గ్రామస్థులకు పరిశుభ్రతను గూర్చి ఆరోగ్య రక్షణను గూర్చి బోధించి అనారోగ్యమును, రోగాలను నిరోధించేటందుకు తగిన అన్ని చర్యలను తీసుకోవాలి.

7. హిందూస్థాన్ తాలిమీ సంఘంవారి విధాన ప్రకారం నయీతాలిమ్ పద్ధతులమీద జననం మొదలు మరణం వఱకు గ్రామస్థుల శిక్షణమును ఏర్పాటుచేయాలి.

హరిజన్, 15-2-'48



# 16

# ప్రభుత్వము - గ్రామాలు

## ప్రభుత్వము చేయగలిగినది

ఈనాడు అధికారంలో ఉన్న కాంగ్రెసు మంత్రులు ఖద్దరు, తదితర గ్రామ పరిశ్రమలనుగూర్చి యేమి చేయగలరు అని అడగడం న్యాయమే. ప్రత్యేకం ఇందుకొక మంత్రి నియమింపబడినా లేకపోయినా, ఇందుకొకశాఖ ఉండడం తప్పనిసరి. అన్నవస్త్రములు కొదువగానున్న ఈ రోజులలో ఈ శాఖ అత్యంతమైన సహాయం చేయగలదు. మంత్రులు అఖిల భారత చరఖాసంఘం, అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘములద్వారా ఇందుకు కావలసిన ప్రవీణులను రప్పించు కొన్నారు. యావద్భారతదేశమునకును, మిక్కిలి తక్కువ కాలంలో మిక్కిలి తక్కువ పెట్టుబడితో ఖాదీని సరఫరా చేయవచ్చును. ప్రతి రాష్ట్రప్రభుత్వము, గ్రామస్థులకు వారికి కావలసిన ఖాదీని వారే ఉత్పత్తి చేసుకొనవలయునని తెలియ చేయవలయును. ఇందువలన ఖాదీ దానంతటదే స్థానికంగా ఉత్పత్తి అయి పంపిణీ అవడంకూడా జరుగుతుంది. పైగా నగరాలకు కొంతవరకు సరఫరా చేయడానికికూడా మిగిలే మాట నిజం. అందువలన మిల్లుబట్టపైన ఒత్తిడికూడా తగ్గు తుంది. ఇక మిల్లులు ప్రపంచంలోని ఇతర దేశాలకు కావల సిన బట్టలను సరఫరా చేయడానికి వీలవుతుంది.

**ఈ ఫలితం కలిగేటందు కేమిచేయాలి?**

ఒక నిర్ణీతమైన తేదీలోగా తమ గ్రామములకు కావలసిన ఖాదీ ఆయా గ్రామస్థులే ఉత్పత్తి చేసుకోవలయుననీ, ఆ తరువాత వారికి బట్టలు సరఫరా చేయబడవనీ, ప్రభుత్వం వారొక ప్రకటన చేయాలి. ఇక ప్రభుత్వంవారు గ్రామస్థులకు కావలసిన ప్రత్తిగింజలు, ప్రత్తి, ఖాదీ ఉత్పత్తి పరికరములు, కొన్నఖరీదుకు సరఫరాచేసి ఐదేళ్లలోగాని అంతకు ఎక్కువ కాలంలోగాని తేలిక వాయిదాలలో ఆ మొత్తం వసూలు చేసుకోవాలి. అవసరమైన చోట్లకు ఖాదీపని నేర్పేవారిని పంపాలి. గ్రామస్థులు తాము ఉత్పత్తి చేసుకొన్న ఖద్దరు వలన తమ అవసరములు తీరిన పిమ్మట, మిగిలిన ఖద్దరును ప్రభుత్వం కొనేటందుకు బాధ్యత వహించాలి. ఇందువలన ఎక్కువ హడావడి లేకుండానూ ఎక్కువ ఖర్చులు పడకుండానూ కూడా బట్టకొఱత తీరుతుంది. గ్రామ పరిస్థితులను పరిశీలన చేసినపిమ్మట, కొద్ది సహాయంతోకాని సహాయం లేకుండాగానీ స్థానికంగా తయారై గ్రామస్థుల ఉపయోగమునకూ, బయట అమ్మకానికీ వీలైన వస్తువుల జాబితాను తయారుచేయాలి. ఉదాహరణంగా గానుగనూనె, తెలకపిండి, గానుగలలో తయారుచేసిన దీపపునూనె, దంపుడు బియ్యం, తాటిబెల్లం, తేనె, ఆటవస్తువులు, చాపలు, చేతితో తయారైన కాగితం, నాటు సబ్బు మొదలయినవాటి జాబితా తయారుచేయాలి. తగినంత శ్రద్ధ తీసుకొనేయెడల దాదాపు

మృతిచెందినట్టివన్నీ, మృతిచెందుతూన్నట్టివన్నీ గ్రామాలు చాలావఱకు సజీవములై తమ అవసరములను తాము చాలా వఱకు తీర్చుకోగలగడమే గాక, భారతదేశములోని, నగరముల యొక్కయు, పట్టణముల యొక్కయు అవసరములను సైతము తీర్చగల అనేకావకాశములు కలవని ఋజువు కాగలదు.

ఇక భారతదేశంలో అంతులేని పశుసంపద ఉన్నది. అది అపరాధంగా పరిగణింపబడేటంతవఱకు అశ్రద్ధ చేయబడుతూన్నది. ఇంతవఱకు తగినంత అనుభవం లేకపోయినప్పటికీ గోసేవాసంఘం అందుకు విలువగల సహాయం చేయగలదు.

బేసిక్ శిక్షణ లేకపోవడం వలన గ్రామస్థులకు విద్య శూన్యమయింది. ఈ లోపం హిందూస్థానీ తాలిమీసంఘం పూర్తి చేయగలదు.

హరిజన్, 28-4-'46



# అనుబంధము ఎ

## బ్రేన్ చేసిన గ్రామాభ్యుదయ ప్రయోగము

లాలా దేశరాజు రచించిన వ్యాసములు ఐదు భాగములుగా ప్రచురింపబడినవి. అవి పాఠకుడు జాగ్రత్తగా చదివి ఉంటాడనుకొంటాను. గూర్గాన్ జిల్లాలో డిప్యూటీ కమీషనరుగా పనిచేసిన మిస్టర్ బ్రేన్, గూర్గాన్ కార్యక్రమము అని పేరొందిన సుప్రసిద్ధ ప్రయోగమును చేసినాడు. దానిని గూర్చిన నిష్పక్షపాత విమర్శయే లాలా దేశరాజు వ్రాసిన వ్యాసముల సంపుటి అని నా అభిప్రాయము. ఆ వ్యాసములు ప్రచురింపబడుతూండిన సమయంలో మిస్టర్ బ్రేన్ వ్రాసిన "గ్రామీణ భారత పునర్నిర్మాణము" (The Remaking of Village India) అనే గ్రంథం నేను చదివాను. ఈ గ్రంథము బ్రేన్ వ్రాసిన "భారతదేశ గ్రామాభ్యుదయం" (Village uplift in India) అనే మూలగ్రంథమునకు రెండవ సంస్కరణం. లాలా దేశరాజు వ్యాసములను బట్టి ఆలోచించవలసివస్తే గ్రామ పునర్నిర్మాణమును గూర్చిన గూర్గాన్ ప్రయోగము నిజానికి అపజయం పొందినట్లే నిర్ణయించాలి. గూర్గాన్ నుండి మిస్టరు బ్రేన్ పోగానే, ఆయన ప్రోత్సాహంతోగాని, ఒత్తిడితోగాని పనిచేస్తూండిన ప్రజలు నిద్రపోయినట్లు కపిస్తుంది. ఎరువు గోతు లెక్కడివక్కడ అశ్రద్ధచేయబడినవి. క్రొత్త నాగళ్లు తుప్పుపట్టినవి. బాలబాలికల సహ విద్యావిధానము రూపుమాసినది.

ఈ అపజయానికి కారణం ఎంతో దూరం ఆలోచించ నక్కరలేదు. ఈ సంస్కరణం లోపలినుండి రాలేదు. పైనుండి బలవంతంగా ప్రవేశపెట్టబడింది. మిస్టరు బ్రేన్ తన అధికారాన్ని వినియోగించి తన క్రింది యుద్యోగస్థుల పైనా, ప్రజలపైనా కూడా తన చేతనైనంత ఒత్తిడిపెట్టి పని చేయించాడు. అయితే ఆయన బలవంతంవలన ప్రజలకు విశ్వాసం కలిగించలేక పోయినాడు. పని జయప్రదం కావ డానికి ముఖ్యమైన విశ్వాసం అక్కడ లోపించింది. ఫలిత ములే ప్రజలకు విశ్వాసం కలిగించగలవని మిస్టరు బ్రేన్ అభి ప్రాయ పడ్డాడు. కాని సంస్కరణం ఆ పద్ధతిలో ఆచరణలోకి రాదు. సంస్కర్తది ముళ్లత్రోవ. గులాబీపూలు పరచిన త్రోవకాదు. అతడాత్రోవను చాలా ఆయాసపడి నడవాలి. నెమ్మదిగా కుంటుతూ నడవాలి. ఒక్కసారిగా ఎగిరి గంతు వేయకూడదు. మిస్టర్ బ్రేన్‌కు ఆ సహనం లేకపోయింది. ఒక్క గంతులో చాలాదూరం పోవాలనుకొన్నాడు. అందు వల్ల అపజయం పొందాడు.

అధికారంలో ఉన్నమనిషి సంస్కర్త అయితే, తన అధికారం సంస్కరణమునకు సహాయం కాకపోగా పై పెచ్చు ఆటంకం కాగలదని ఆయన తెలుసుకొని ఉండాలి. ఆయన ఎంత గొప్ప ప్రయత్నాలు చేసినా, ప్రజ లాయనను, ఆయన ఉద్దేశాలనూ కూడా శంకిస్తారు. ఏమీ అపాయం లేనిచోట్ల కూడా ఏదో అపాయం ఉన్నట్లు అనుమానిస్తూంటారు. పైగా

వారు కొన్నిపనులు చేసినప్పుడు తమ సంతృప్తి కొఱకుగాక, అధికారుల సంతృప్తికొఱకు చేస్తారు.

మిస్టర్ బ్రేన్‌కు మఱొక ప్రతిబంధకం కూడా తటస్థించింది. ఆతనికి డబ్బు వచ్చేటంత తేలికగా రావడం మొదలు పెట్టింది. సంస్కర్త తలచుకొన్న తీవ్ర కార్యక్రమములో డబ్బు ప్రశ్న చిట్టచివరి విషయమని నా అభిప్రాయం. అతనికి గట్టిగా అవసరమైనప్పుడు, సరిగా ఆ అవసరానికి కావలసిన సొమ్ము దానంతటదే అడగకుండా వస్తుంది. తమ అపజయమునకు కారణం ధన సహాయం లేకపోవడమేనని చెప్పే సంస్కరణవాదులను నా కెప్పటికీ నమ్మబుద్ధికాదు. శ్రద్ధ ఉండి, తగిన తెలివిఉండి, ఆత్మవిశ్వాసం కూడా ఉంటే ఆర్థిక సహాయం ఎప్పుడూ వస్తుంది. కాని మిస్టర్ బ్రేన్, తనమీద తనకుగల విశ్వాసముకంటెను, ప్రజలలో తనకుగల విశ్వాసముకంటెనుకూడా, తన ప్రయోగ విజయమునకు డబ్బు మీద ఎక్కువగా ఆధారపడ్డాడు. కాబట్టి, లాలా దేశరాజు అంచనా ప్రకారం, ఆయనకు సంవత్సరానికి రు 50,000 లు వస్తూన్నప్పటికీ, డబ్బులేని కారణాన అనేక అభివృద్ధి కార్యములు ఆగిపోయినట్లు ఆయన ఆరోపిస్తూన్నాడు. అతని ఆకాంక్ష తీరేదికాదు. అసలు ప్రయోగానికి సంబంధించినంతవఱ కిదీ విషయం.

ప్రయోజనంమాట అలా ఉండగా పుస్తకం మాత్రం జాగ్రతగా చదువదగినది. మిస్టరు బ్రేన్ యొక్క నిజాయితీని గుఱించి యెంతమాత్రమూ సందేహించ నక్కఱలేదు.

పుస్తకంలోని ప్రతి పుటలోనూ ఆ సంగతి ఋజువవుతూన్నది. గ్రంథకర్త చేసిన అనేక సూచనలలో సహజంగా ఇమిడిఉన్న విశిష్టతను ఎవ్వరూ కాదనలేరు. పుస్తకం సమర్థతతో వ్రాయ బడినది. గ్రామ పునర్నిర్మాణ కార్యమును నిర్వహింపదలచిన ప్రతివ్యక్తీ వెంటనే "మిస్టరు బ్రేన్" గ్రంథాన్ని చదవాలి. మిస్టరు బ్రేన్‌చే వివరింపబడిన గ్రామాల లోపాలు ఈ క్రింద ఉదహరింపబడుతూన్నవి.

1 రైతు వ్యవసాయ పద్ధతి చెడుగా ఉంది.

2 అతని గ్రామం మురికిగా ఉంటుంది. అతడూ అపరిశుభ్రంగా రోగంతో బాధపడుతూంటాడు.

3 అంటువ్యాధుల కతడు బలి అవుతూంటాడు.

4 అతని సంపద అంతా వృధాచేసుకొంటాడు.

5 అతని స్త్రీలను నీచంగాను, బానిసత్వంలోను ఉంచుతాడు.

6 అతడు తన కుటుంబం విషయంలోగానీ, గ్రామం విషయంలోగానీ యేమీ శ్రద్ధ తీసుకోడు. తన స్థితినిగానీ, తన పరిసరములను గానీ అభివృద్ధి పఱచుకోవడానికి, కించిత్తు కాలంగానీ ఆలోచనగానీ వినియోగించడు.

7 అతనికి మార్పన్నది పనికిరాదు. అతనికి చదువు రాదు. తన దేశంలోను తదితర ప్రదేశములలోనూ ఉన్న గ్రామస్థులు కానీ, ఇంకా యితర నాగరిక దేశాలలోని గ్రామవాసులు కానీ యెలా అభివృద్ధి అవుతూన్నారో అతని

కేమీ తెలియదు. తాను తన బుద్ధిని వినియోగిస్తే యేమి చేయగలడో కూడా అతనికి తెలియదు.

ఈ వర్ణనలో చాలా అతిశయోక్తి ఉన్నది. భారత దేశపు గ్రామస్థుని వ్యవసాయ పద్ధతులు నిజంగా చెడ్డవి కావు. అతనికి వ్యవసాయమును గుఱించి, పని జరగడానికి తగిన జ్ఞానము ఉన్నదని, అది తృణీకరింప తగినది కాదనీ అనేక మంది అంగీకరించారు. రెండవ మూడవ లోపములు అంగీకరింపక తప్పదని తోస్తూన్నది. నాలుగవది పూర్తిగా కాకపోయినా చాలా వఱకు అంగీకరించడానికి వీలులేదు. అతనికి వృథా చేసేటందుకు అసలు సంపద ఉంటేగదా! ఐదవది, ఆరవది, ఏడవది చాలావఱకు నిజమే. ఈ లోపాలను తొలగించుకొనేటందుకు పదునెనిమిది ఉపాయాలు సూచించ బడినవి. వాటిని ఈ దిగువ సంగ్రహంగా వ్రాస్తున్నాను.

1 మంచి పశువులను పెట్టుకోండి.

2 ఆధునిక పరికరముల నుపయోగించండి.

3 మంచి విత్తనాలనే వాడండి.

4 పారశీకపు చక్రాలను నెలకొల్పండి.

5 ఎఱువును గోతులలో నిల్వ చెయ్యండి.

6 పిడకలు చేయడం మాన్పించండి.

7 గ్రామ బ్యాంకులను ఉపయోగించుకోండి.

8 మీ పొలాలకు గట్లు వేసుకొని మిట్టపల్లములను బట్టి వాటిని నలుచదరంగా ఉండేటట్లు విభాగించి వాననీళ్లు వృథా కాకుండా చూచుకోండి.

9 మీపొలాలన్నీ ఒక్కచోట ఉండేటట్లు చేసుకోండి.

10 నూతి నీటితో ఏడాది అంతా పండించుకోండి.

11 ఖాళీగా ఉన్న ప్రతి చోటా చెట్లు నాటుకోండి.

12 పశువులకు రోగాలు రాకుండా టీకాలు వేయించుకోండి.

13 మీ పంటలు తినివేసే, ఎలుకలను, ఉడుతలను, ఇతర పురుగులను చంపండి.

14 పచ్చిక బీళ్లను అభివృద్ధి చేసుకోండి.

15 మీ పొలంలో చక్కగా వ్యవసాయం చేసుకొని తక్కిన సగం పచ్చికబీడు కింద ఉపయోగించుకోండి.

16 మీ నూతి నీరును తీసికొని వెళ్లేటందుకు భూమిలో యేర్పరచిన గొట్టాలను ఉపయోగించండి.

17 ఇసుక గట్లు జాఱిపోకుండా యేవైనా మొక్కలు నాటి వాటిని నిలిచేటట్లు చేసుకోండి.

18 మీ కాలువలను, బోదెలను తిన్నగా ఉండేటట్లు, పూడిక లేకుండా ఉండేటట్లు చూచుకోండి.

చాలా సూచనలు శ్లాఘా పాత్రములుగా నున్నవి. కొత్త వాటి విషయంలో జాగ్రత్తగా ప్రయోగాలు జఱుగవలసి ఉంటుంది. పాతవి చాలావఱకు ఆచరణలోకి రావడానికి వీలులేదు. ఇక ఆధునిక పరికరములను గూర్చి ఏ విధమైన రాగ ద్వేషములూ లేకుండా పదిహేను సంవత్సరాలు వాటితో ప్రయోగాలు చేసి చూశాము. వాటిలో అనేకం ఆశ్రమంలో ఉపయోగించి ప్రయత్నించి చూచాము. అవి చాలామట్టుకు

నిష్ప్రయోజనకరములనే నిర్ణయానికి వచ్చాము. వాటిని ఉపయోగించడంలో మేము వాటి నేమీ చెడగొట్టలేదని నిశ్చయంగా చెప్పగలము. మేము క్రమక్రమంగా అభివృద్ధి పొందుతూనే ఉన్నాము. కాని ఎక్కువ ఉపయోగకరము లుగా ఉండే ఆధునిక పరికరములు చాలా తక్కువని మాకు తెలిసింది. దీనిపైన ఆశ్రమము చేసిన ప్రయోగమును గూర్చి తరువాత స్పష్టంగా వ్రాయవలె ననుకొంటున్నాను. ఈ లోగా ఆధునిక పరికరముల కోసం ఆతురపడే వారికి "నిదానంతో తొందరపడండి" అని సలహాయిస్తున్నాను. ఎఱువులను నిలవచేయడం, పిడకలు చేసి ఎఱువును బుద్ధి పూర్వకంగా పాడుచేయక పోవడం, అవలంబించ వలసిన సూచనలు. భూములను చిన్నచిన్న ఖండములుగా చీల్చడం మఱొక పెద్ద చెడుగు. ఇది చాలా విస్తరించి ఉన్నది. ఈ అర్థంలేని చెడుగును నిరోధించేటందుకు కఠినమైన శాసన మొక్కటే మార్గం. ఈ సూచన లన్నిటికీ నిజమైన విద్య, ఆత్మవిశ్వాసమూ అవసరం. అన్నంలేక అల్లాడుతూన్న రైతుకు చదువూ లేదు, ఆత్మవిశ్వాసమూ లేదు. తన దారిద్ర్యం తన పుట్టుక తోనే వచ్చిందనీ దానిని తప్పించుకోవడానికి వీలులేదనీ అతడనుకొంటున్నాడు. ఆరోగ్య రక్షణమును గూర్చి బ్రేన్ చాలా మంచి సూచనలు చేశాడు. ఊడ్చిన పెంటపోగు, చెత్త, పేడ, బూడిద మొదలయినవి ఎక్కడ పడితే అక్కడ వేయకుండా చక్కగా తవ్విన గోతులలో పూడ్చిపెట్టమని

సలహాయిస్తూన్నాడు. ఎఱువుగోతులను పాయిఖానాలుగా వాడుకోవడాన్ని వివరంగా తెలుపుతూన్నాడు. కొంత పెద్ద దిగా ఉన్నప్పటికీ అంత వాస్తవంగానూ ఉపదేశ పూర్వకం గానూ ఉండే విషయాన్ని నేనీ దిగువ ఉదహరించకుండా ఊరుకో జాలను.

"గ్రామం చుట్టూను గ్రామంలోను పోగులు పడియున్న చెత్తాచెదారమున్నా, గ్రామం వెలుపలా, ఒకప్పుడు లోపలా కూడా ప్రతిచోటా మందంగా విరజిమ్మినట్లుండి అశుద్ధమున్నా ఎండి, గాలి వీచినప్పుడు పైకి లేచి గ్రామమంతా వ్యాపిస్తూం టుంది. ఒక్కొక్కప్పుడు మనుష్యుల కాళ్లతోను పశువుల కాళ్ల తోనూ కూడా అటూ ఇటూ చెదిరి పడుతూంటుంది. అది మీరు తినే అన్నంలోనూ త్రాగే నీళ్లలోనూ కూడా పడుతుంది. ప్రతి వాళ్ల కళ్లల్లోను ముక్కులలోనూ దూరుతుంది. ఊపిరి పీల్చినప్పు డెల్ల ఊపిరి తిత్తులలోకి చేరుతుంది. ఈ విధంగా మీ గాలిలో, మీ అన్నంలో, మీ నీటిలో ఒక భాగమయిపోతుంది. మీ ఊరి మురికితో మీరూ మీ పిల్లలు ప్రతి దినము విషము మ్రింగుతూంటారు. దీనికి తోడు అందులోనుండి లెక్కలేనన్ని ఈగలు బయలు దేరుతయి. అవి ముందు మురికి మీద కూర్చొని తరువాత మీ అన్నంపైన మీ కూరలపైన మీ పిల్లల కళ్లమీద నోటిమీదా కూడా వాలు తయి. అవి మీ సన్నిధానానికి వచ్చినప్పుడు కాళ్లు కడుక్కోవడం గానీ చెప్పులు విడవడంగానీ ఉండదనే విషయం జ్ఞాపకం పెట్టు కోండి. మీరు శాశ్వతంగా రోగగ్రస్తులు కావడానికిగానీ మీ కళ్లు పాడవడానికి గానీ, మీరూ మీ కుటుంబమూ త్వరలో చచ్చిపోవ డానికి గానీ, ఇంతకంటె సులువైన మార్గమున్నదని మీరూహించ గలరా?"

"గూర్నార్ గ్రామంలోని ఇళ్లు చరిత్రకు పూర్వము పుట్టిన మానవుని గుహలకు ప్రత్యక్ష వారసులు" అని గ్రంథ కర్త అంటున్నాడు. కాబట్టి ఆ గ్రామవాసి ఇంటికి కిటికీలు పెట్టుకోవాలి. మశూచికం రాకుండా ఉచితంగా టీకాలు వేయించుకోవాలి. ప్లేగు రాకుండా ప్లేగు టీకాలు వేయించు కోవాలి. ఎలుకలను చంపాలి. కలరా రాకుండా నీటిని పరిశుభ్రం చేసుకొని, నీళ్లు తోడుకొనేటందుకు తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. మలేరియా రాకుండా క్వైనైన్, దోమతెరలు వాడుకోవాలి. మిస్టరు బ్రేన్., మశూచికమునకు, ప్లేగుకు వేసే టీకాలను గూర్చి గట్టిగా చెప్పడం ఆశ్చర్యంగా తోస్తుంది. వైద్యశాస్త్రజ్ఞులీరెంటిని గూర్చి ఎంతో జాగ్రత్తగా మాట్లాడుతూన్నట్లు తెలిసినవారికి, టీకాలు వేయడం మంచిదికాదని రోజురోజుకు ఋజువవుతూన్నది. ఇక ప్లేగుకు వేసే (Inoculation) టీకాలలాటివి తాత్కాలికోపశమనం కలిగిస్తే కలిగించవచ్చునుగాని అవి ఆత్మవినాశనకరములైన చికిత్సలు. మనిషిని దుర్బలుడుగాచేసి, సహజమైన చావుకు ముందు అనేకసార్లు చచ్చేటట్లు చేయగలవు. పరిశుభ్రంగా జీవించే చోట మశూచికంగానీ ప్లేగుగానీ రాదని కావలసినంత సాక్ష్యం ఉంది. ఇవి రెండూ అపరిశుభ్రత, మురికి వలన కలుగుతూన్నవి. మూతులను బాగుచేసుకోవడం, పరిశుభ్రంగా నీళ్లు తోడుకొనే పద్ధతి ఈ రెండూ మంచివే; సందేహంలేదు. ఇవి కలరాను రాకుండా ఆపడమే కాదు, ఇంకా అనేక విషయాలకు మంచివి. పాలు లేకుండా క్వైనైన్

ఇవ్వడం నిరుపయోగం. ఇక దోమ తెరలు లక్షలాది ప్రజలకు అందుబాటులో ఉండవని నా అనుభవం. భారత దేశంలో నిరంతర ఆర్థిక దుస్థితితో ఉడికిపోతూన్న లక్షలాది ప్రజలను గూర్చి మిస్టరు బ్రేన్‌కు ఏమీ తెలియదని అనేక పర్యాయము లాయన ఋజువు చేసుకొన్నాడు. ప్రజలకీనాడు అందుబాటులో లేని చికిత్సలను సూచించడం వట్టి నిరర్థకం. సంస్కరణ ప్రియులు కనే కలలు నిజమైనప్పుడు ప్రజ లేపని చేయడానికి శక్తి కలిగి ఉంటారో ఆ పనిని, ప్రజలలో సంస్కరణం జరుగుతూన్న సమయంలో వారు చేయవలసి ఉంటుందని చర్చించడం అసంగతమైన విషయం.

వ్యర్థంగా వ్యయం చేయడమును గూర్చి ఈ దిగువ సూచన చేయబడింది.

> "శ్రాద్ధాలకు ఇంకా అటువంటి, కర్మలకు, నగలకు, పెండ్లిండ్లకు, తగవులకు ఆయ్యే అసందర్భపు ఖర్చులను గూర్చిన ప్రస్తుతాభిప్రాయాలను తొలగించుకొండి"

ఈ 'అసందర్భపుఖర్చు' లెక్కువగా మిస్టర్ బ్రేన్ ఊహలో మాత్రమే ఉన్నవని నా భయం. బహు కొద్ది మందికి మాత్రమే ఇది వర్తిస్తుంది. సామాన్య ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు, ఏ కార్యమునకు ఖర్చు పెట్టటందుకూ డబ్బు లేదు. నగలు కుప్పలు కుప్పలుగా దాచుకొంటున్నారనేది అధికారుల పాతబూటకపు మాట. నేను భారత దేశమంతటిలోనూ గల లక్షలాది స్త్రీలతో కలసిమెలసి ఉన్నాను. నామట్టుకు నేను నగలకు ప్రతికూలంగా ఎంతో గట్టిగా

మాట్లాడి ఉన్నాను. చాలామంది సోదరీమణుల నగలను తీయించివేశాను. నగలలో సౌందర్యం లేదని నాకు తెలుసును. కార్యకరామతులు చేయగలవారి సంఖ్యయే చాలా తక్కువ. నగలు ధరించగలవారి సంఖ్య అంతకంటె ఇంకా తక్కువ. లక్షలాది స్త్రీలు అసహ్యాకరమైన ఇత్తళ్లనో లేక కొయ్యముక్కలనో ధరిస్తారు. చాలామంది రాగి లేక ఇత్తడి నగలను పెట్టుకొంటారు. కొందరు వెండిగాజులను, వెండి అందెలను పెట్టుకుంటారు. అత్యల్ప సంఖ్యాకుల ఒంటిమీద మాత్రమే బంగారం కనపడుతుంది. కాబట్టి నగలను రొక్కంగా మార్చి బ్యాంకులో వేసుకోమనడం చాలా మంచిదే. కాని దానిని గ్రామపునర్నిర్మాణంలో ఒక భాగంగా ఆలోచించినప్పుడు మాత్రం అసంగతమనిపిస్తుంది. తగవులాటను గూర్చి కూడా అదేమాట చెప్పవచ్చును. వ్యాజ్యాలు ఎక్కువనేమాట నిజమే. అది సిగ్గుపడవలసిన విషయంకూడా. కాని ఈ వ్యాజ్యాలుకూడా ఎవరో కొద్దిమంది కలిగినవాళ్లకు సంబంధించి ఉన్నవి. కాని కోట్లాది ప్రజలు లేనివాళ్లు. గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమంలో నిస్సహాయులు, అజ్ఞానులు, భగ్నాశులు అయిన అత్యధిక సంఖ్యాక ప్రజానీకమును మనస్సులో పెట్టుకొని వ్యవహరించవలెను.

ఆనందకరమైన గృహమును కలిగియుండేటందుకు స్త్రీల యెడల కనికరంతో ప్రవర్తిస్తూ వారిని గౌరవంగా కుటుంబంలో సమాన భాగస్వాములుగా చూడమంటాడు

మిస్టర్ బ్రేన్. ఆడపిల్లలు బాగా పెద్దవాళ్లయ్యేవఱకు మగ పిల్లలతో కలిపి బడికి పంపవలసిందనీ, బాల్యవివాహములు చేయవద్దనీ కూడా అంటారాయన. స్త్రీల హక్కుల విషయంలో ఆయన మనోహరంగానూ పటిష్ఠంగానూ కూడా మాట్లాడగలడు.

"నీ భార్యా ప్రసవించే సమయంలో చీకటిగా ఉండే ముఱికి కొట్టులో ఆమెను ఉంచి పాకీవాని పెండ్లాముకోసం కబురు పంపుతావు. నీ చేయి విఱిగినప్పుడా పాకీవానికోసం ఎందుకు కబురు పంపవు? మీ ఆడవాళ్లలో ఒకరిని ఎందుకు మంత్రసానిగా శిక్షణ యిప్పించవు? పాకీవాళ్ల పెళ్లాలు డాక్టర్లుగా ఉండడానికి ఎలా వీలులేదో మంత్రసానులుగా ఉండేటందు కంతకంటె ఎక్కువగానే వీలులేదు. అటువంటి క్లిష్టసమయంలో నీ భార్యదగ్గర మీ గ్రామంలోని అంత్యకులజు లెవరో ఉండటంకంటె మీ వాళ్లెవరైనా ఉండి ఉపచారం చేస్తూండడం ఎక్కువ బాగుండదా? అగ్రజాతి స్త్రీకి దాయిగాగాని, మంత్రసానిగాగాని పనిచేయడం కంటె ఎక్కువ ఉత్తమమయిన పనిలేదు."

"నీ ఇంట్లో, నీ భార్యకూ నీ కుటుంబానికీ అంధకారబంధురమై ఊపిరాడని భాగం ప్రత్యేకించి ఉంచకు. వారుకూడా నీ అంతటివారే. నీ అనారోగ్యం ఎంత నీకు చెడుగు చేస్తుందో వారి అనారోగ్యం కూడా అంతే చెడుగు చేస్తుంది నీకు. నీవు పొలాలకుపోయి ఆరోగ్యంగా ఉండవచ్చును. నీ స్త్రీలూ పిల్లలూ చాలాకాలం ఇంట్లోనే గడపవలసి ఉంటుంది. కాబట్టి వారికి ఇంట్లో బాగా గాలివచ్చే అత్యుత్తమమైన భాగం ప్రత్యేకించి ఉంచు."

కవితా సౌందర్యం గల మఱికొన్ని వాక్యాలు:

"మగపిల్లలను ఆడపిల్లలను వ్యత్యాసంగాచూచే జంతువు మనిషి ఒక్కడే. ఆడవాళ్లను తక్కువగా కూడా చూస్తాడు

మానవుడు. మీ అమ్మ ఒకప్పుడు ఆడపిల్లయే. నీ భార్యకూడా ఒకప్పుడు ఆడపిల్లయే. నీ కూతుళ్లు ఒకనాడు తల్లులు కాగలరు. కాబట్టి ఆడపిల్లలు సృష్టిలో తక్కువవారైతే నీవుకూడా తక్కువ వాడవే.

కుక్కలను గూర్చిన ఈ దిగువ విషయం నావలెనే పాఠకులు కూడా చదివి ఆనందిస్తారనుకొంటాను.

కుక్క మనిషికి మిత్రముగా పేర్కొనబడుతూన్నది. గూర్గాన్‌లో దానిని స్త్రీకంటె ఎక్కువగాచూడడంలేదు. మనిషికి విరోధిగా చూస్తున్నారు. తప్పకుండా కుక్కను పెంచండి. దానికి సక్రమంగా తిండిపెట్టండి. ఒకపేరు పెట్టండి. మెడకు పట్టీ కట్టండి; శిక్షణ ఈయండి. దానిని సరిగా చూడండి. దిక్కులేని కుక్కలను వీధులలో తిరుగనీయకండి. అవి మీ ఆహారాన్ని పాడు చేసి రాత్రి తెల్లవార్లు మొఱుగుతూ మీకు నిద్రాభంగం కలిగిస్తవి చివరకు పిచ్చెక్కి మిమ్ములను కఱుస్తయికూడా."

ఆయన గ్రంథంలో ఇంకా చాలా విలువగల సంగతులున్నవి. గ్రామాలలో ఆయన సూక్ష్మదృష్టికి అందని లోపంలేదు. గ్రామస్థుల విద్యనుగూర్చి ఆయన అభిప్రాయాలు నా దృష్టిలో అత్యుత్తమంగా ఉన్నవి. అంతకంటె బాగా చెప్పడం కష్టం. ఈ క్రింది భాగాన్ని నేనుదాహరించక ఉండజాలను.

"ఎక్కువ మంచివారును, తెలివిగలవారును, ఆరోగ్యవంతులును, సౌఖ్యవంతులును అయిన గ్రామస్థులను తయారు చేయడమే గ్రామ పాఠశాలయొక్క ఉద్దేశము. నాగలి దున్నేవాని కొడుకు పాఠశాలకు వచ్చినప్పుడు, అతనికి చెప్పే చదువు, అతడు తన తండ్రియొక్క నాగలిని అనుసరించవలసివస్తే, అతని తండ్రికంటె

ఎక్కువ త్వరగా ఆ పనిని నేర్చుకొని, తండ్రికంటె ఎక్కువ తెలివి తేటలతో దానిని నిర్వహించగలిగేటట్లు చేయగలిగినదిగా ఉండాలి. వీటన్నిటికంటెనుకూడా, ఆరోగ్యవంతులుగా జీవించడం, అంటు జాడ్యాలు రాకుండా కాపాడుకోవడం ఎలాగో, పిల్లలకు పాఠశాలలో నేర్పాలి. గ్రుడ్డివాళ్లుగా తయారయ్యేవాళ్లకు, ఏదో ఒక విధమైన అంగవైకల్యం పొందేవాళ్లకు యుక్తవయస్సు రాక మునుపే మరణించేవాళ్లకు చదువుచెప్పి మాత్రం ఏమిలాభం? ఇల్లు మురికికూపంగా అసౌకర్యంగానూ ఉండి, అంటుజాడ్యాలవలన కుటుంబమంతా తుడిచిపెట్టుకొని పోయే స్థితిలోనూ, పిల్లలు గ్రుడ్డివాళ్లుగానో వికలాంగులుగానో ఉండే యెడల చదువు వలన ప్రయోజనమేమిటి?"

ఇందువలన ఆయన, గ్రామంలోని ఉపాధ్యాయుడు కేవలం చదువు, వ్రాత, లెక్కలు నేర్పడమే కాకుండా గ్రామస్థులకు నాయకుడుగా ఉండి వారికి సంస్కారమును, విజ్ఞానమును కలిగించేవాడుగా ఉండాలని కోరుతున్నాడు. అటువంటివానిని గ్రామస్థులు నమ్మి వారి సమస్యలను ఆయనకు చెప్పి వారికి సందేహంకానీ చిక్కుగానీ వచ్చినప్పుడు ఆయనతో సంప్రదిస్తూంటారు.

"గ్రామ జీవితంలో అర్హ స్థానమును పొంది దానిని నిలబెట్టుకోవాలి ఉపాధ్యాయుడు. ఆయన చెప్పిన దాయన ఆచరిస్తూ ఉండాలి. తాను ప్రబోధిస్తూన్న అభివృద్ధి కార్యక్రమాలను ఆచరణలో పెట్టడంలో తాను ముందు సొంతంగా చేతితో పని చేస్తూ తక్కినవారికి ఉదాహరణంగా ఉండాలి. కష్టపడి పనిచేయడంలోనూ. సంఘసేవలోనూ గౌరవం కలదనడం ఆయన సందేశంగా ఉండాలి. చదువడం వ్రాయడం ఆయన ఎలా నేర్పు

తున్నారో అదే విధంగా గ్రామాన్ని పరిశుభ్రం చేయడం, ఇనుప నాగలిని చక్కగా సరిచేయడం కూడా మనస్ఫూర్తిగా నిర్వహించాలి".

ఇంతటితో నేనాగి గ్రామ పునర్నిర్మాణ సాహిత్యానికి ఆయన సమర్పించిన విలువగల గ్రంథమును అవలోకింపవలయునని కోరుతూ సంతృప్తి పడుతున్నాను. ఆయన ప్రణాళిక మొత్తం మీద బాగాను ఆచరణ యోగ్యంగానూ ఉంది. లాలా దేశ్ రాజు వ్రాసిన సమాచారం పైన మనం ఆధారపడినట్లయితే,- ఆధారపడవలెననే నా అభిప్రాయం. కనీసం ఆచరణ మిక్కిలి లోపభూయిష్ఠంగా ఉన్నదని చెప్పవలసి వస్తుంది. అందుకు కారణం మిస్టర్ బ్రేన్ గానీ ఆయనతో కలసి పనిచేసిన వారు గానీ, హృదయపూర్వకంగానూ, శ్రద్ధగానూ పనిచేయకపోవడం కాదు. కాని తమను ఆవరించి ఉన్న అధికార వాతావరణమునుండీ, ఉద్యోగపు గాడి నుండీ తప్పించుకోని వారు బయట పడజాలకే పోయినారు. అయితే అటువంటి స్థానంలో ఉన్నప్పుడు మనమందరమూ కూడా ఆహద్దుల మధ్యనే వ్యవహరించ వలసి వస్తుంది. మిస్టరు బ్రేన్, తాను గమనించిన కొలది విషయములను బట్టి ఊహించిన భావములను, సత్యాసత్యములను తెలుసుకొన వీలులేని ఆంగ్లేయుల ముందు పెట్టి భారత దేశాన్ని అప్రతిష్ఠ పాలుచేస్తున్నాడని నాకు తెలుసును. మిస్టరు బ్రేన్ వ్రాతలు ఇండియాలో కంటె దూరంగా ఉన్న ఇంగ్లండులో ఇంకా ఎక్కువ అతిశయంగా కనిపించగలవని కూడా నేనెఱు

గుదును. కాని అతని పుస్తకమును గూర్చిన నా పరిశీలన విషయంలో ఆంగ్ల స్వభావమునకు చెందిన అతని నిందారోపణలతో కాని, అతని ప్రయోగమునందు కనపడుతూన్న అపజయంతో కాని యేమీ సంబంధం పెట్టుకోలేదు. నేను గ్రామ పునర్నిర్మాణమునం దత్యంత శ్రద్ధాభక్తులు కలిగిన సంస్కర్త నవడంచేత, నిష్కపటంగా వ్రాసిన పుస్తకంలో ఉన్న మంచిని గ్రహించడానికి కృషి చేశాను.

యంగిండియా, 14-11-'29.



# అనుబంధము బి

## ప్రయోజనకరములైన సూచనలు

(జె. సి. కుమారప్ప)

(ఆచార్య జె. సి. కుమారప్ప వ్రాసి పెట్టుకొన్న విషయాల నుండి ఈ క్రింది సంగతులు గ్రహింపబడినవి. —మో. క. గాంధీ)

సహకార సంఘాలు: సహకార సంఘాలు గ్రామ పరిశ్రమలను అభివృద్ధిచేయడమునకేగాక, గ్రామస్థులు కలసి కట్టుగా పనిచేసుకొనే ప్రయత్నములను ప్రోత్సహించడానికి కూడా, ఆదర్శప్రాయంగా పనికివచ్చే సంస్థలు. బహుళార్థ సాధక గ్రామసంఘంద్వారా అనేక విధాలుగా మిక్కిలి ముఖ్యమైన ప్రయోజనములను సాధింపవచ్చును. అవేవన:

1. పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలను, గ్రామస్థులకు కావలసిన తిండిగింజలను నిలవచేయుట.

2. గ్రామంలో ఉత్పత్తి అయిన వస్తువులను అమ్ముట—ప్రజల కవసరమయినవాటిని పంపిణీచేయుట.

3. విత్తనాలు, అభివృద్ధి చేయబడిన పరికరములు, పనిముట్లు, ఎముకల ఎరువువంటి ఎరువులు, మాంసం, చేపల ఎరువు, వేరుసెనగపిండి, పచ్చి ఎరువు, పచ్చి ఎరువుగింజలు వగైరాలు పంపిణీచేయుట.

4. ఒక ప్రదేశానికంతటికీ ఒక ఉమ్మడి ఆబోతును పోషించుట.

5. పన్నులు వసూలుచేయడం, చెల్లించడం వగైరా పనులలో ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్యనుండి సహకరించుట.

ఆహారధాన్యాలను సంచులకు పట్టి, రవాణా చేయ డంలో అయ్యే దుబారాలోని వాటిని, ఒక కేంద్రప్రదేశము నకు చేర్చి గ్రామాలకు తిరిగీ పంపిణీచేయడంలో అయ్యే ఖర్చులోనూ చాలాభాగం, ప్రజలు ప్రభుత్వమూకూడా విశ్వసింపదగిన సహకారసంఘము ద్వారా ఆ పనులను జరుపు కొన్నట్లయితే తగ్గించుకోవచ్చును. గ్రామాలలోని సహకార సంఘాలు ధాన్యమును నిలవచేసినట్లయితే స్థానికోద్యోగుల జీతాలలో కొంతభాగం వస్తురూపంలో ఈయడానికి వీలవు తుంది. భూమి శిస్తు, నీటితీరువలు కూడా వస్తురూపంలో వసూలుచేయడానికి సౌకర్యంగా ఉంటుంది. ఇది మన మెక్కువగా కోరుకొంటూన్న పద్ధతి.

వ్యవసాయము: రెండు విషయాలు మనస్సులో పెట్టుకొని పంటల ఉత్పత్తిని అదుపులో పెట్టాలి. (1) వాణిజ్య పంటలకంటె ముందుగా, స్థానికంగా కావలసిన ఆహార ధాన్య ములను, ప్రాథమిక జీవితావసరములకు కావలసిన ముడిపదార్థ ములను తయారుచేసుకోవాలి. (2) యంత్రాలయాలకు కావల సిన ముడిపదార్థములను గాక గ్రామపరిశ్రమలకు కావలసిన ముడి పదార్థములను పండించుకోవాలి. అనగా మందపు పెచ్చుగల చెఱకుగడలకు బదులుగా పలచని పెచ్చుగల చెఱకు గడలను, పొడుగుపింజపత్తికి బదులు, పొట్టిపింజపత్తిని పండించుకోవాలి. మందపు పెచ్చుగల చెఱకుగడ పంచదార ఫ్యాక్టరీలకు కావలసి ఉంటుంది. పలుచని పెచ్చుగల చెఱకు గ్రామంలోని గానుగలలో వేసి త్రిప్పి బెల్లం తయారు చేసు

కోవడానికి పనికివస్తుంది. అలాగే పొడుగుపింజపత్తి బట్టల మిల్లులకు, పొట్టిపింజపత్తి చేతి రాటంమీద నూలువడుకు కోవడానికీ పనికివస్తుంది. పరిసరముల నున్న జిల్లాలకు కావలసిన అదనపు పంటలను పండించడానికి మిగిలిన భూమిని ఉపయోగించవచ్చును. ఫ్యాక్టరీలకు కావలసిన చెఱకు, పొగాకు, జనపనార, తదితర వాణిజ్యపు పంటలు పూర్తిగా మానివేయాలి లేదా సాధ్యమైనంత తక్కువ పండించాలి. వ్యవసాయదారు లీ పద్ధతిని అవలంబించేటందుకు వీలుగా వాణిజ్యపు పంటలకు లైసెన్సు యేర్పాటుచేసి, పన్నులు కూడా వాటి మీద ఎక్కువగా వేయాలి. ఇందువల్ల వ్యవసాయదారులకు వాణిజ్యపు పంటలు పండించడానికి ఉత్సాహముండదు. మొత్తంమీద వ్యవసాయోత్పత్తుల ధరలు పారిశ్రామికోత్పత్తుల ధరలతో అనుకూలంగా పోల్చతగినట్లు ఉండాలి.

పొగాకు, జనుము, చెఱకు మొదలయిన వాణిజ్యపు పంటలు రెండు విధాల నష్టదాయకములు. అవి మానవుని ఆహారోత్పత్తిని తగ్గించడమే కాక పశువుల తిండిని కూడా తగ్గిస్తూన్నవి. మానవుని ఆహారపు పంటల వలన పశువులకు తిండి కూడా దొరుకుతుంది.

ఫ్యాక్టరీలకు కావలసిన చెఱకు ఉత్పత్తి తగ్గినందు వలన బెల్లం సరఫరా కూడా తగ్గిపోవచ్చును. కాబట్టి ఇప్పుడు కల్లుగీత కుపయోగపడుతూన్న తాడిచెట్లనుండీ, బంజరు భూములలో ఉన్న తాడిచెట్లనుండీ, వీలయితే పల్లెలో

ఇంకా కావలసినన్ని తాడిచెట్లను పెంచి కూడా మనకు కావలసిన తాటి బెల్లం తయారు చేసుకోవచ్చును. అప్పుడు, నేడు చెఱకు పంట కుపయోగపడుతూన్న అత్యుత్తమమైన భూమిలో ఈ రోజున ఇండియాకు అత్యావసరంగా కావలసిన ధాన్యములు, పండ్లు, కూరలు పండించుకోవచ్చును.

సాగుబడి : గ్రామా లన్నింటికీ నీటిసరఫరా సౌకర్యములు కలిగించవలసిన అవసరమును గూర్చి ఎంతచెప్పినా తీరదు. వ్యవసాయాభివృద్ధి కిది పునాది. ఇది లేకపోతే వ్యవసాయం జూదంగా ఉండిపోతుంది. నూతులను త్రవ్వించడం, చెఱువులను పెద్దవిచేసి పూడికతీయించడం, కాలువలను నిర్మించడం మొదలయిన పనులను తీవ్రంగాసాగించాలి. బియ్యపు మరలు, పిండిమరలలో ఉపయోగిస్తూన్న పవరు ఇంజనులను గొట్టపునూతులలోనుండి నీరు తోడేటందుకు ప్రభుత్వంవారు తీసుకొనవచ్చును. నీటి సౌకర్యం లేనిదే, సరియైన ఎఱువులను వేయ వీలులేదు. నీరు లేకపోతే ఎఱువులు వేయడం అపాయకరం.
హారిజన్, 12-5-'46.

ఎఱువు : ప్రస్తుతం గ్రామ ఆరోగ్యమును పాడుచేస్తూ గ్రామంలో వృథాగా పడిఉండే, పెంటపోగులు, ఎముకలు, మనుష్యుల మలమూత్రములు, మొదలయినవి తేలికగా కంపోస్టు ఎఱువుకావడానికి ఉపయోగపడగలవు. ఈ ఎఱువు ఆవు పేడవంటి మంచి ఎఱువవుతుంది. దేశమునుండి బయటకు సాధారణంగా ఎగుమతి చేయబడుతూన్న ఎముకలు,

వేఱుసెనగపిండి, ఆముదపుపిండి మొదలయినవి గ్రామాలను విడిచిపోనీయకూడదు. ఎముకలను సున్నంబట్టీలలో నల్లగా కాల్చి తరువాత సున్నపు గానుగలలో వేసి పొడిచేసి రైతులకు పంచిపెట్టవలయును.

గ్రామాలలో ఎఱువు తయారుచేసే పనిని ప్రభుత్వపు గ్రాంటుతో, కాంట్రాక్టుకు ఈయవచ్చును. ఈ పని గ్రామాలను పరిశుభ్రంగా ఉంచడమేగాక, కంపోస్టు ఎఱువులు తయారుచేసే పాకీవాండ్లను వర్తకులస్థాయికి పెంచగలదు కూడా.

గ్రామస్థులనుండి నూనెగింజలను తీసికొని వారికి నూనె మాత్రమిచ్చి, నూనె పిండిని విదేశాలకు ఎగుమతి చేసే నూనె మిల్లులు మన భూమికి విలువగల ఎఱువును లేకుండా చేస్తూన్నవి. ఇది పూర్తిగా ఆపివేయాలి. నూనె గింజలను గ్రామాల వెలుపలకు పోనీయకూడదనీ, గ్రామాలలోని గానుగలలోనే వాటినుండి నూనె తీయవలయుననీ అనడానికి ప్రధాన కారణాలలో ఇది ఒకటి. ఇందు వలన నూనె, పిండీ కూడా గ్రామాలలోనే ఉండిపోయి మనుష్యులను, పశువులను, భూమినీ కూడా బాగుచేయగలవు.

భూసారమును ఎక్కువ ఫలవంతంగా చేసే పేరుతో మన వ్యవసాయంలోకి రసాయనిక ఎఱువులను ప్రవేశపెట్టడానికి చాలా ప్రయత్నం జరుగుతూన్నది. ప్రపంచ మంతటిలో ఈ రసాయనిక ఎఱువుల ఉపయోగము వలన కలిగిన అనుభవము, వీటి దురాక్రమణకు ప్రతికూలంగా వ్యవహా

రించేటందుకు మనకు మంచి మార్గదర్శకంగా ఉంటూన్నది. అవి భూసారమును పెంపొందించుట కుపయోగపడవు. కాని వెంటనే అధికంగా పండేటందుకు ఒక విధమైన ఉద్దీపక ద్రవ్యంగా ఉపయోగపడుతూన్నవి. తరువాత భూసారమును లాగివేసి భూమిని పూర్తిగా బలహీన పరుస్తున్నవి. వ్యవసాయమునకు ముఖ్యమైన మట్టి పురుగులను కూడా అది నాశనం చేస్తుంది. చివరకు అటువంటి కృత్రిమపు ఎరువులు భూమికి హానికరమని స్పష్టపడుతుంది. రసాయనికపు ఎరువులను గూర్చి జరుగుతూన్న బ్రహ్మాండమైన ప్రచారమునకు వెనుక, ఎరువుల ఫ్యాక్టరీ యజమానులు, వ్యవసాయమునకు వాటి వలన కలిగే హానినీ, అపచారమునూ గణింపక తమ ఎరువులను ఎలాగో అలా అమ్ముకోవలయుననే ఆతురత కనబడుతూన్నది.

భూమిని ఉంచవలసిన పద్ధతి : ఎరువులను ఎక్కువగా వృద్ధి చేయడంతోపాటు, భూమికి గట్లువేసికొని మురుగు నీరు పోయే వసతి కల్పించుకొని భూసారమును పాడుకాకుండా చూచుకోవాలి. భూసారమును ఫలవంతంగా చేసుకోవడం అన్నిటిలోకీ ముఖ్యం. అది బాగుంటేనే అందులో పండే ధాన్యం గానీ పశుగ్రాసంగానీ పుష్టికరంగా ఉంటుంది. భూమిలోని పటుత్వం తగ్గిపోయినట్లయితే దానిలో పండే పంట కూడా నాదారుగా ఉంటుంది. అందువలన ప్రజల ఆరోగ్యం చెడిపోతుంది. కనుకనే ఆహారశాస్త్ర నిపుణులు ఆరోగ్యాన్ని వ్యవసాయంతో ముడిపెడతారు.

విత్తనాలు : వ్యవసాయాభివృద్ధికి ఎన్నికైన మంచి రకపు విత్తనాలు చాలా అవసరం. ఈ సందర్భంలో విత్త నాలను ప్రయోజనకరంగా పంపిణీ చేసేటందుకు తగిన సంస్థ ఉండాలి. ఇందుకు సహకారసంఘముకంటె తగినది మరొ కటి లేదు.

పరిశోధన : వ్యవసాయంలో జరిగే పరిశోధనయావత్తు ఆహారపు పంటలనూ, గ్రామపరిశ్రమలకు కావలసిన ముడి పదార్థములనూ అభివృద్ధిచేసేటందుకు జరగాలి. అంతేకాని పొగాకు, ఫ్యాక్టరీలకు కావలసిన ముడిపదార్థాలు మందపు పెచ్చు చెఱకుగడ, పొడుగుపింజపత్తి పండించేటందుకు జరుగకూడదు.

సముచితాహారోత్పత్తి కొఱకు భూమిపంపిణీ : ఇప్పుడు తీవ్రరూపము తాల్చిన ఆహారసమస్య తక్షణం పరిష్కార మయ్యే సూచనలు కనిపించడం లేదు. ఈ సమస్య రెండు విధాలు– మొట్టమొదటిది ఉష్ణోత్పాదకశక్తి లోపించడం, రెండవది ఆరోగ్యరక్షణకు కావలసిన ఆహారములు చాలా కాలమునుండి కొఱవడి యుండడం. మొదటిది తేలికగానే పరిష్కారం కావచ్చును. కాని రెండవది చాలా చిక్కులతో కూడినది.

ఒకఎకరం భూమి ఇతర ఆహారోత్పత్తి ద్వారా కంటె ధాన్యోత్పత్తి ద్వారా ఎక్కువ ఉష్ణోత్పాదక శక్తిని సరఫరా చేయగలదని సాధారణంగా ఊహింపబడుతూన్నది. ఉష్ణోత్పా దనం సంగతి అలా ఉండగా ధాన్యాలలో ఆరోగ్యరక్షక

ఆహారలక్షణాలు చాలా తక్కువగా ఉంటవి. కాబట్టి ధాన్యాల ద్వారానే ఈ లక్షణాలను పొందవలెనంటే చాలా ఎక్కువ పరిమాణములలో ధాన్యములు కావలసి ఉంటవి. అలా కాక, ధాన్యములకు బదులుగా గానీ, లేక వాటి కనుబంధములుగా గానీ పండ్లు, కూరలు, కాయలు, నూనెగింజలు మొదలగు ఆహారపదార్థములను తీసుకొనే యెడల, సముచితాహారమునకు కావలసిన ఆరోగ్యరక్షక ఆహారలక్షణాలు, ఒక్క ధాన్యముల ద్వారాకంటె తక్కువ పరిమాణములు గల ఈ రకపు ఆహారముల ద్వారా పొందవచ్చును. ఆహారధాన్యముల సందర్భములో కంటె, ఉరలగడ్డలు మొదలగు దుంపకూరల సందర్భములో యకరం ఒకటింటికి ఉత్పాదనం ఎక్కువ అవుతుంది. కనుక సముచితాహారము మనకు రెండువిధాల క్షేమకరంగా ఉంటూ మన సమస్యను పరిష్కరించ వచ్చును కూడా. ఇందువలన ఒక్కొక్క మనిషికి కావలసిన భూమి విస్తీర్ణమును తగ్గించుకోవచ్చును. అంతేకాక అది శరీరమునకు కావలసినవన్నీ సరియైన పరిమాణములలో సరఫరా చేసి శరీరారోగ్యమును కాపాడి అర్హస్థితిలో ఉంచుతుంది. ప్రస్తుతము ఇండియాలో ఆహారపు పంటలకోసం యేర్పాటయి ఉన్న భూమి మనిషి ఒకటింటికి 0.7 ఎకరములని అంచనా వేయబడినది. ప్రస్తుత వ్యవసాయ విభాగమును బట్టి ఈ విస్తీర్ణము మన అవసరాలను తీర్చుకోవడానికి తగినంతగా లేదని ఇప్పటి మన అనుభవము. కాని పునర్వ్యవస్థాపిత వ్యవసాయ విధానములో సముచితాహారమునకు కావలసిన

భూమి మనిషి 1కి 0–4 ఎకరమని అంచనా వేయబడినది. దీనినిబట్టి ఇప్పటి మన 0–7 ఎకరములు, మనిషికి కావలసిన దానికంటె ఎక్కువ అవుతుంది. ఇప్పటి వలె కేవలం తిండి గింజలకోసం ధాన్యమును పండించే కంటె, సముచితాహార మునకు కావలసిన పదార్థములను ప్రజలకు సరఫరా చేసే టందుకు అనుగుణంగా స్థానికంగా ఉన్న భూమిని ఆయా పంటల కొఱకు విభాగించవలెను. ఈ విషయాన్ని పూర్తిగా విచారించి ఇందుకు స్పష్టమైన ప్రణాళికను తయారుచేయ వలెను.

బియ్యం : 1 తిరువాన్కూరులో వలె అన్ని బియ్యపు మరలను మూసివేయవలెను.

2 బియ్యమునుండి తవుడు తీసివేసి తెలుపుచేసే హల్లర్ల నన్నిటినీ నిషేధించవలయును.

3 ముడి బియ్యంలో ఉన్న పుష్టికరమైన గుణమును గూర్చి ప్రజలకు బోధించి దానిని వండే పద్ధతిని ఆచరణ యోగ్యమైన ప్రదర్శనముల మూలకంగానూ, ఫిలిముల ద్వారాను నిరూపించవలయును. బియ్యాన్ని తెలుపు చేయడం నిషేధించవలెను. లేదా ఎంతవఱకు తెలుపు చేయ వచ్చునో అంతవఱకే తెలుపు చేసేటట్లు గట్టి జాగ్రత తీసుకో వలెను. ఎక్కువగా వడ్లు పండే ప్రదేశాలలో వ్యాపారం నిమిత్తం పారిశ్రామికస్థాయిలో వడ్లదంపు పరిశ్రమ నడు స్తూన్న చోట్ల వడ్లను ప్రత్యేకించేటందుకు, తూరుపాత పట్టే

టందుకు కావలసిన ఖరీదుగల పరికరములను, ఆ పనులను నిర్వహించే వర్గాలకు, వారి సహకార సంఘములద్వారా అద్దెకు సరఫరా చేయవలెను.

5 ముడి బియ్యమును గూర్చి ప్రచారం చేసి ప్రజలలో వ్యాపింపచేయవలసి యున్నది గనుక, ఒక చోటనుండి మఱియొక చోటకు వడ్లు రవాణా కావలసిన అవసరమున్నది. కాబట్టి వడ్ల బరువునుబట్టి దాని రవాణాకు అయ్యే ఎక్కువ ఖర్చువలన బియ్యపుధర పెఱుగకుండా ఉండేటట్లు వడ్ల రవాణా రుసుములు తగ్గించాలి.

6 ముడి బియ్యం చేసేటందుకు, బియ్యం తెలుపు చేసేటందుకు ప్రత్యేక పరికరములు లేక, ఈ రెండు పనులూ ఒక్క వడ్లు దంచడంలోనే కలసి ఉన్న చోట్ల, తయారయ్యేది తెలుపు చేసిన బియ్యమే. అటువంటి సందర్భాలలో ముడి బియ్యం చేయడానికి, కొయ్యతోగాని, రాతితోగాని లేక మట్టితోగాని చేసిన చేతిరుగళ్లను (చక్కీలు) ప్రవేశ పెట్టాలి. వాటిని ఇతర పరిశ్రమలకు కావలసిన పరికరములతో పాటు జిల్లా డిమానస్ట్రేటర్లు సరఫరా చేయవచ్చును. సాధ్యమైనంతవరకు బియ్యమును తెలుపుచేసే పరికరములను నిరుత్సాహపఱచాలి. అవసరమైతే వాటి సంఖ్యను తగ్గించడానికి వాటి మీద పన్ను కూడా వేయవచ్చును. బియ్యము తెలుపు చేసేటందుకు లైసెన్సు పొందిన పరికరములు, ఎంత వఱకు తెలుపు చేయవచ్చునో నిర్ణయించి, ఆ నిర్ణయం

ప్రకారం జరిగేటట్లు తనిఖీచేస్తూ జాగ్రత్తగా కనిపెట్టియుండ వలెను; గ్రామానికి కావలసిన వడ్లు, తదితర ధాన్యములు, విత్తనాలు గ్రామంలోనే నిల్వచేసి మిగతాది మాత్రమే బయటకుపంపాలి. ఈ పనులన్నింటికీ ముఖ్యంగా తగిన సంస్థ బహుళార్థసాధక సహకార సంఘం.

ధాన్యపు గిడ్డంగి: ధాన్యం నిలవ చేసేటందుకు స్థానికంగా యేర్పాట్లు చేయబడిన యెడల, సరిగా నిలవచేయనందువలనను, రవాణా వగైరాల వల్లను అయ్యే దుబారా ఖర్చు లేకుండా పోతుంది. ఎక్కువగా ధాన్యము నిలవచేయవలసిన పెద్దపెద్ద పట్టణాలు నగరాలు ఉత్తర ప్రదేశంలోని ముజఫరు నగరంలో కట్టిన ప్రకారం పెద్ద పక్కా సిమెంటు గిడ్డంగులను కట్టుకోవచ్చును. వీనిని మున్సిపాలిటీ వారు కట్టించవచ్చును. లేదా ప్రైవేటు వ్యక్తులు, ధాన్యం నిల్వలకు అద్దెకీయడానికి కూడా కట్టించవచ్చును. ప్రస్తుతం బాయలర్ల విషయంలోవలెనే, ఈ గిడ్డంగులను అప్పుడప్పుడు తనిఖీ చేస్తూండవచ్చును. ధాన్యమును సక్రమంగా నిల్వ చేయకపోవడం వలననే చాలా ఎక్కువ నష్టం వస్తూన్నది. అందువలన కలిగిన నష్టం ఎంత తక్కువగా అంచనావేసినా షుమారు 350 లక్షల టన్నులని తేలింది. ఈ జరుగుతూన్న సంవత్సరంలో ఇండియాలో ఆహారధాన్యాల కొఱత కూడా ఈ మొత్తమునకు సమంగా ఉన్నట్లు ప్రకటించబడినది. ఇక ధాన్యాలు నిలవచేయడంలో కలిగిన లోపాలవల్ల, పురుగులు, పందికొక్కులు, క్రింద తేమ- ఈ అన్నిటి మూ

ముల గుణం చెడిపోయి అనేక రోగాలు కలుగుతూన్నవి. ఇది పెద్ద నష్టం. కాబట్టి ఈ ధాన్యం నిలవ సమస్య అత్యవసరమైనదీ, శాశ్వతమైనదీ కూడా. అందువలన ఈ సమస్యను మిక్కిలి శ్రద్ధాభక్తులతో పరిష్కరించవలసియున్నది. ఇప్పటి వలె తగిన రక్షణ లేని గిడ్డంగులలో ధాన్యం నిలవచేసే పద్ధతి మాన్పించి తీరవలెను.

ఉత్పత్తి అయిన గ్రామాలలోనే ధాన్యం నిలవ చేయబడి, పట్టణాలకు రవాణా అయి తిరిగి గ్రామాలకు రావలసిన అవసరము లేకుండా చేయబడే యెడల, అది చెడిపోయే అవకాశం కూడా స్వతస్సిద్ధంగా తగ్గిపోతుంది. స్థానికంగా నిల్వచేయడం వలన బ్లాకు మార్కెటులో ధాన్యం అమ్మడం చాలా వఱకు తగ్గిపోతుంది. పైగా నగరాలనుండి రేషన్లు తెచ్చుకోవలసిన కష్టం గ్రామాలకు తప్పిపోతుంది. ఖరీదులు కూడా స్థిరపడడానికి వీలవుతుంది.

ధాన్యం నిల్వచేసే వ్యక్తులకు నిలవచేసే పద్ధతులను తెలియచెప్పాలి.

హరిజన్ 19-5-'46.



# గాంధీ స్మారక నిధి, ఆంధ్ర శాఖ
## స్టేటు బోర్డు సభ్యులు

అధ్యక్షులు :

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సంచాలక్-సభ్యత్వ కార్యదర్శి :

శ్రీ ఎస్. రామానంద్‌గారు

సభ్యులు :

శ్రీ ప్రభాకర్ జీ

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావుగారు

శ్రీ పి. వి. ఎస్. మూర్తిరాజుగారు

శ్రీ రామకృష్ణదూత్ గారు

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

శ్రీమతి ఆర్. కె. అనంతలక్ష్మిగారు

శ్రీ పాతూరి నాగభూషణరావుగారు

(తత్వ ప్రచారక్)

శ్రీ ఎ. రామనాధంగారు

(గ్రామ సేవక్)

# గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

## సలహా సంఘ సభ్యులు

అధ్యక్షులు :

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు

ఉపాధ్యక్షులు :

ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

కన్వీనరు :

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సభ్యులు :

శ్రీ ఎస్. రామానంద్‌గారు

శ్రీ మోటూరి సత్యనారాయణగారు

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు

శ్రీ తెన్నేటి విశ్వనాధముగారు

శ్రీ కొడాలి ఆంజనేయులుగారు

శ్రీ వి. భానుమూర్తిగారు

శ్రీ కె. కొండయ్యగారు

# గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

## సంపాదక వర్గము



అధ్యక్షులు :

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సంపాదకులు :

శ్రీ తల్లాప్రగడ రామచంద్రరావు (కన్వీనరు)

శ్రీ పైడిమర్రి సత్యనారాయణమూర్తిగారు

సభ్యులు :

శ్రీ ఎస్. రామానంద్‌గారు

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

శ్రీ ముదుగంటి జగ్గన్నశాస్త్రిగారు

శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు

శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు

శ్రీ నండూరి వెంకటకృష్ణమాచార్యులుగారు

శ్రీ స్వామీ సత్యప్రకాశ్‌జీ ఉదాసీన్

# తెలుగులోనికి అనువదింపబడిన
# గాంధీజీ రచనలు

1. ఢిల్లీ దినచర్య
2. నా మతము
3. మన గ్రామ పునర్నిర్మాణము
4. నూతన విద్యా విధానము
5. అంటూ దిస్ లాస్ట్ (సర్వోదయ)
6. సర్వోదయ
7. నవీన విద్యాపథంలో
8. నిర్మాణ కార్యక్రమము

## అచ్చులో నున్నవి

9. పంచాయతీ రాజ్యము
10. సహకార సేద్యము
11. అస్పృశ్యతా నివారణ కార్యకర్తలకు
12. అహింసాత్మక సామ్యవాదము


**గాంధీ సాహిత్య ప్రచురణాలయము**

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

**కాకినాడ**